

# శ్రీకృష్ణార్జున సంవాదం

## వచన భగవద్గీత





ఎచట యోగేశ్వరుండు శ్రీకృష్ణు డుండు
పార్థు డెచ్చోట ధనువు చేబట్టి నిల్చు
విజయము, విభూతి, నీతి సంవృద్ధ మచట
అనెడి సంజయు మాట ముత్యాలమూట.

తెనుగు సేత :

ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తం



శ్రీకృష్ణార్జున సంవాద మనే

# వచన భగవద్గీత

"సకల ధర్మములన్ త్యజింపుము
ఒకే యొక నన్ శరణు వేడుము
సర్వక్రియలు మదర్పితముగా
నిర్వహించి విముక్తి గనుమా" -శ్రీకృష్ణుడు

తెనుగుసేత :

**ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తం**

విద్యాలంకార్ - బి-31, శ్రీనివాసనగర్ కాలని
గుంటూరు - 522 006, ఫోన్ : 230086

# SRII KRISHNAARJUNA SAMVAADAM

(A dialogue between the Lord Sri Krishna and the warrior Arjuna)

or

## The Bhagavad Giita in Telugu prose

1000 copies - September 1999

Written and published by :

**Dr. Boddupalli Purushotham**
*Retired Professor and Head of the Dept.*
*of Telugu and Oriental languages*
*Nagarjuna University, Nagarjuna Nagar*

Residence :
Vidyalankar B-31
S.V.N. Colony
GUNTUR - 522 006
Ph. 230086

Price : **Rs. 20/-** Twenty Rupees

Printed at :

**Sree Lakshmi Press**
14/2 Arundelpet
Guntur - 2
Ph. 230643

శ్రీకృష్ణార్జున సంవాద మనే

వచన భగవద్గీత

## విషయసూచి



## వచన భగవద్గీత రచన

## లక్ష్యాలు

1. శ్రీకృష్ణార్జునుల మధ్య సంవాదం సాధ్యమైనంతగా పెంచటం.
2. సామాన్యులకు గూడ భగవద్గీతావగాహనం చేకూర్చడం.
3. గీతపట్ల పరాయణత పెంపొందించటం.
4. గీత పారాయణానికి అధికంగా తోడ్పడటం.
5. సంస్కృతభాషా క్లిష్టత లేకుండా చేయటం.

### కృతజ్ఞత

ఈ వచన భగవద్గీత రచన ప్రచురణార్థం
అర్థిక సహాయ మందించిన
శ్రీమత్తిరుమల తిరుపతి దేవస్థానం వారికి
నా కృతజ్ఞతాభివందనాలు.

ఓం తత్ సత్



# అంకితముగొను కృష్ణభగవాన్!

వచనమున విరచించుకొంటిని
రుచిరమగు నీగీత నీగతి;
మదవగాహన పెంచుకొనుటకు
సదవకాశముగా తలంచితి ॥

సర్వదృక్పథ సమన్వయముగ
పర్వు భగవద్గీతమున్ శ్రీ
రామకృష్ణ మిషన్ వెలార్చెను
మామ కాధారమ్ము తత్ప్రతి ॥

ఎప్పుడో కొన్నట్టి తత్ప్రతి
అప్పుడపుడు పఠించి మక్కువ
వేదికలపై నాదు ప్రజ్ఞా
వాదములు వినిపింతు వేడుక ॥

మూలమే యీ వచన రచనకు
చాలవర కాధారమైనను
పెంచితిని సంవాదకళ నే
నంచితమ్మగుపట్ల, సైపుడీ ॥

మదవగాహనలోని దోషము
సదమలాత్ములు చూప వేడెద;
తెలియ దేసిద్ధాంత తర్కము
తలపు నే వక్రీకరింపను ॥

ఓ పరాత్పర! కృష్ణ!! భగవాన్!!
నీ పవిత్ర గభీర వాక్కుల
తెనుగు వచనీకరణ మిది గై
కొనుము నీ కంకిత మొనర్తును ॥

నీది నీ కంకిత మొనర్చిన
నాదు జన్మ తరించు స్వామీ!
నీవి నావిగ సంగ్రహించే
భావ మిక రానీకు కృష్ణా ॥

గీత వచనీకరణమున నా
చేతి కిచ్చితి మనుమరాలిని;
ఆమె పేరోజస్వి, నీవే
స్వామి! సంరక్షించు కృపతో ॥

గీతపై గల యసంఖ్యాకపు
వ్రాతలకు వందింతు భక్తిని;
యోగి శ్రీయరవింద వ్యాసుల
వాగమృత మాస్వాదనీయము ॥

జీవితము దివ్యీకరింపగ
చేవ గల దొక గీత మాత్రమె;
శరణ మొక్కటె సులభమార్గము
పరమగతి పయనింప జీవికి ॥

శరణ మది మన త్రికరణమ్ముల
పరగుచో సంపూర్ణమై చను;
నరుని జీవిత రథపుసారధి
పరాత్పరుడే తనకు తానగు ॥

అరమరిక లేమాత్ర మెరుగక
శరణు సంపూర్ణముగ నెఱపిన
పరగు పరివర్తనము తప్పక
నరు డగును నారాయణుండిల ॥

తాను వలచిన అదే రంభని
తాను మునిగిన అదే గంగని
తనదె సత్యము, అన్యములు కా
వని తలంచు టహంకరించుటె ॥

పూర్ణసత్య మిదే యిదే యని
నిర్ణయింపగ నెవరి తరమగు?
మానవాత్మకు తోచు పాక్షిక
మైన సత్యము; మాత్రమే సుమ!!

కాన సిద్ధాంతమ్ము మదిలో
పూను గీతావ్యాఖ్య కన్నను
గీత మూలమునే మథించుచు
చేత ముత్తేజింప మేలగు ॥

ఓ పరాత్పర! కృష్ణభగవాన్
సైపుమీ నాబాల చపలత;
కొనుము నీకృతికన్య నీవే
నను తరింపగ జేయుమీ కృప॥

ఓ పవిత్రా! పార్థసారథి!
ఓ పరంధామా! కృపామతి!!
నీ పదాంబుజ సేవ సల్పగ
శ్రీసతీ! నన్ సుకృతి చేయుమ ॥

**ఓం తత్ సత్**



# మహాత్ముని జనని

"నా అభిప్రాయంలో, అర్థంచేసుకోటంలో, గీత చాల సులభగ్రంథం. అపరిష్కృతంగా ఉండిపోయిన అనేక క్లిష్టసమస్యలకు పరిష్కారం భగవద్గీతలో లభిస్తాయి.

ఇప్పుడు నాకు భగవద్గీత, ఏ బైబిలో, ఖురానో వంటిది మాత్రం కాదు. అంత కన్న మిన్న. గీత నా జనని. నన్ను కన్నతల్లిని ఎప్పుడో పోగొట్టుకొన్నాను. కాని అప్పటినుండి ఈ అమరజనని నా చెంతనే ఉన్నది. తల్లి లేని కొరత తీర్చి కాపాడుతున్నది. నా కెప్పు డేకష్టం వాటిల్లినా, ఏ దుఃఖం ప్రాప్తించినా నన్నక్కున చేర్చుకొని సంరక్షిస్తున్న దీ మాతృదేవత.

నాకే కాదు, భగవద్గీత విశ్వజనని. ఆమె ఎవ్వరినీ త్రోసి పుచ్చదు. దరిచేరవచ్చే ప్రతివ్యక్తికీ ఆదరంతో కవాటం తెరచి ఉంచుతుంది. యథార్థంగా గీతనాశ్రయించే భక్తునికి, ఆశాభంగమంటే ఏమిటో తెలియదు. అతడు వర్ణనాతీత శాంతిని ఆనందాన్ని సదా అనుభవిస్తాడు. కాని అటువంటి శాంత్యానందాలు శంకాన్వితునకు గాని, పాండిత్యలోభునకుగానీ, కేవల బుద్ధికుశలునకుగానీ లభించవు. అవి వినయ వినమితశీలునకు మాత్రమే లభ్యం. నిశ్చలైకాగ్రచిత్తునకు, పూర్ణవిశ్వాసికే అవి సంప్రాప్తం.

పూర్ణవిశ్వాసంతో, వినయ వివేకశీలంతో గీత నారాధించి, నిరాశచెంది మరలిన వ్యక్తి కనిపించడు. "కర్మ చేయటానికి మాత్రమే మన మర్హులం. దాని ఫలంతో మనకు ప్రమేయం లేదు" అని గీత ముక్తకంఠంతో ప్రబోధిస్తున్నది. జయాపజయాలు ఏకవిషయమే నని గీత చెప్తున్నది.

వ్యర్థవాంఛలతో, శిక్షణలేని ఉద్రేకాలతో మనస్సుకు లొంగిపోవద్దని, వినిర్మల ధర్మంకోసం మనోవాక్కర్మతో భగవంతున కాత్మసమర్పణం చేసుకొమని గీత మనల్ని హెచ్చరిస్తున్నది.

ప్రతి ఉదయం గీతాపఠనంతో మీ నిర్దిష్ట కార్యక్రమాలు ప్రారంభించండి. ఆపదల్లో మనకండగా నిల్చేది ఒక్క గీతాపఠనం మాత్రమే. సర్వదుఃఖోపశమనం గీత పఠనమే. ఏకాంతవాస శిక్ష ననుభవించేటప్పుడు ఊరట కల్గించేది గీతా పఠనమే. మృత్యువు కబళిస్తున్నప్పుడు, గీతావాక్యాలు పెదవులపై నర్తిస్తే తప్పక బ్రహ్మనిర్వాణం మనకు ప్రాప్తిస్తుంది".

-మహాత్మగాంధి

# గీత వైశిష్ట్యం

గీతకు పూర్వం యోగ జ్ఞాన భక్తి సంప్రదాయాలు పూనికతో అవలంబించిన వారు లేకపోలేదు. కాని వారు పరస్పర వైరుధ్యం వహించి స్వమత ఘనతనే ప్రతిపాదించుకొన్నారు. సమన్వయ ప్రయత్నం చేయలేదు.

గీతాకారుడే సర్వసంప్రదాయాలు సమన్వయించటానికే ప్రప్రథమంగా ప్రయత్నించాడు. అన్నింటిలోని ముఖ్య విషయాలు గ్రహించి గీతాసూత్రాల్లో కూర్చాడు.

-స్వామి వివేకానంద

# గీతోపయోగం

నా శరీరాభివృద్ధికి తల్లిపాలు ఎంతగా ఉపయోగపడిందో, నా బుద్ధి వికాసానికి భగవద్గీత అంతకన్న మిన్నగా ఉపయోగపడిందనే అనవచ్చు.

-వినోబాభావే

ఓం తత్ సత్



# గీతామాత ధ్యానం

ఓ గీతా మాతా!
స్వయంగా, నారాయణ భగవానుని చేత
పార్థుడికి ప్రతిబోధితవు.
పురాణముని వ్యాసుని చేత
మహాభారత మధ్యభాగంలో
ప్రతిష్ఠితవు.
వర్షిస్తావు అద్వైతామృతం.
ద్వేషింప చేస్తావు పునర్జన్మ.
ధ్యానిస్తా నందుకే నిన్నమ్మా!

ఓ నిశిత విశాల బుద్ధీ!
పుల్లారవిందాయతపత్ర నేత్రా!
వ్యాసమునీంద్రా!
భగవద్గీ తనే జ్ఞానదీపాన్ని
భారతతైలంతో ప్రజ్వలింపజేసావు.
అందుకు నీ కివే మా ప్రణామాలు.

ప్రపన్న పారిజాతునకు
తోత్రవేత్రైకపాణికి
గీతామృత దోగ్ధకు
జ్ఞానముద్రునకు
శ్రీకృష్ణునకు నమస్సులు.

సర్వోపనిషత్తులు - గోవులు
గోపాలనందనుడు - దోగ్ధ.
పార్థుడు - వత్స.
పరమవివేకి - భోక్త.
గీతామృతం - మహద్దుగ్ధం.

వసుదేవ సుతునకు
కంస చాణూర మర్దనునకు
దేవకీ పరమానందునకు
జగద్గురునకు
దేవదేవునకు
వందనం.

భీష్మద్రోణులు - తీరాలు
జయద్రధుడు - నీరు
గాంధారరాజు - నీలోపలం
శల్యుడు - మొసలి
కృపుడు - ప్రవాహం
కర్ణుడు - తరంగాలు
అశ్వత్థామ వికర్ణులు - భయంకర మకరాలు
దుర్యోధనుడు - సుడిగుండం

ఇటువంటి కురుక్షేత్ర యుద్ధవాహినిని, శ్రీకృష్ణుడు కర్ణధారి కావటంచేతనే పాండవులు దాటగల్గారు.

ప్రభవించింది - పారాశర్యుని వాక్సరోవరంలో
వికసించింది - హరికథా ప్రసంగాలతో
సంయుక్తమైంది - వివిదోపాఖ్యాన కేసరాలతో
ఆస్వాదనీయ మధువు - కల్గిందహరహం, సజ్జన భ్రమరాలకు
నశింపజేస్తుంది - కలికల్మషం, గీతార్థసుగంధోత్కటంతో

అదే మహాభారత పంకజం
కావాలి మా కత్యంత శ్రేయస్కరం.

ఎవని కృప - మూగను వాచాలుణ్ని చేస్తుందో
కుంటిని గిరినైనా లంఘింపచేస్తుందో
ఆ పరమానంద మాధవునకు
వందన మందారాలు.

ఏ పరదేవతను
బ్రహ్మ వరుణేంద్ర రుద్ర మరుత్తులు
దివ్య స్తవరాజాలతో సంస్తుతిస్తారో

ఏ పరమేశ్వరుణ్ని
సాంగపదోపనిషద్వేదాలతో
సామగాయకులు గానం చేస్తారో

ఏ పరంధాముణ్ని
ధ్యానావస్థిత తద్గత మనస్సుతో
యోగులు దర్శిస్తారో

ఏ పరాత్పరుని ఆద్యంతాలు
సురాసుర గణాలకు కూడా అంతుపట్టదో

ఆ అనంత సచ్చిదానందునకు ప్రణామాలు.

## గీతా కల్పవృక్షం

శ్రీకృష్ణ భగవానునిచే నాటబడింది
వేదవ్యాస మునీంద్రునిచే ప్రవృద్ధమైంది
ఉపనిషత్తులే విత్తనంగా గలది
ప్రబోధ మనే అంకురంతో ఒప్పునది
సకల శాస్త్రరహస్యాలనే కొమ్మలుగా గలది
అనాసక్తి, క్షమ అనే చిగుళ్లతో కూడింది
శ్రీకృష్ణ పాదపద్మాలపట్ల భక్తి అనే సుగంధంతో శోభిల్లేది
గీతాకల్పవృక్షాన్ని సేవిస్తాను.

**ఓం తత్ సత్**



# కురుక్షేత్రం

కౌరవవంశ మూలపురుషుడు 'కురు' అనే పేరు గల రాజర్షిసత్తముడు. ప్రజానురంజక పరిపాలకుడు. ధర్మనిరతుడు. అతనికి లోకోపకారక సత్కార్యానుష్ఠాన మంటే అత్యంతాసక్తి. నిరంతరం ప్రపంచమంతా పర్యటిస్తూ ఎక్కడ ఏ పనిచేస్తే ఉత్తమంగా ఉంటుందా అని ఆలోచిస్తూ ఉండేవాడు.

అత డొకనాడు 'శ్యమంతక పంచము'నే బ్రహ్మాస్థానమైన ఉత్తరవేది ప్రవేశించాడు. అతడు రథం దిగి ఆ క్షేత్రం పారచూచాడు. ఆ ప్రదేశం గొప్ప పుణ్యస్థలి, ధర్మక్షేత్రం కావటానికి యోగ్యమైందిగా అతని కనిపించింది. దాన్ని బాగా సంస్కరించాలని సంకల్పించాడు. వెంటనే బంగారు నాగలి తెప్పించాడు. శివుణ్ని ప్రార్థించి ఆయన వాహనమైన ఎద్దును, యమధర్మరాజు నర్థించి ఆయన వాహనమైన దున్నపోతును రెండువైపుల ఆ నాగలికి పూన్చి ఆ క్షేత్రం దున్న నారంభించాడు.

ఆ సమయంలో ఇంద్రుడు వచ్చి "ఏం చేస్తున్నావు రాజర్షీ!" అని ప్రశ్నించాడు. దానికి సమాధానంగా "ఈ క్షేత్రం దున్ని తపము, సత్యము, క్షమ, దయ, శౌచము, దానము, యోగము, బ్రహ్మచర్యము అనే అష్టాంగధర్మం పండించాలని సంకల్పించాన"ని పేర్కొన్నాడు.

"అయితే అందుకు కావలసిన బీజా లెక్కడినుండి తెస్తావ"ని ఇంద్రు డధిక్షేపించి వెళ్లిపోయాడు.

ఇందుకు కురుచక్రవర్తి ఏమాత్రం నిరుత్సాహపడలేదు. నిరంతరాయంగా ఏడు క్రోసుల విస్తీర్ణం గల ఆ క్షేత్రం దున్నుతునే ఉన్నాడు.

ఆ రాజన్యుని అమోఘ కృషి దీక్షకు శ్రీహరి హర్షించి ప్రత్యక్షమైనాడు. ఇంద్రుడి లాగానే శ్రీహరి కూడా ప్రశ్నించాడు. కురురాజు ఇంద్రుడి కిచ్చిన సమాధానమే శ్రీహరికీ ఇచ్చాడు.

"అయితే ఓ రాజర్షీ! ఆ అష్టాంగయోగానికి కావలసిన బీజాలెక్క డున్నాయో చెప్పు. వాటిని సంపాదించి చల్లుతాను. నీకు శక్తికొలది సహాయపడతాన"న్నాడు శ్రీహరి.

శ్రీహరి మాటలు రాజర్షికి ప్రమోదం కల్గించాయి. "ఎక్కడో ఎందుకు? ఇదిగో ఈ శరీరంలోనే ఆ బీజాలున్నాయి. స్వీకరించి చల్లండ"ని తన చేయి చాపాడు కురుభూపతి. శ్రీహరి తన చక్రంతో చక్రవర్తి హస్తం ఖండఖండాలు గావించాడు. రాజు ఏమాత్రం సంచలించలేదు. "ఈ బీజాలు సరిపోవు గదా!'. అని విష్ణు వనగానే రాజర్షి రెండో చేయి చాపాడు. దాన్నీ ముక్కలు ముక్కలు చేసాడు శ్రీహరి. ఆ తరువాత కుడితొడ, ఆమీద ఎడంతొడ, రాజేంద్రుడు చాపగా శ్రీహరి వాటిని గూడా తుత్తునియలు చేసాడు. ఇంకా చాలవేమో అని సందేహాస్పదంగా శ్రీహరి చూస్తుంటే కురురాజు తన శీర్షం వంచాడు.

రాజర్షికి దేహం పట్ల ఏమాత్రం లేని వ్యామోహం శ్రీహరిని ఆశ్చర్యపరచింది. రాజర్షి కార్యనిరతికి, త్యాగగరిమకు శ్రీహరి ప్రసన్నుడై వరం కోరుకొమ్మని కోరాడు. "దేవా! నేను సంకల్పించి దున్నిన ఈ పవిత్రభూమి అష్టాంగధర్మం పండించే ధర్మక్షేత్రంగా విలసిల్లచేయవలసింద"ని అభ్యర్థించా డా రాజర్షి.

'తథాస్తు' అని శ్రీహరి అంతర్ధానమైనాడు. కురురాజుకు పూర్వశరీరం లభించింది. అప్పటినుండి ఆ శమంతక పంచకం కురుక్షేత్రంగా ప్రసిద్ధి వహించింది. అక్కడే శ్రీకృష్ణభగవానుడు అర్జునుడికి పదునెన్మిది అధ్యాయాల శ్రీమద్భగవద్గీత వినిపించాడు.

కురురాజులాగా అకుంఠిత దీక్షతో మన శరీరాల్ని సంస్కరించి అష్టాంగయోగం పండిస్తే, నిరంతరం శ్రీమద్భగవద్గీతను పారాయణంచేసి ఒంటపట్టించుకుంటే, ఇవీ ధర్మక్షేత్రాలయిన కురుక్షేత్రాలు అవుతాయి. అసురశక్తులు నశిస్తాయి. సురశక్తులు విజయిస్తాయి.

వామనపురాణం మనకీ విషయం విశదపరుస్తున్నది.

**"శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్"**

**ఓం తత్ సత్**



# శ్రీకృష్ణార్జున సంవాదం అనే
# వచన భగవద్గీత
# నాందీ ప్రస్తావన

"ఎచట యోగేశ్వరుండు శ్రీకృష్ణు డుండు
పార్థు డెచ్చోట ధనువు చేబట్టి నిల్చు
విజయము, విభూతి, నీతి, సంవృద్ధ మచట"
అనెడి సంజయుమాట ముత్యాలమూట.

కర్మచేసి యెవడు కర్మచేయని వాడౌ
కర్మ చేయకుండ కర్మపరుడౌ
జ్ఞాన భక్తులెల్ల కర్మసంసిద్ధికే
జగతి ననెడి గీతప్రగతి కనుడి.

గంగ యమున సరస్వతి సంగమముగ
జ్ఞాన భక్తి కర్మలకు సంగమము గీత;
నరుడు దాని లోలోతుల స్నానమాడు
కొలది పరిపూర్ణయోగ కౌశలము గాంచు ॥

సాధనమ్ము కన్న సాధ్యమ్ము మిన్నను
తారతమ్య మెన్న తగదొకింత;
సాధనమ్ము గూడ సాధ్యమ్ముతో పాటు
దాత్తమైన ఫల ముదాత్త మగును ॥

తరచి చూడ జీవితము కురుక్షేత్రమ్ము
నరుడు - వీరవరుడు నరుడు; దుష్ట
వాంఛవితతి కౌరవాళి; వారిని జంప
కృష్ణగీత ప్రోత్సహించు నరుని ॥

హృదయ దౌర్బల్యమ్ము క్షుద్రము
వదలి వేగ పరాక్రమింపుము;
తగదు కార్పణ్యమ్ము; క్లైబ్యము,
తగదు కర్మపలాయనమ్మును ॥

నిరత కర్మాచరణమందే
పరగు నీ సకలాధికారము;
ఫలాపేక్షోపేత కర్మను
పలాయనమగు కర్మకుశలత ॥

తన మనో వాక్కర్మములచే
తను సదా పర్యుపాసించెడి
జనుని యోగక్షేమ సంర
క్షణము భగవంతుండె చూచును ॥

"ఏది చేసిన; ఏది తినినా
ఏది యజ్ఞము తపమొనర్చిన
సర్వక్రియలు మదర్పితముగా
నిర్వహించి విముక్తి గనుమా!"

నన్ను గూర్చే కర్మసల్పుము
నన్నె శరణను పరమగతిగా
దేనిపై సంగమ్ము వైరము
లేని మనుజుడు నన్నె పొందును.

"సకల ధర్మములన్ త్యజింపుము
ఒకేయొక నన్ శరణువేడుము;
పాపపుణ్యామోఘ శృంఖలు
రూపుమాపెద; మోక్ష మొసగెద ॥"

అనెడి భగవద్గీత సారము
వినుము నిత్యవినూతనముగా;
మనుము తాత్త్వక సత్యసుందర
ఘనతరానందానుభూతిని ॥

యోగివై కర్మల నొనర్చుము
త్యాగివై భుజియింప గల్గుము
మౌనివై భాషణము నెరపుము
ధ్యానివై దర్శింపు సర్వము ॥

నీకు మోక్షము, జగద్ధితమును
చేకురెడి కర్మల నొనర్చుము;
శత శరత్తులు బ్రదుకుమీ జీ
విత మహాయజ్ఞాధిపతిగా ॥



## శ్రీకృష్ణార్జున సంవాద మనే
## వచన భగవద్గీతలో
# 1. అర్జున విషాదయోగం

### ధృతరాష్ట్రుడు :

ధర్మక్షేత్రమైన కురుక్షేత్రానికి యుద్ధాభిలాషతో చేరుకొన్నారు మా కుమారులు, పాండుపుత్రులు అన్నావుగా సంజయా! ఆ తరువాత ఏం జరిగిందో వివరించవూ.

### సంజయుడు :

ఆజ్ఞ మహారాజా! ఆలకించండి! మనోనేత్రంతో సందర్శించండి. పాండవానీకం పన్నిన వ్యూహం చూచి రాజు దుర్యోధనుడు ఆచార్య ద్రోణుల వారిని సమీపించి ఏమన్నారో వినండి!

### దుర్యోధనుడు :

ఆచార్యా! మీ శిష్యుడు, ధీమంతుడు, ద్రుపదతనయుడు, ధృష్టద్యుమ్నుడు వ్యూహాకారంగా దిద్దిన పాండవమహాసైన్య మిదిగో! పరికించండి! పాండవ సేనలో భీమార్జున సములు, మహాధనుర్ధారులు శూరులు అరుగో. సాత్యకి, విరాటరాజు, మహారాజు ద్రుపదుడు, అడుగో అతడు, శిశుపాలకుమారుడు ధృష్టకేతుడు.

యదువంశవీరుడు - చేకితాను డతడు. వీర్యవంతుడు కాశీరాజు ప్రక్క చూడండి. అతడు పురుజిత్. ఆతని చెంత కుంతిభోజుడు. ఆతడు నరపుంగవుడు - శైబ్యుడు. పరాక్రమశాలి - యుధామన్యుడతడు. మహాశక్తిశాలి అభిమన్యుణ్ని చూచారుగా. అరుగో ద్రౌపదేయులు - ప్రతివింధ్యాదులు. వీరందరూ మహారథులు.

ద్విజోత్తమా! ఇక మన పక్షంలో ఎవరు విశిష్టులో, ఎవరు నాయకులో మీకు పరిచయం చేస్తాను - చూడండి. వీరు భీష్ములు, కర్ణుడు, కృపాచార్యుడు, అశ్వత్థామ, మా తమ్ముడు వికర్ణుడు, భూరిశ్రవుడు, జయద్రథుడు ఇంకా ఎందరెందరో శూరులు మాకోసం ప్రాణార్పణానికి సంసిద్ధులు. అందరూ

నానాశస్త్రప్రహరణ నిపుణులు. యుద్ధవిద్యావిశారదులు. గురువర్యా! మన పక్షం భీష్మాభిరక్షితమే అయినా ఎందుకో అపర్యాప్త మనిపిస్తున్నది. పాండవ పక్షం భీమాభిరక్షితమైనా పర్యాప్త మనిపిస్తున్నది. అందుచేత మీరంతా అన్ని వ్యూహద్వారాల్లో యథాస్థానాల్లో అవస్థితులై భీష్మపితామహుల్ని అభిరక్షించాలి.

### సంజయుడు :

మహారాజా! ఆవిధంగా దుర్యోధనులవారి ప్రోత్సాహకర వాక్యాలు పురస్కరించుకొని ప్రతాపశాలులు, కురువృద్ధులు, పితామహులు భీష్మలవారు ఉచ్చైస్వరంతో సింహనాదం చేసారు. శంఖం పూరించారు.

వెనువెంటనే వేలాది శంఖాలు, భేరులు, ఢక్కా మృదంగ రణశృంగాలు ఒకేసారి భీషణంగా మారుమ్రోగాయి. ఆవెంటనే శ్వేతాశ్వరథారూఢులు కృష్ణార్జునులు తమ తమ దివ్యశంఖాలు పూరించారు. హృషీకేశుని పాంచజన్యాన్ని, ధనంజయుని దేవదత్తాన్ని అనుసరిస్తూ భీమకర్ముడు వృకోదరుని పౌండ్రం, యుధిష్ఠిరుని అనంతవిజయం, నకులుని సుఘోషం, సహదేవుని మణిపుష్పకం అనే దివ్యశంఖాలు ఒకేమారుగా పూరింపబడ్డాయి.

పృధివీపతీ! ఇదేవిధంగా మహాధనుర్ధరుడు కాశీరాజు, మహారథుడు శిఖండి, ధృష్టద్యుమ్నుడు, విరాటుడు, అపరాజితుడు సాత్యకి, ద్రుపదుడు, ద్రౌపదేయులు, మహాబాహువు సౌభద్రుడు నలువైపుల నుండి వేరువేరుగా తమ తమ శంఖాలు శక్తికొలది ఊదారు. ఆ తుముల శంఖ ఘోషకు ధార్తరాష్ట్రుల హృదయాలు దద్దరిల్లాయి. భూనభోంతరాలు మారుమ్రోగాయి.

మహీపతీ! కపిధ్వజుడు అర్జునుడు ధార్తరాష్ట్రుల యుద్ధసంసిద్ధత గమనించి శస్త్రసంపాత ప్రవృత్తుడై ధనువు చేబూని హృషీకేశునితో ఏమన్నాడో వినండి :

### అర్జునుడు :

అచ్యుతా! యుద్ధకాములై వచ్చిన వీరవరుల నందరిని చూచి, ఎవరెవరితో నేను పోరాడాలో గ్రహించాలి. దుర్బుద్ధి దుర్యోధను డీకురుక్షేత్రంలో తన అభీష్టసిద్ధి కేయే వీరపురుషుల్ని సంసిద్ధం కావించాడో వారందరినీ బాగా తిలకించే వరకు ఉభయసేనా మధ్యంలో నా రథం నిల్పు.

**సంజయుడు :**

మహారాజా! గుడాకేశు డర్జును డారీతిగా ఆదేశించగానే హృషీకేశుడు రథోత్తమాన్ని ఉభయసేనా మధ్యంలో భీష్మద్రోణాది ప్రముఖులకు, ఇతర మహీపతులకు ఎదురుగా నిలబెట్టి అంటున్నాడు.

**శ్రీకృష్ణ భగవానుడు :**

ఇదిగో! యుద్ధసన్నద్ధమైన కౌరవపక్షం. అరుగో! పితృసములు, భూరిశ్రవాదులు. వారే పితామహులు భీష్ములు. ద్రోణాది ఆచార్యులు, శల్యాది మాతులాదులు, దుర్యోధనాది భ్రాతలు, లక్ష్మణాది పుత్రస్థానీయులు, అశ్వత్థామాది మిత్రులు, కృతవర్మాది సుహృదులు. ఇంకా పౌత్రులు, మామలు అక్కడే ఉన్నారు. అందరినీ బాగా పరికించు.

**అర్జునుడు :**

బావా! యుద్ధాభిలాషులైన గురుబాంధవ మిత్రాదుల్ని సమీక్షించేకొద్దీ, ఎందుకో నా హృదయం కృపావిష్టమౌతున్నది. దుఃఖం పెల్లుబుకుతున్నది. సర్వాంగాలు క్రమంగా పట్టుతప్పుతున్నాయి. నోరెండుతున్నది. శరీరం కంపిస్తున్నది. పులకలు దేహమంతా అంకురిస్తున్నాయి. గాండీవం చేజారుతున్నది. చర్మం మండిపోతున్నట్లుంది.

కేశవా! ఎందుకో నిలకడగా వుండలేకపోతున్నాను. మనస్సు పరిపరివిధాల పరిభ్రమిస్తున్నది. విపరీత శకునాలు కూడా గోచరిస్తున్నాయి.

కృష్ణా! ఆహవరంగంలో స్వజనాన్ని హతమార్చి నేను సాధించే శ్రేయ స్సేమిటో? కాంక్షించను - విజయం. ఆకాక్షించనేమాత్రం రాజ్యసుఖాలు.

గోవిందా! రాజ్యం వల్ల ఏం ప్రయోజనం? భోగజీవితం దేనికి? ఎవరికోస మీ రాజ్యం, ఈ భోగాలు, సుఖాలు ఆకాంక్షిస్తున్నామో ఆ గురువులు, తండ్రులు, పుత్రులు, పితామహులు, మేనమామలు, మామలు, మనుమలు, బావలు, చుట్టాలు తమ ధన ప్రాణాలపై ఆశలు వదలుకొని యుద్ధరంగానికి వచ్చారు.

మధుసూదనా! ఈ వీరులు మనల్ని చంపినా ఎందుకో నాకు వీరిని చంపాలనిపించటం లేదు. ఈ రాజ్యమే కాదు, త్రైలోక్యరాజ్యమే ప్రాప్తిస్తుందన్నా నాకు వీరిని చంపాలని లేదు.

జనార్దనా! ధార్తరాష్ట్రుల్ని చంపితే మనకేం సుఖం? వాళ్లు ఆతతాయులే. వారిని చంపటం శాస్త్రసమ్మతే కావచ్చు. అయినా ఎందుకో నా మనస్సు సమ్మతించటం లేదు. అందుచేత మాధవా! దుర్యోధనాదుల్ని, వారి బంధువుల్ని వధించటం భావ్యం కాదనే నా నిర్ణయం. స్వజనాన్ని వధించి, ఏవిధంగా చూచినా సుఖించలేము. వీరందరూ లోభోపహతచేతస్కులు. కులక్షయం వల్ల కల్గే దోషాలు, మిత్రద్రోహం వల్ల కల్గే పాతకాలు తెలుసుకోలేరు.

జనార్దనా! కులక్షయ కృతమైన దోషం పొరచూడగలవాళ్లం, మనం. అందుచేత మనమే దాని నుండి నివృత్తులం కావటం వివేకం కదా!

కృష్ణా! ఈ అధర్మం వల్ల కులస్త్రీలు కులటలయ్యే అవకాశమెంతో వుంది. అందువల్ల వర్ణసంకర మేర్పడుతుంది.

వర్ణసంకరమైతే కులనాశకులు నరకానబడతారు. వీరే కాదు, వీరి పితరులూ లుప్తపిండోదకక్రియులై నరకంపాలౌతారు. వర్ణధర్మాలు, కులధర్మాలు, ఆశ్రమధర్మాలు సమూలంగా నశిస్తాయి.

మనం మహాపాపానికి ఒడిగట్టాం, రాజ్యసుఖలోభులమై స్వజనహంతలం కాబోతున్నాం.

అప్రతీకారుణ్ని, అశస్త్రపాణిని అయిన నన్ను శస్త్రపాణులు, ధార్తరాష్ట్రులు రణరంగంలో హతమార్చినా అది నాకు క్షేమంగానే భావిస్తాను.

**సంజయుడు :**

మహారాజా! అర్జును డీరీతిగా మాట్లాడి విల్లమ్ములు విడిచిపెట్టి శోకసంవిగ్న మానసుడై రథంలో కూలబడ్డాడు.

* * *

ఈ మహోదాత్త సంవాద మెవడు వినిన
శ్రద్ధ చదివిన ఆత్మవిజ్ఞాని యగును;
ఆ పరాత్పరుని యనుగ్రహమ్ము పొందు
కాంతిపథమున పయనింపగలడు నరుడు!

**ఓం తత్ సత్**



# శ్రీకృష్ణార్జున సంవాద మనే
# వచన భగవద్గీతలో
# 2. సాంఖ్యయోగం

### ధృతరాష్ట్రుడు :

సంజయా! అంతా ఏమిటో అయోమయం. విస్మయావహం. వీరాగ్రేసరు డర్జున పుత్రుడిలో హటాత్తుగా గల్గిన విపరీత పరిణామం వింతగా వుంది.

ఉత్తరగోగ్రహణ సందర్భంలో నరోత్తముడు, భీష్మ ద్రోణ కృప కర్ణాది ధన్వినికరాన్ని తిరోన్ముఖం కావించిన తిరుగులేని ధీరు డిప్పుడింతగా యుద్ధ పరాఙ్ముఖుడైనాడంటే నమ్మశక్యంకాదు. అంతా విధి ఆడుతున్న నాటకం. కాకేమిటి?

ఫల్గున కుమారుని వంటి జాతి సంక్షేమవాది, భూతదయార్ద్రహృదయుడు, సానుతాపుడు ఇంకోణ్ని ఊహించలేం.

అతని భవిష్యద్దృష్టి నిశితం. యుద్ధానంతరం దేశం ఎటువంటి అధ్వాన్న స్థితికి దిగజారుతుందో విశదంగా వీక్షించే విజ్ఞుడతడు. అతని గురుభక్తి, బంధుప్రీతి, సోదరాభిమానం అనన్యసామాన్యం.

నీవు నీ రాయబారంలో ఆశించిన పాండవోచిత ప్రవర్తన, పార్థివుడిలో ఇప్పుడు కొంత ప్రదర్శితం కదూ! సంజయా!!

### సంజయుడు :

మహారాజా ! ఈ సేవకునిపై మీకుండే అభిమానమలా గోచరింప చేస్తున్నదేమో?

### ధృతరాష్ట్రుడు :

అభిమానంకాదు, గిభిమానం కాదు. పాండవులంతటి ఉత్తమ సంస్కారులకు యుద్ధకండూతి తగదని సరిగ్గా నా మనసులోని మాటే పాండవ సభలో నీవు

ఆమ్రేడించావు. అర్జునుని మీద నీ సందేశ ప్రభావం ఇప్పటికిలా ప్రసరించి వుండవచ్చు. ఈ సందర్భంలో ఆ సరస సందేశ సార వాక్యా లాలకించాలని వుంది.

**సంజయుడు :**

చిత్తం, మహారాజా!! వినండి.

కం॥ పాలీక కౌరవులు దు
శ్శీలత చెడదలచిరేని చెప్పెద రుధిరా
ఖీలాన్నంబున కంటెను
మేలగు భిక్షాన్నమైన మీ నడవడికిన్ ॥

యుద్ధ విషయంలో చేసిన హెచ్చరిక ఇదిగో ఆలకించండి.

అఖిల జనక్షయంబయి
జయాపజయంబులు రెండునున్ తుదిన్
సుఖములు గాని యీ పనికి
జొత్తురె యుత్తము? లట్లుగాక యీ
నిఖిల సుఖంబు లేమిటికి?
నీవని వృద్ధచయంబు బాలురన్
సఖులను బంధులన్ గురుల
జంపితివేని దయాపయోనిధీ!

**ధృతరాష్ట్రుడు :**

ఆ దయాపయోనిధి యుధిష్ఠిరుడు కాడు, అర్జునుడే అనాలి. ఇంతకూ ఆ నరుని దైన్యానికి, ఆ నారాయణుని స్పందన ఏమిటో!!

**సంజయుడు :**

ఆవిధంగా కృపావిష్టుడు, అశ్రుపూర్ణాకులేక్షణుడు, విషణ్ణుడు అయిన అర్జునుణ్ని మధుసూదనుడు ఏరీతిగా, ఎంతతీవ్రంగా మందలించాడో! ఆలకించండి!!

**శ్రీకృష్ణ భగవానుడు :**

అర్జునా! ఈ విషమవేళ అనార్యజుష్టము, అస్వర్గ్యము, అధోగతి దాయకము, అకీర్తికరము అయిన కశ్మలం నీ కెక్కడి నుండి దాపురించిందో!! పార్థా! క్లైబ్యం తగదెంతమాత్రం - నీవంటి వీరుడికి. పరంతపా! క్షుద్రమైంది హృదయదౌర్బల్యం. విడచిపెట్టు. లే. యుద్ధానికి సంసిద్ధుడవుకా.

**అర్జునుడు :**

అరిసూదనా! పూజార్హులు - భీష్మ ద్రోణపాదులు. వారితోనా యుద్ధం? మధుసూదనా! వారిపై బాణప్రయోగానికి నా చేతులెట్లాడుతాయి?

**శ్రీకృష్ణ భగవానుడు :**

శత్రుపక్షంలోనివారు గురువులని, లఘువులనే విచక్షణ వీరు డెవ్వడూ చెయ్యడు. ఎవరినైనా సంహరించి తీరాలి. ఇప్పుడు నీ వైఖరేమిటో విదితం కావటంలేదు.

**అర్జునుడు :**

అయితే వివరిస్తాను వినండి. మహానుభావులు గురువుల్ని వధించకుండా ఇహలోకంలో బిచ్చమెత్తుకొని బ్రతకటమే నాకు శ్రేయోదాయక మనిపిస్తుంది.

గురుజనుల్ని హతమార్చి రక్తసిక్తమైన అర్థకామా లనుభవించాలనే ఇచ్ఛ నాకేకోశానా లేదు.

మనం జయిస్తామా? కౌరవులు జయిస్తారా? ఈ రెంటిలో ఏది గొప్పో ఏది తక్కువో తెలియటం లేదు. మనం జయించినా అది పరాజయమే. ఎందుకంటే వాళ్లను వధించి జీవించాలనే యిచ్ఛ లేదు కాబట్టి.

నా మనస్సు నిలకడగా లేదు. నన్ను కార్పణ్యదోషం హతమారుస్తున్నది. యుద్ధం చేయకుండా భిక్షావృత్తి చేబట్టాలా? లేకపోతే క్షత్రియధర్మ మనుసరించి యుద్ధం చేయాలో నిశ్చయించుకోలేని మూఢ చేతస్కుణ్ని. నాకేది శ్రేయోదాయకమో నీవే నిశ్చయించి చెప్పు.

నేను నీ శిష్యుణ్ని. శరణాగతుణ్ని. తగినరీతిగా ఉపదేశించు. నా అంతట నేనో నిర్ణయానికి రాలేని దీనస్థితిలో ఉండి నిన్నాశ్రయిస్తున్నాను.

శత్రుహీనము, సమృద్ధమూ అయిన భూలోకరాజ్యంగానీ, లేక స్వర్గాధిపత్యం కానీ సంప్రాప్తించినా, నా సర్వేంద్రియాల్ని శోషింపజేసే ఈ శోకం నివారించుకోటానికి శక్తి చాలకుండా వున్నది.

**సంజయుడు :**

మహారాజా! ఈవిధంగా గుడాకేశుడు హృషీకేశునితో పల్కి "నేను యుద్ధం చేయను" అని మౌనం వహించాడు.

భారతా! రెండు సేనల మధ్యలో విషాదగ్రస్తుడైన అర్జునుణ్ని చూచి శ్రీకృష్ణభగవానుడు చులకనగా చిరునగవు చిందిస్తూ అన్నమాట లాలకించండి.

**శ్రీకృష్ణ భగవానుడు :**

ఎవరికోసం శోకింపగూడదో వారికోసం శోకిస్తున్నావు. అంతేకాక ప్రజ్ఞావాదాలు చేస్తున్నావు. ఇది పండిత లక్షణం కాదు. ఎందుకంటే పండితులెవ్వరూ గతించినవారిని గూర్చికానీ, ఉన్నవారిని గూర్చికానీ శోకింపరు.

**అర్జునుడు :**

ఉన్నవారు గతిస్తుంటే ఎందుకు శోకించకూడదు? శోకిస్తే తప్పేమిటి?

**శ్రీకృష్ణ భగవానుడు :**

అది సామాన్య లక్షణం. వాస్తవం తెలిస్తే శోకింపరు. ఉదాహరణకు - నే నిప్పుడున్నాను. పూర్వం లేను అనుకోవటం నిజం కాదు.

అదేవిధంగా నీవున్నూ. ఈ రాజులందరూ అంతే. పూర్వం లేరని భావించటం అజ్ఞానం. అంతేకాదు. భవిష్యత్తులో కూడా మనమందరం ఉంటాం.

అర్జునా! జీవుని దేహానికి బాల్యం, కౌమారం, యౌవనం, వార్ధకం ఎలా అనివార్యమో, అలాగే దేహాంతరప్రాప్తి కూడా అనివార్యం. ఈ రహస్యం తెలుసుకున్న ధీరుడెవడూ దేహంమీద మోహం పెంచుకోడు.

**అర్జునుడు :**

కృష్ణా! నేను భీష్మాదుల కోసం కాదు బాధపడటం. వారి వియోగం వల్ల దుఃఖం కల్గుతుందని భయపడుతున్నాను.

### శ్రీకృష్ణ భగవానుడు :

దుఃఖం కాని సుఖం గాని ఎలా సంప్రాప్తిస్తుందో తెలుసుకొంటే అసలు దుఃఖమే దరిచేరదు సుమా. విషయేంద్రియ సంయోగం వల్ల శీతోష్ణాలు, సుఖదుఃఖాలు అనుభవమౌతాయి. అదేవిధంగా ప్రియజన సంయోగ వియోగాల వల్ల సుఖదుఃఖాలు సంభవం.

ఈ ఉత్పత్తి వినాశాలు అనిత్యాలు, నీవంటి ధీరుడు వీటిని సహించాలి గానీ వీటికి సంచలించకూడదు. ఈ సహనాన్నే 'తితిక్ష' అంటారు. 'తితిక్షస్వ' - తితిక్ష కల్గివుండు.

పురుషపుంగవా! ఏ పురుషు డీసుఖదుఃఖాదుల్లో సమభావం సాధిస్తాడో, ఏ ధీరుణ్ని అవి బాధపెట్టవో అతడే అమృతత్వం పొందటానికి తగిన అధికారి.

### అర్జునుడు :

శీతోష్ణాదు లత్యంతం దుస్సహం కదా! వీటిని సహించటం ఎట్లా? సహిస్తే ఆత్మవినాశం కల్గదా?

### శ్రీకృష్ణ భగవానుడు :

ఈ శంక అసంగతం. ఎందుకంటే తత్త్వవిచారం చేసుకొంటే ద్వంద్వాలు సహించే శక్తి కల్గుతుంది.

ఆ తత్త్వం కొంత వివరిస్తాను విను. అసత్తుకు భావం లేదు. అంటే అస్తిత్వం, లేక ఉనికి అనేది లేదు. ఆవిధంగానే సద్వస్తువుకు అభావం లేదు. అందుచేత తత్త్వవేత్తలు సదసద్వస్తువుల యథార్థ స్వరూప స్వభావాలు తెలిసికొని తగురీతిగా ప్రవర్తిస్తారు.

సుఖదుఃఖాది ద్వంద్వాలు ఆత్మవి కావు. దేహానివి. దేహతాదాత్మ్యం కాక ఆత్మతాదాత్మ్యం కల్గితే నీవు ద్వంద్వాతీతుడ వవుతావు.

### అర్జునుడు :

ఆత్మ అంటే ఏమిటి? దాని లక్షణా లెటువంటివి? తెలిసేటట్లు వివరించు భగవాన్!

### శ్రీకృష్ణ భగవానుడు :

ఏది ఈ జగత్తునంతా సాక్షిరూపంగా వ్యాపించి వున్నదో, అది ఆత్మ. ఆ ఆత్మ నాశరహితం. అది అవ్యయం, దాన్ని నాశనంచేయటాని కెవ్వరూ సమర్థులు కారు.

ఆత్మ నిత్యం, అవినాశి, అప్రమేయం. శరీరాలన్నీ నశించేవే. కాని ఆత్మ మాత్రం శాశ్వతం. అందుచేత ఓ భారతా! నీవు యుద్ధం కావించు. శోకమోహాలు పోనాడు. నీవు పడగొట్టేది శరీరాలనే. ఆత్మను కాదు. ఆత్మ ఎవరినీ చంపదు. ఎవరిచేత చంపబడదు. ఇది అవికారి. ఇది పుట్టేది కాదు, గిట్టేది కాదు. ఈవిధంగా ఆత్మను తెలుసుకొన్న వాడెవడూ ఓ పార్థా! తా నెవరినో చంపుతున్నానని భావించనే భావించడు.

ఇంకా తెలిసేటట్లు చెప్పమంటావా? విను. ఏవిధంగా మనిషి జీర్ణవస్త్రాలు విసర్జించి, నూత్నవస్త్రాలు ధరిస్తాడో, అట్లాగే జీవాత్మ పనికిరాని శరీరాలు వదలి, క్రొత్త శరీరాలు పొందుతుంది. కర్మానుభవం కోసమే ఈ నూత్న దేహధారణం. కాబట్టి ఈ దేహాల్ని గూర్చి దుఃఖించకూడదు. దుఃఖిస్తే అంతకన్న అవివేకముండదు.

### అర్జునుడు :

అయితే కృష్ణా! పంచభూతాలు కూడా ఈ ఆత్మ నేమీ చేయలేవా?

### శ్రీకృష్ణ భగవానుడు :

ఎటువంటి అస్త్రమైనా శస్త్రమైనా ఈ ఆత్మ నేమాత్రం ఛేదించలేవు. అగ్ని దహించలేదు. నీరు తడపలేదు. గాలి శోషింపచేయలేదు. ఇది నిత్యం. సర్వవ్యాప్తం. ఇది స్థాణువు. అచలం. సనాతనం.

ఇది యింద్రియాల కగోచరం. మనస్సుకు అతీతం. అచింత్యం. అందువల్ల అర్జునా! ఈ ఆత్మతత్త్వం గ్రహించి శోకం విసర్జించు.

ఓ మహాబాహూ! ఈ ఆత్మ నిత్యజాతం. ఇది పుట్టే ప్రతి శరీరంతో పాటు పుడుతున్నట్లుగాను, నశించే ప్రతి శరీరంతో పాటు నశిస్తున్నటులగా భావించినా దీనికోసం నీవు దుఃఖించటం భావ్యం కాదు. ఎందువల్ల అంటే పుట్టేవాడికి గిట్టక తప్పదు కదా! అట్లాగే గిట్టేవాడు తిరిగి పుట్టక తప్పదు. ఇది అపరిహార్యం. కాబట్టి నీవు దుఃఖించటం భావ్యం కాదు. భారతా! దేహాలు కర్మజన్యాలు. వీటి జనన

మరణాలు చూచి, దుఃఖించ కూడదు. ఈ జీవకోటి శరీరాలు ఉత్పత్తికి ముందు అగోచరం. మధ్య కాలంలో మాత్రమే కనిపిస్తాయి. నశించిన తరువాత కనిపించవు. ఈ మధ్యకాలపు ఉనికిని గూర్చి నీకీ పరిదేవనం దేనికి? ఇదో కలలాంటిదిగా భావించు. అంతే. అర్జునా! ఆత్మను గూర్చి ఎంత చెప్పినా ఇంకా ఎంతో చెప్పవలసి ఉంటుంది.

ఒకడు దీన్ని ఆశ్చర్యవత్తుగా చూస్తాడు. ఇంకోడు ఆశ్చర్యవత్తుగా చెప్తాడు. అన్యుడు ఆశ్చర్యవత్తుగా వింటాడు. ఎంత చూచినా, ఎంత చెప్పినా, ఎంత విన్నా ఆత్మను గూర్చి పూర్తిగా తెలిసినవాడు కనిపించడు. చాలామంది కిదొకటి ఉందని కూడా తెలియదు. ఆత్మజ్ఞాన మత్యంత దుర్లభం.

భారతా! ఈ ఆత్మ అందరి దేహాల్లో ఎప్పుడూ ఉన్నా దీన్ని చంపటం ఎవరివల్లా కాదు. ఇది అవధ్యం. కాబట్టి నీ వేజీవిని గూర్చి శోకించటానికి అర్హుడవు కావని గుర్తించుకో.

అర్జునా! యుద్ధం చేయనని, కాళ్లు చేతులాడటం లేదు అని నీవంటి క్షత్రియ వీరుడు వికంపితుడు కావటం ఏమాత్రం సమంజసం కాదు. ఎందుకంటే ధర్మయుద్ధం కంటే క్షత్రియుడికి శ్రేయస్కరమైంది అన్యం లేదు.

పార్థా! అటువంటి శ్రేయస్సు అయాచితంగా, అనాయాసంగా నీకు లభించటం నీ యదృష్టం. క్షత్రియుడికి యుద్ధం అంటే తెరచిన స్వర్గ ద్వారం.

నీవీ ధర్మసంగ్రామం నిర్వర్తించనంటే - స్వధర్మం, కీర్తి చేజార్చుకొన్నవాడివే అవుతావు. అంతేకాదు. విహితధర్మం ఆచరించని ప్రత్యవాయదోషం ఒడికట్టుకొన్నట్లే సుమా!

ఇంకా చెప్పాలంటే - ప్రజానీకం చిరకాలం నీ అపయశస్సు ఘోషిస్తుంది. లోకసంభావితుడికి అపయశస్సు కన్న మృత్యువే మిన్న.

మహారథులు నిన్ను పిరికివాడుగా పరిగణిస్తారు. భయపడి యుద్ధ విరతుడ వైనావని నిందిస్తారు. అదివరకు నిన్నెంతో గౌరవించినవాళ్లే యిప్పుడు లాఘవంగా చూస్తారు. ఇక నీవంటే గిట్టనివాళ్లు నీ సామర్థ్యం ఆడిపోసుకొంటారు. పరిపరి విధాల అవాకులు చవాకులు వాగుతారు. ఇంతకన్న విచారించవలసిన విషయ మేముంటుంది?

యుద్ధ నిహతుడవైతే వీరస్వర్గం. యుద్ధ విజయుడవైతే మహీభోగం. అందువల్ల లే, యుద్ధానికి కృతనిశ్చయుడవు కా. సుఖదుఃఖాలు, లాభాలాభాలు, జయాపజయాలు సమంగా సంభావించు, లే, యుద్ధ సన్నద్ధుడవు కా. పాపానికి పాల్పడవాకు.

పార్థ! ఇంతవరకు ఆత్మతత్త్వం నీకు బోధించాను. ఈ బుద్ధిబలంతో నీవు కర్మయోగివి కావాలి. కర్మయోగివైతే కర్మబంధం తెగిపోతుంది. కాబట్టి కర్మబంధం ఛేదించే నిష్కామకర్మను గూర్చి శ్రద్ధగా విను.

**అర్జునుడు :**

కర్మ అంటేనే ఏదో కోరికతో కూడింది కదా! భగవాన్! నిష్కామకర్మ అనే పదకల్పన చిత్రంగా వుంది. ఇది తప్పక గ్రహించవలసిందే. వివరించండి గురుదేవా!

**శ్రీకృష్ణ భగవానుడు :**

అర్జునా! నీవన్నమాట నిజం. ఈ పదకల్పన చిత్రమైనా, చాలా మహిమ కలది. ఈ నిష్కామకర్మయోగంలో ఆరంభింపబడ్డ కర్మలు ఏవీ నిష్ఫలం కావు. ఇందులో ఆచరించే ధర్మం అల్పమైనా, అనల్ప భయం నుండి సంరక్షిస్తుంది.

**అర్జునుడు :**

ఏవిధంగా ఇది సంసారభయం నుండి రక్షిస్తుంది?

**శ్రీకృష్ణ భగవానుడు :**

ఇది ఈశ్వరుణ్ని ఉద్దేశించి చేసే కర్మ కాబట్టి, దీనివల్ల వైగుణ్యాజనితమైన ప్రత్యవాయం కలగదు. నిష్కామ సకామ కర్మల్లోని భేదం తెలుసుకొంటే నిష్కామకర్మ నిష్ఠలోని ఘనత అవగతమౌతుంది. కురునందనా! ఈ నిష్కామ కర్మలో నిశ్చయాత్మకమైన జ్ఞానం ఏకనిష్ఠమౌతుంది. చంచల చిత్తులు సకాములు అయినవారి బుద్ధులు అనంతముఖాల పరిభ్రమిస్తాయి. ఈశ్వరారాధనంగా చేయబడే నిత్యనైమిత్తిక కర్మల్లో ఎక్కడైనా లోపమున్నా అవి నష్టమైపోవు. దీంట్లో ఎటువంటి వైగుణ్యశంక కూడా ఉండదు. ఎందువల్లనంటే, వైగుణ్యం ఆరాధనలో ఉపశమిస్తుంది. కామ్యకర్మల రీతి అటువంటిది కాదు.

### అర్జునుడు :

అయితే ప్రజలెందుకని కష్టసాధ్యమైన కామ్యకర్మలు పరిత్యజించి, నిష్కామ కర్మానుష్ఠానరతులు కారు?

### శ్రీకృష్ణ భగవానుడు :

దీనికి కారణం అవివేకమనే అనాలి. వేదోక్తకర్మరతులు, స్వర్గప్రాప్తికే కర్మాచరణం తప్ప, వేరే లక్ష్యం కర్మకు లేదని నమ్ముతారు. వీరు వాంఛా ప్రలోభులు, స్వర్గకాములు. అందువల్ల జన్మఫలప్రదాలు, భోగైశ్వర్య లాభోపయోగయుక్తాలు అయిన బహుముఖ కార్యకలాపాసక్తి వీరి కెక్కువ. ఆపాతమనోహర వేదవాక్యప్రచోదనంలో వీరికి ప్రమేయం అధికం. ఏతద్వాక్యాపహృత, చేతస్కులు, భోగైశ్వర్యపరాయణుల్లయిన వారి అంతః కరణాల్లో ఈశ్వరార్పిత బుద్ధి నిశ్చయం కాదు.

### అర్జునుడు :

అయితే భగవాన్! స్వర్గాదులు పరమపురుషార్థం కాదా? కాకపోతే వేదాలు కర్మల్ని ఎందుకు ప్రతిపాదించినట్లు?

### శ్రీకృష్ణ భగవాన్నుడు :

అర్జునా! కర్మకాండతో కూడిన వేదం, త్రిగుణాత్మకం. సకామ విషయాత్మకం. నీవు నిష్కాముడవై కర్మనాచరించాలి. సుఖదుఃఖాది ద్వంద్వరహితుడవు కావాలి. నిత్యసత్త్వగుణాశ్రితుడవు కావాలి. అప్రాప్యవస్తుప్రాపక యోగాన్ని, ప్రాప్తవస్తుసంరక్షక క్షేమాన్ని కూడా పరిత్యజించాలి. నీవు ఆత్మవంతుడవు కావాలి. అంతటా నీరు వెల్లువై ప్రవహిస్తుంటే కూపాదులు దేనికి? బ్రహ్మజ్ఞానికి వేదం ప్రతిపాదించే కామ్య కర్మల వల్ల ప్రయోజనం అంతంతమాత్రమే.

### అర్జునుడు :

భగవాన్! మీరు చెప్పింది చాలా బాగుంది. సకల కర్మలు ఈశ్వరారాధన వల్లనే సిద్ధిస్తుంటే ఇంక కర్మ చేయవలసిన అవసరమే లేదనిపిస్తుంది.

## శ్రీకృష్ణ భగవానుడు :

పొరపాటు - పొరపాటు. ఈ మాట సంస్మరించుకో. కర్మాచరణంలోనే నీకధికారం. కర్మఫలాసక్తుడ వెన్నటికీ కాకూడదు. సకాముడవై కర్మ లాచరించవాకు. అట్లాగని కర్మత్యాగప్రవృత్తుడవు కాకూడదు.

ధనంజయా! కర్మఫలసంగం పరిత్యజించి యోగస్థుడవై కర్మలు ఆచరించు. కర్మసిద్ధిపట్ల గాని, అసిద్ధిపట్ల గాని సమభావం కల్గివుండు.

యోగమంటే సమత్వమే. అంటే చేసే కర్మ సిద్ధిస్తే పొంగటం, సిద్ధించక పోతే క్రుంగిపోకుండా ఉండగల్గటం.

కామ్యకర్మ, సమత్వబుద్ధియుక్తమైన నిష్కామకర్మ కంటే అధమం. కాబట్టి ప్రతివాడూ ఈ బుద్ధియోగాన్ని ఆశ్రయించాలి. ఫలాసక్తులు కృపణులు.

నిష్కామకర్మయోగి ఈలోకంలోనే సుకృత దుష్కృతాలు రెండూ త్యజిస్తాడు. కాబట్టి నీ వీ నిష్కామకర్మయోగ మాచరించాలి. యోగమంటే నిష్కామకర్మ నిర్వహణ కౌశలమే.

సమత్వబుద్ధిసముపేతులు, నిష్కామకర్మయోగులు అయిన మనీషులు కర్మఫలం త్యజించి జన్మబంధ వినిర్ముక్తులై సర్వోపద్రవరహితమైన బ్రహ్మ పదం నిశ్చయంగా పొందుతారు.

ఎప్పుడైతే నీ బుద్ధి దేహాభిమాన వ్యామోహకాలుష్యం అతిక్రమించ గల్గుతుందో అప్పుడు నీవు వినే కర్మఫల విషయం పట్ల వైరాగ్యం పొందుతావు.

ఎప్పుడైతే వివిధ కర్మల ఫలశ్రుతి వల్ల చెదిరిపోయిన నీ బుద్ధి సమాధిలో నిశ్చలము స్థిరము అవుతుందో అప్పుడు యోగాన్ని పొందుతావు. నీ బుద్ధి పరమాత్మలో పాదుకొంటే నీకు తత్త్వజ్ఞానం లభిస్తుంది. స్థితప్రజ్ఞుడ వవుతావు.

## అర్జునుడు :

కేశవా! స్థితప్రజ్ఞుని లక్షణ మెటువంటిది? అతడెట్లా మాట్లాడుతాడు? అతడేరీతిగా ఉంటాడు? ఎట్లా వ్యవహరిస్తాడు? వివరిస్తారా?

**శ్రీకృష్ణ భగవానుడు :**

అర్జునా! ఎవడు ఆత్మలోనే ఆత్మవల్ల తృప్తుడై ఎప్పుడూ మనోగతమైన కోర్కెలన్నీ త్యాగం చేస్తాడో వాడు స్థితప్రజ్ఞుడు.

ఎవని మనస్సు దుఃఖాలకు క్షోభించదో, సుఖాలకు పరవశించదో, ఎవడు వీతరాగభయక్రోధుడో, వాడే స్థితప్రజ్ఞుడు.

ఎవడు అన్నింటిపట్ల, అందరిపట్ల ఆసక్తిరహితుడో, ఎవడు శుభప్రాప్తి కానందింపడో, ఎవ డశుభం ప్రాప్తిస్తే ద్వేషింపడో వాడు స్థితప్రజ్ఞుడు.

తాబేలు భయపడ్డప్పుడు తన అంగాలు ముడుచుకొనే రీతిగా ఎవడు శబ్దాది విషయాల నుండి తన ఇంద్రియాల్ని ఉపసంహరించుకొంటాడో వాడు జ్ఞాన నిష్ఠుడైన యోగి. అతడే స్థితప్రజ్ఞుడు.

**అర్జునుడు :**

భగవాన్! ఇంద్రియాలు నిగ్రహించిన మాత్రాన విషయతృష్ణ నశిస్తుందా?

**శ్రీకృష్ణ భగవానుడు :**

కఠోరతపస్సు ద్వారా ఇంద్రియాలు నిగ్రహించిన మాత్రాన విషయతృష్ణ నశిస్తుందని చెప్పలేం. అది ఎక్కడోక్కడ దాగివుంటుంది. సమయం లభిస్తే అది విజృంభిస్తుంది.

కానీ బ్రహ్మసాక్షాత్కారమైతే విషయనివృత్తి కల్గుతుంది. అంటే ఆత్మసాక్షాత్కారం కల్గితే విషయతృష్ణ విలీనమౌతుంది.

కౌంతేయా! ఇంద్రియాలు బలీయమైనవి. చిత్తవిక్షేపకరమైనవి. ఎంతటి విపశ్చిద్వరుడైనా ఎంత తీవ్రంగా ప్రయత్నించినా తన మనస్సు సంపూర్ణంగా వశీకరించుకోలేడు. అదే అతణ్ని ఆకర్షించి లాంగదీసుకొంటుంది.

కాబట్టి యీ సకలేంద్రియాల్ని సంయమించి ఆత్మస్థుడై, సమాహిత భావంతో ఉండేవాడే స్థితప్రజ్ఞుడు.

**అర్జునుడు :**

భగవాన్! ఆత్మస్థుడు కావటం ఎలాగో తెలియచేయండి.

### శ్రీకృష్ణ భగవానుడు :

విషయ చింతనం వల్ల విషయాసక్తి పెరుగుతుంది. ఆ ఆసక్తి వల్ల కామం జనిస్తుంది. కామం ప్రతిహతమైతే క్రోధం పుట్టుకువస్తుంది. క్రోధం నుండి సమ్మోహం సముద్భవిస్తుంది. సమ్మోహం వల్ల శాస్త్రోపదేశం, గురూపదేశాదులు విస్మృతమౌతాయి. స్మృతిభ్రంశమైతే బుద్ధి నశిస్తుంది. యుక్తా యుక్త వివేకం, సదసద్విచారం ఎప్పుడైతే నశిస్తాయో అప్పుడిక సంపూర్ణ పతనమే. అంటే పురుషార్థసాధనకు మనిషి అసమర్థుడౌతాడు. అయోగ్యు డౌతాడు.

అర్జునా! ఇటువంటి దుర్భర పతనం ప్రాప్తించకుండా తన్ను తాను సంరక్షించుకోవాలంటే మానవుడు సంయమన చిత్తుడు కావాలి. అంటే ప్రియవస్తువుల పట్ల రాగం గాని, అప్రియమైన వానిపట్ల ద్వేషం గానీ పనికిరాదు. జీవించటానికి తప్పనిసరియైన వానినే స్వీకరిస్తూ ఉండాలి. ఇంద్రియాలు తన వశంలో ఉంచుకోవాలి కానీ, తాను వాటి వశంలో వర్తించ కూడదు. అలాంటి ఆత్మవశ్యుడు నిర్మలుడై పరమశాంతి ననుభవిస్తాడు.

చిత్తనైర్మల్యం గల వ్యక్తికి శోకమోహాది మానసిక దుఃఖాలు; వ్యాధుల వల్ల కల్గే శారీరక దుఃఖాలు; సర్పవృశ్చికాదుల వల్ల కల్గే ఆధిభౌతిక దుఃఖాలు; అగ్ని వర్షాదుల వల్ల కల్గే ఆధిదైవిక దుఃఖాలు సర్వం ఉపశమిస్తాయి. ఎందుకంటే ఇటువంటి ప్రసన్న చేతసుని బుద్ధి శీఘ్రంగా ఆత్మలో ప్రతిష్ఠిత మౌతుంది.

ఇంద్రియ నిగ్రహం లేనివాని బుద్ధికి వివేకముండదు. చిత్తైకాగ్రత ఉండదు. అతనికి పరమార్థభావన కలుగదు. పరమార్థభావన లేకపోతే శాంతి లభించదు. అశాంతచిత్తుడికి సుఖం ఎక్కడి నుండి లభిస్తుంది?

### అర్జునుడు :

సుఖమంటే ఏమిటి? ఇంద్రియానుభూతి కాదా?

### శ్రీకృష్ణ భగవానుడు :

దుఃఖానికి దారితీసే ఇంద్రియానుభూతి సుఖమెట్లా అవుతుంది? అది సుఖాభాస. విషయసేవ నుండి ఇంద్రియాల్ని నివృత్తం చేయటమే సుఖం. విషయతృష్ణే దుఃఖం.

ఓ మహాబాహూ! నీటిపై పయనించే నావను వాయువు ప్రతికూల మార్గానికి త్రిప్పే రీతిగా విషయాల్లో ప్రవర్తిల్లే ఇంద్రియాల్ని మనస్సు తీవ్రంగా అనుసరిస్తే

అవి యథేచ్ఛగా సంచరించి ఆ వ్యక్తి ప్రజ్ఞను హరించివేస్తాయి. కాబట్టి ఎవడు తన ఇంద్రియాల్ని శబ్దాది విషయాల నుండి సంపూర్ణంగా ఎవడు నిగ్రహించ గల్గుతాడో వాడు స్థితప్రజ్ఞుడు.

అర్జునా! స్థితప్రజ్ఞుడైన వాని ప్రవర్తన, సామాన్య జీవుల ప్రవర్తనకు విపరీతంగా వుంటుంది. ప్రాణులందరూ నిద్రించే రాత్రి సమయంలో స్థితప్రజ్ఞుడు బ్రహ్మంలో మేల్కొని తత్త్వదర్శనం చేస్తాడు. జీవులందరూ మేల్కొని ఉండే వేళ ఆమునికి రాత్రి సమయం.

**అర్జునుడు :**

భగవాన్! నన్ను తికమకపరుస్తున్నారు. గుడ్లగూబ కూడా ఇట్లాగే ఉంటుంది గదా!

**శ్రీకృష్ణ భగవానుడు :**

తికమకపడుతున్నావు - అనవసరంగా. సంసారము, బ్రహ్మము లేక పరమార్థము అనేవి రెండున్నాయని తెలును గదా! మూఢులు సంసారంలో మేల్కొని వుంటే, జ్ఞానులు దాని విషయంలో ఉదాసీనులు. అట్లాగే జ్ఞానులు పరమార్థంలో మేల్కొని వుంటే, మూఢులు నిద్ర పోతుంటారు. చమత్కారంగా చెప్పానంతే. ఇంకో దృష్టాంతం గ్రహించు. సముద్రంలోకి ఎన్ని నదులు చేరినా అది పొంగదు. చెలియలికట్ట దాటదు. అదేరీతిగా ఎవడు, ఎన్నో కోర్కెలు తనలో ప్రవేశించినా కలతపడడో వాడు శాంతిని అనుభవిస్తాడు. కలతచెందేవాడు శాంతి ననుభవించలేడు.

ఎవడు సకల వాంఛలు విడిచి, నిర్మముడు, నిరహంకారుడు, నిస్పృహుడుగా సంచరిస్తాడో, వాడు శాంతి పొందుతాడు.

పార్థా! ఇదే బ్రహ్మీస్థితి. ఈ స్థితి నందుకొన్నవాణ్ని ఎటువంటి మోహము దరిజేరదు. మరణ సమయంలో కూడా ఈ స్థితి నుండి ఎవడు చలింపడో వాడు బ్రహ్మానంద మనుభవిస్తాడు.

**అర్జునుడు :**

ఓ భగవాన్! శోకపంకనిర్మగ్నుణ్నైన నాకు, ఆత్మజ్ఞానోపదేశం కావించి సముద్ధరించిన నీకు సదా సహస్రాభివందనాలు.

**ఓం తత్ సత్**



## శ్రీకృష్ణార్జున సంవాద మనే

## వచన భగవద్గీతలో

# 3. కర్మయోగం

**అర్జునుడు :**

జనార్దనా! ఇంతవరకు నీవు చెప్పిందాన్నిబట్టి, కర్మకంటే జ్ఞానమే శ్రేష్ఠ మనేది నీ అభిప్రాయంగా గోచరిస్తున్నది. నా ఊహ నిజమే అయితే ఓ కేశవా! ఎందుకు నన్నీ హింసాత్మక కర్మకు నియోగిస్తున్నావో అర్థం కావటంలేదు.

కృష్ణా! సందేహాస్పద వాక్యాలతో నా మనస్సును నీవు మోహపరుస్తున్నావేమో అనిపిస్తుంది. కర్మ-జ్ఞాన మనే ఈ రెంటిలో ఏది నాకు శ్రేయస్సు చేకూరుస్తుందో నిశ్చయించి చెప్పు.

**శ్రీకృష్ణ భగవానుడు :**

ఓ అనఘా! కర్మ జ్ఞాన నిష్ఠల్లో ఒకటి శ్రేష్ఠ మని ఇంకోటి శ్రేష్ఠతరమనే ప్రశ్నే లేదు. ఏద్దైనా సాధకుల అధికారాన్నిబట్టే నిర్ణయింపబడుతుంది.

కొందరు జ్ఞానాధికారులు. వారికి జ్ఞానయోగం అనుకూలం. మరికొందరు నిష్కామ కర్మపరులు. వారికి నిష్కామకర్మయోగం తగింది. ఈ రెండు యోగాలు పరస్పరం సాపేక్షం గాని వేరువేరనే భావం తగదు.

చిత్తశుద్ధిపూర్తిగా కల్గని వారికి నిష్కామ కర్మయోగం తప్పనిసరి. చిత్తశుద్ధి సిద్ధించిన తరువాత జ్ఞానభూమికల నధిరోహించ గోరేవారికి జ్ఞానయోగం యోగ్యం.

కర్మాచరణం లేకుండా ఏ పురుషుడు నిష్క్రియమైన ఆత్మస్థితి నందుకోలేడు. కేవలం కర్మలు త్యజించినంత మాత్రంచేతనే జ్ఞానం సిద్ధిస్తుందనుకోటం పొరపాటు.

ఏ పనీ చేయకుండా ఏ వ్యక్తీ ఒక్క క్షణమైనా ఉండలేడు. ప్రకృతిజన్యమైన గుణాలవల్ల స్వేచ్ఛారహితంగా అందరూ ఏదోఒక కర్మ కావిస్తునే ఉంటారు.

ఏ మూఢుడు వాక్పాణి పాదాది కర్మేంద్రియ పంచకం నిగ్రహించి, శబ్దస్పర్శాది ఇంద్రియ విషయాలు మనస్సులో స్మరిస్తాడో వాడు పాపి, కపటుడు.

కాని పార్థా! ఎవడు తన చక్షురాది జ్ఞానేంద్రియ పంచకాన్ని వివేకంతో కూడిన మనస్సుతో నిగ్రహించి అనాసక్తుడై హస్తపాదాది కర్మేంద్రియ పంచకంతో కర్మయోగం ప్రారంభిస్తాడో వాడు ప్రాజ్ఞుడు.

కాబట్టి నీవు నియత కర్మానుష్ఠానపరుడవు కావలసిందే. తప్పదు. ఎందుకంటే కర్మహీనుడికి దైనందిన జీవనం సాగదు. అది సాగుతున్నప్పుడే కదా తదితరాలోచన. ఏ కర్మ చేయని వానికంటే ఏదో కర్మ చేసేవాడే గొప్ప. అయితే ఈ కర్మ బంధ హేతువు. పరమేశ్వరప్రీత్యర్థం చేసే కర్మ మాత్రం బంధహేతువు కాదు. అందుచేత కౌంతేయ! పరమాత్మ ప్రీతికోసం ఎటువంటి సంగం లేకుండా కర్మ చేయాలి. అంటే 'నేను చేస్తున్నాను' అనే కర్తృత్వాహంకారం ఉండకూడదు.

సృష్ట్యాదిలో ప్రజాపతి యజ్ఞాలతోపాటు జీవుల్ని సృష్టించి అన్నాడు : ఈ యజ్ఞాల వల్ల మీరు వృద్ధిపొందండి. ఇవి మీ అభీష్టాలు తీరుస్తాయి. వీటితో మీరు దేవతల్ని సంప్రీతుల్ని కావించండి. దేవతలు సకాలంలో మీకు వర్షాదులు సమకూర్చి సంతోషపరుస్తారు. ఈవిధంగా మీరు, దేవతలు పరస్పరం సంభావించుకొని పరమశ్రేయస్సు పొందండి.

యజ్ఞభావితులైన దేవతలు ఇష్టభోగాలు చేకూరుస్తారు. దేవతాప్రదత్తమైన వస్తువుల్ని దేవతలకు నివేదించకుండా అనుభవించేవాడు దొంగే.

యజ్ఞశేషం భుజించే సజ్జనులు సర్వపాపవిముక్తులు. అట్లా కాకుండ కేవలం తమకోసమే వండుకొని తినేవారు పాపం భక్షిస్తారు. అన్నం నుండి ప్రాణం ఉత్పన్నం. అన్నం మేఘంవల్ల కల్గుతుంది. మేఘం యజ్ఞంవల్ల ఏర్పడుతున్నది. యజ్ఞం హోమాది కర్మల మూలంగా సముద్భవం. అంటే అగ్నిలో విధివిహితంగా సమర్పిత మైన ఆహుతులు, ఆదిత్యుణ్ని చేరుతాయి. ఆదిత్యుని నుండి వర్షం, వర్షం నుండి అన్నం, అన్నం నుండి ప్రాణం కల్గుతాయి.

కర్మ వేదంచేత ప్రతిపాదితం. వేదం పరమాత్ముని నిశ్వాసంలాగా ఆవిర్భ వించింది. అందువల్ల సర్వప్రకాశము, సర్వవ్యాపి అయిన వేదం, నిత్యం యజ్ఞంలో ప్రతిష్ఠితం.

పార్థా! ఈవిధంగా ప్రవర్తింపబడ్డ కర్మచక్రం అనుసరించకుండా ఎవడు ఇంద్రియాసక్తుడు, పాపజీవి అవుతాడో, వాడు వ్యర్థుడు.

కానీ, ఏ వ్యక్తి ఆత్మరతుడు, ఆత్మతృప్తుడు, ఆత్మసంతుష్టుడు అవుతాడో, వాడికి చేయవలసిన కర్మ లేదు. అటువంటి ఆత్మజ్ఞానికి కర్మానుష్ఠానంవల్ల కల్గే ప్రయోజన మేమీ లేదు. కర్మ చేయకపోతే చేకూరే ప్రత్యవాయదోషం కూడా లేదు. అతనికి ఏ యితర ప్రాణితో సంబంధం శూన్యం. అతని కెవ్వరినీ ఆశ్రయించ వలసిన అవసరం కనిపించదు.

ఆత్మజ్ఞాన విరహితులకు కర్మాచరణం తప్పదు. కాబట్టి నీవు అనాసక్తుడవై సర్వదా కర్తవ్యకర్మ నిర్వహించక తప్పదు. అనాసక్తితో కర్మమాచరించే పురుషుడు మోక్షం పొందుతాడు.

అయితే నీ కిక్కడో సందేహం కల్గవచ్చు. అశ్వపతి, జనకుని వంటి రాజర్షులు ఆత్మజ్ఞానసంపన్నులైనా, కర్మత్యాగం చేయకుండా కర్మమాచరించారుగదా! ఎందుకని అని. నిజమే. వారు తమకోసం కాకుండా, లోకసంగ్రహం దృష్టిలో పెట్టుకొని కర్మానుష్ఠానం వదలిపెట్టలేదు. వారు కూడా తొలుత కర్మాచరణం ద్వారానే చిత్తశుద్ధి నార్జించి జ్ఞానులైనారు సుమా!

**అర్జునుడు :**

కృష్ణా! లోకసంగ్రహమంటే ఏమిటి?

**శ్రీకృష్ణ భగవానుడు :**

అర్జునా! లోకుల్ని అసత్పథం నుండి నివారించటం, స్వధర్మనిష్ఠాపరాయణుల్ని కావించటమే లోకసంగ్రహం. లోకంలో వుంటూ ఆత్మజ్ఞానుల మని ఏ కర్మ చేయకపోతే, వారి నాదర్శంగా తీసుకొని తదితరులు కర్మలు విసర్జించి, సోమరులై పోతారు. అటువంటి దుస్థితి కల్గకుండా నివారించటం జ్ఞానుల కర్తవ్యం. అందువల్ల కూడా నీవు కర్మ చేయక తప్పదు. ఎందుకంటే శ్రేష్ఠజను డేమేమి ఆచరిస్తాడో, సాధారణ జనుడవే చేస్తాడు. అత డేప్రమాణం అనుష్ఠిస్తాడో లోకులు కూడా అదే అనుసరిస్తారు.

పార్థా! ఇందు కుదాహరణంగా నన్నే తీసుకో. నా కీ ముల్లోకాల్లో కనీస కర్తవ్య మేమీ లేదు. నేను పొందనిదేదీ లేదు. పొందతగినది కూడా లేదు. అయినా కర్మలోనే ప్రవర్తిల్లుతున్నాను. అంటే దేనికోసం? లోకకల్యాణం కోసమేగా.

నేను సదా అప్రమత్తతతో కర్మాచరణంలోనే ప్రవర్తిల్లకపోతే, ప్రజానీకం నా మార్గమే అనుసరించేది. అప్పుడు లోకస్థితి కనుకూలమైన కర్మలే లేకుండా పోయేవి. నావల్ల వర్ణసంకరం కూడా ఏర్పడేది. ప్రజా వినాశానికి నేనే కారకుణ్ని అయ్యేవాణ్ని.

ఓ భారతా! అజ్ఞాను లేరీతిగా అత్యాసక్తులై కర్మలాచరిస్తారో, అదేరీతిగా విజ్ఞానులు అనాసక్తులై లోకసంగ్రహార్థం కర్మ లాచరిస్తారు.

కర్మాసక్తులైన అజ్ఞానుల బుద్ధికి లేనిపోని వాక్యాలు చెప్పి చలింపచేయ గూడదు. తా నప్రమత్తుడై కర్మ లాచరిస్తున్నట్లుగానే వారిని కూడా కర్మాచరణంలో ప్రోత్సహించాలి. లేకపోతే వారి బుద్ధి చలించి ఏ కర్మ చేయకుండా సోమరులౌతారు. అందువల్ల చిత్తశుద్ధి కల్గదు. జ్ఞానలబ్ధి కవకాశమే ఉండదు. ఉభయభ్రష్టు లౌతారు.

**అర్జునుడు :**

అయితే భగవాన్! జ్ఞానికి కూడా కర్మ కర్తవ్యమైతే, ఇక అజ్ఞానికి, జ్ఞానికి భేద మేముంటుంది?

**శ్రీకృష్ణ భగవానుడు :**

ఉంటుంది. తప్పక ఉంటుంది. ప్రకృతికి చెందిన గుణత్రయము, శరీరేంద్రియ సంఘాతంగా పరిణమించి కర్మలాచరిస్తున్నది. అహంకార విమూఢచిత్తు డీసంగతి తెలుసుకోలేక 'నేనే కర్తన'ని అహంకరిస్తాడు.

కానీ ఓ మహాబాహూ! తత్త్వవేత్త కర్మలు తాను చేస్తున్నాని భావించడు. వాటిని గుణములు చేసుకుపోతున్నాయని భావిస్తాడు. అంటే కర్తృత్వాభిమానం ఏమాత్రం వహించడు.

ప్రకృతి గుణసమ్మూఢులు, దేహేంద్రియాంతఃకరణాది వ్యాపారాల్లో నిర్మగ్ను లౌతారు. ఈ విషయం పూర్తిగా తెలిసిన ఆత్మజ్ఞుడు, అల్పజ్ఞులైన ఆ మందబుద్ధుల్ని కలవరపరచకూడదు.

ఇప్పుడు నీవు కింకర్తవ్యతామూఢుడవై నన్ను శరణువేడుకొన్నావు కాబట్టి నీలో జిజ్ఞాస ఏర్పడ్డది. కాబట్టి నీ కర్తవ్యమేమిటో తెలుసుకో.

వివేకబుద్ధితో నాకు సర్వకర్మలు సమర్పించు. నిష్కాముడవు కా. ఆసక్తి విరహితుడవు కా. శోకం పారద్రోలు. 'యుధ్యస్వ' యుద్ధం చెయ్యి.

నీవే కాదు అర్జునా! ఏ మానవులైనా సరే, శ్రద్ధాసక్తులై, అసూయారహితులై, మదర్పితంగా తమ తమ విహితకర్మాచరణకు దిగుతారో వారు కర్తృత్వాహంకార విముక్తులౌతారు. ఈ నా మతం అనుష్ఠించకుండా నిందించేవారు, అవివేకులు, సర్వజ్ఞాన మూఢులు, పరమార్థ భ్రష్టులని తెలుసుకో.

**అర్జునుడు :**

అయితే భగవాన్! ఇటువంటి మహాఫల లాభం పొందటానికి, ఇంద్రియ నిగ్రహంతో స్వధర్మం నిష్కామంగా జను లనుష్ఠించలేకపోతున్నారు గదా!

**శ్రీకృష్ణ భగవానుడు :**

ఎంతటి జ్ఞానియైనా తన ప్రకృతి కనుకూలంగానే ప్రవర్తిస్తాను. ఇక సామాన్యుని మాట చెప్పాలా? ఇంద్రియనిగ్రహం అందరివల్ల కాని పని. ప్రకృతి బలీయమైంది. దాన్ని నేనుగాని, ఇంకోరుగాని ఎంతగా శాసించినా, నిషేధించినా ఫలితముండదు.

**అర్జునుడు :**

భగవాన్! పురుషుని ప్రవృత్తి, ప్రకృత్యధీనమే అయితే ఇంక విధి నిషేధాత్మక శాస్త్రం వల్ల ఏం ప్రయోజనం?

**శ్రీకృష్ణ భగవానుడు :**

ప్రతి ఇంద్రియానికి అనుకూలము, ప్రతికూలము నయిన విషయాలున్నాయి. ఈ రెండింటికి వశం కాకుండా ఉండటం తెలియాలి. ఎందుకంటే ఈ రెండూ ముముక్షువుకు శత్రువులే అని శాస్త్రం చెప్తున్నది. అందువల్ల శాస్త్రప్రయోజన మేమిటనే ప్రశ్న పుట్టకూడదు. శాస్త్రదృష్టి క్రమంగా ప్రకృత్యధీనత తప్పిస్తుంది. ఒక్కమాట చెప్తా నాలకించు :

బాగా అనుష్ఠింపబడ్డ పరధర్మం కంటే అసమగ్రంగానైనా ఆచరింపబడ్డ స్వధర్మం శ్రేయోదాయకం. స్వధర్మ సాధనంలో మరణించినా అది కళ్యాణదాయకమే. కాని పరధర్మానుష్ఠానం విపజ్జనకం.

**అర్జునుడు :**

భగవాన్! ఈ స్వపరధర్మ విభజనం దేనికి? బుద్ధికుశలు డేధర్మమైనా సాధించ లేడంటారా?

**శ్రీకృష్ణ భగవానుడు :**

దేనికా? సూక్ష్మ సూక్ష్మ పరిజ్ఞానం కోసం. విభజన లేకపోతే కల్గేది స్థూల పరిజ్ఞానమే. మానవుడెంత విశ్వతోముఖంగా భావించినా, ఆచరించేది స్థానికంగానే.

కష్టపడితే మానవు డేధర్మమైనా సాధించటానికి ప్రయత్నించవచ్చు. ఎన్నో జన్మలకు గాని పరధర్మాన్ని స్వధర్మం కావించుకోలేడు. అదే స్వధర్మమైతే అంత కష్టపడవలసిన అగత్యముండదు.

ప్రవాహానికి ఎదురీత వంటిది పరధర్మానుష్ఠానం. వాలీత వంటిది స్వధర్మా నుష్ఠానం.

స్వేచ్ఛగా సంచరించే చిలుకను పంజరంలో బంధించి 'రామ, రామ' అనమని నేర్పితే చక్కగా అనుకరించవచ్చు. అంతమాత్రాన అది దాని స్వధర్మంగా భ్రాంతి పడకూడదు. ఏ గుడ్లగూబో దాన్ని హింసిస్తుంటే అప్పుడది కీచుకీచు ధ్వనులు చేస్తుంది గానీ రామ రామ అంటుందా?

ఇంతకు స్వధర్మమంటే నీకు విహితమైన వర్ణాశ్రమధర్మమే అని గ్రహించు. నీవు క్షత్రియుడవు. క్షత్రియోచిత ధర్మనిర్వహణమే నీ కర్తవ్యం.

**అర్జునుడు :**

భగవాన్, ఈ వర్ణాశ్రమ ధర్మాలు కలకాలం నిలుస్తాయంటారా?

**శ్రీకృష్ణ భగవానుడు :**

నిలువకపోవచ్చు. వర్ణసాంకర్య మేర్పడవచ్చు. అయినా ఈ వర్ణవ్యవస్థను తమ తమ స్వప్రయోజనాలకు వినియోగించుకొనే స్వార్థపరులు సంఘంలో ప్రబలి సంఘ వినాశానికి దారితీయవచ్చు.

అయినా అర్జునా! ఏదేమైనా సంఘం ఎప్పుడూ ఒకేరీతిగా ఉండదు. ఏదో విధమైన వర్గభేదం కలిగే ఉంటుంది. వర్గసంఘర్షణం తీవ్రరూపం ధరించవచ్చు. అయినా వర్గభేదం నిగూఢంగానైనా వర్తించక తప్పదు.

**అర్జునుడు :**

భగవాన్! మీ వాక్కు అమోఘం. అనర్ఘం. శిరోధార్యం. ఇంకో సందేహం. హాయిగా స్వధర్మానుష్ఠానపరాయణుడై తరించవలసిన మానవుడు ఎవరి ప్రేరణం చేత, తనకిష్టం లేకపోయినా బలవంతంగా, నిర్బంధింపబడ్డవానిలాగా పాపాని కొడిగడుతున్నాడో వివరించ వేడుకొంటున్నాను.

**శ్రీకృష్ణ భగవానుడు :**

అర్జునా! మానవుని పాపాచరణం రజోగుణం వల్ల జనిస్తుంది. మున్ముందుగా కామం పుడుతుంది. కామానికి అంతుపొంతూ ఉండదు. ఒకదాని తరువాత వేరొకటి పుడుతునే ఉంటుంది. దీన్ని తృప్తిపరచటం చాలా కష్టం. అత్యుగ్రమైందీ కామం. ఏ కారణంచేతనైనా ఇది ప్రతిహతమైతే ఇదే క్రోధంగా పరిణమిస్తుంది. ఈ జగత్తుకు క్రోధం మహాశత్రువుగా తెలుసుకో.

పొగచేత నిప్పు, మురికివల్ల అద్దం, మావిచేత గర్భస్థపిండం కప్పబడ్డట్లుగా కామంచేత నరుని వివేకబుద్ధి ఆవృతం.

కౌంతేయా! ఈ కామం జ్ఞానికి నిత్యశత్రువు. దీన్ని ఎంతగా సంతృప్తిపరచాలని ప్రయత్నించినా, అగ్నిలో ఆజ్యంపోసినట్లుగా పైకి ఎగసిపడుతునే ఉంటుంది. తృష్ణారూపమైన ఈ కామం వివేకి బుద్ధి నావరించే ఉంటుంది.

ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి ఈ ధిష్ఠానం. ఈ కామం ఇంద్రియాల ద్వారా వ్యక్తి జ్ఞానాన్నాశ్రయించి, దేహాభిమానియైన జీవుణ్ని మోహింపజేస్తుంది.

కాబట్టి ఓ భరతర్షభా! నీ ప్రథమ కర్తవ్య మేమిటంటే ఇంద్రియాల్ని నిగ్రహించాలి. ఆతరువాత జ్ఞానవిజ్ఞాన నాశనకారి, పాపరూపియైన కామం పరిత్యజించాలి.

దేహంకన్న ఇంద్రియాలు మిన్న. ఇంద్రియాల కన్న మనస్సు మిన్న. మనస్సు కన్న మిన్న బుద్ధి. బుద్ధి కూర్ధ్వంగా ఉన్నదే ఆత్మ.

అర్జునా! ఈవిధంగా నిశ్చయాత్మక బుద్ధిచేత సమాహిత మనస్సు కలవాడవై, బుద్ధికి ద్రష్టయైన ఆత్మను తెలుసుకొని దుర్జయమైన కామశత్రువును జయించు.

**అర్జునుడు :**

భక్తితో స్వధర్మానుష్ఠానపరులై నిన్నారాధించిన జ్ఞానుల కెందరకో ముక్తిని ప్రసాదించిన ఓ భగవాన్! శ్రీకృష్ణా! సర్వవిధాల నిన్ను నేనూ కర్మానుష్ఠానంతో సంతుష్టిపరచటానికే ప్రయత్నిస్తాను.

**ఓం తత్ సత్**



## శ్రీకృష్ణార్జున సంవాద మనే

## వచన భగవద్గీతలో

# 4. జ్ఞానయోగం

### శ్రీకృష్ణ భగవానుడు :

నే నీ అవ్యయ ఫల మిచ్చే కర్మయోగం సూర్యుడికి బోధించాను. సూర్యుడు దీన్ని తన పుత్రుడు మనువుకు చెప్పాడు. మనువు ఇక్ష్వాకునకు బోధించాడు.

ఓ పరంతపా! ఈవిధంగా పరంపరాప్రాప్తమైన ఈ కర్మయోగం రాజర్షులు తెలుసుకొన్నారు. కాని కాలక్రమాన ఈ యోగసంప్రదాయం నష్టమైంది.

నీవు నా భక్తుడవు, సఖుడవు కూడా. కనుకనే ఈ రహస్య ప్రాచీనోత్తమ యోగం నీ కిప్పుడు నేను చెప్పాను.

### అర్జునుడు :

బాగుంది. కృష్ణా! నీ విటీవల జన్మించావు. సూర్యుడు సృష్ట్యారంభంలోని వాడు. ఆయనకు నీ వీ యోగం బోధించటం ఏరీతిగా సాధ్యమైందో బోధపడటం లేదు.

### శ్రీకృష్ణ భగవానుడు :

అదే విచిత్రం. నాకూ నీకూ కూడా ఎన్నో జన్మలు గతించాయి. అయితే అర్జునా! నా కా జన్మ లన్నీ తెలుసు. కాని నీకు తెలియవు.

### అర్జునుడు :

ఎందుకని?

### శ్రీకృష్ణ భగవానుడు :

ఎందుకంటే ధర్మాధర్మాది సంస్కారాలు కారణంగా నీ జ్ఞానశక్తి ఆవృతం. నీవు మాయాధీనుడివి. నేను నిత్య-శుద్ధ-బుద్ధ ముక్త స్వభావుణ్ని. నా విద్యాశక్తి అలుప్తం. నేను మాయాధీశుణ్ని. నా జ్ఞానశక్తి సర్వదా, సర్వధా అనావృతం.

### అర్జునుడు :

ధర్మాధర్మాది సంస్కార రహితుడవు గదా! నీ వెందుకు జన్మించినట్లు? నీ కెట్లా జన్మ సంప్రాప్తించింది?

### శ్రీకృష్ణ భగవానుడు :

నేను జన్మరహితుణ్నే. అవ్యయాత్మను. నా జ్ఞానశక్తుల కేలోపం లేదు. పిపీలికాది బ్రహ్మపర్యంతమైన ప్రాణికోటి నియామకుణ్ని. అయినా స్వకీయ ప్రకృతిని వశపరచుకొని నా మాయచేతనే నే నవతరిస్తున్నాను.

అర్జునా! ఎప్పుడెప్పుడు ధర్మానికి పతనం సంభవించి, అధర్మం అభివృద్ధి చెందుతుందో అప్పుడల్లా నన్ను నేనే సృజించుకొంటాను.

సాధుపురుషుల్ని సంరక్షించటానికి, దుష్టజన వినాశనానికి, ధర్మసంస్థాపనార్థం ప్రతియుగంలో నేను సంభవిస్తునే ఉంటాను సుమా!

అంతేకాదు అర్జునా! ఎవడు నా యీ అప్రాకృతా లౌకిక దివ్యజన్మ రహస్యం, ఇంకా నా సాధురక్షణాది లీలా కర్మల తత్త్వం అవగతం చేసుకొంటాడో, వాడు ఈ శరీరం వదలిన తరువాత మళ్లీ జన్మించడు. నన్నే పొందుతాడు.

వీత రాగ భయ క్రోధులై నన్నే సమాహితచిత్తంతో భావిస్తూ, నన్నే ఉపాశ్రయిస్తూ జ్ఞానతపోనిష్ఠల చేత పూతచరిత్రులైన అనేకులు మద్భావం పొందుతారు.

### అర్జునుడు :

అయితే నిన్ను తప్ప అన్య దేవతల్ని ఆరాధిస్తే వారు నీ కరుణకు పాత్రులు కారా? ఇందులో ఏమైనా పక్షపాత మున్నదా? భగవాన్!

### శ్రీకృష్ణ భగవానుడు :

పక్షపాతమన్న మాటే లేదు. సకాములైనా, నిష్కాములయినా ఎవ రేరీతిగా నన్నుపాసిస్తారో వారి నారీతిగా నే ననుగ్రహిస్తాను. సకాములకు కామ్యఫలాలు దక్కుతాయి. నిష్కాములకు మోక్షప్రాప్తి.

ఇంద్రాది దేవతల్ని ఉపాసించినా సరే, పార్థా! మనుష్యులు సర్వవిధాలా నన్నే నా మార్గమే అనుసరిస్తున్నారు.

**అర్జునుడు :**

అయితే మోక్షార్థులై అందరూ నిన్నే భజించవచ్చు కదా?

**శ్రీకృష్ణ భగవానుడు :**

నిజమే. అందరికి అంత పచేళిమసంస్కార ముండదు. అధిక ప్రజకు శీఘ్ర ఫలితం కావాలి. శ్రౌత స్మార్తకర్మల సిద్ధికోసం చాలామంది ఈ లోకంలో ఇతర దేవతల్ని పూజిస్తారు. నన్ను శరణు పొందరు. కర్మల ఫలం మనుష్యలోకంలో శీఘ్రంగా లభిస్తుంది. కాని జ్ఞానఫలమైన కైవల్యం దుష్ప్రాప్యం.

**అర్జునుడు :**

సకామ కర్మలని, నిష్కామ కర్మలని భేదాలు కల్పించింది ఎవరు? బ్రాహ్మణాది వర్ణాలు కల్పించింది ఎవరు? ఉత్తమమధ్యమాది గుణభేదాల కెవరు కారణం? ఈ విభేదాల్లో పక్షపాతం లేదా? అని నా సందేహం.

**శ్రీకృష్ణ భగవానుడు :**

నిజమే. చాలామంది ఇలాగే భావిస్తుంటారు. సత్త్వరజస్తమోగుణాలు పురస్కరించుకొని, శమదమాది కర్మల్ని అనుసరించి, నాలుగు వర్ణాలు సృష్టించాను. కర్తనైనా నా కిందులో ఆసక్తిగాని, అభిమానంగానీ ఏమీ లేదు. నన్ను అవ్యయుణ్ని గాను, అకర్తగాను నీవు తెలుసుకోవాలి.

అర్జునా! దేహేంద్రియాల వల్ల కల్గే అహంకారం నాకు లేదు. అందువల్ల నేను కర్మలు చేస్తున్నా, అవి నన్ను స్పృశించవు. నే నాప్తకాముణ్ని. అందుచేత నాకు కర్మఫల తృష్ణ లేదు. ఎవడు నన్ను ఆత్మరూపునిగా అవగతం చేసుకొంటాడో అతడు కర్మలకు కట్టుబడడు. అంటే అతనికి కర్మ వల్ల పునర్జన్మ ఉండదు.

నేనెంతో నీవూ అంతే. నే నాత్మనని గ్రహిస్తే చాలు, నీవు చేసే కర్మలేవీ నీకు పునర్జన్మ కల్గించవు. ఇట్లా గ్రహించే, పూర్వం ముముక్షువులు కూడా కర్మ లనుష్ఠించారు. నీవు కూడా వారి ననుసరించు.

ఇది అనుకున్నంత సులభం కాదు. పండితులు కూడా కర్మాకర్మల విషయంలో భ్రాంతులౌతారు. కాబట్టి దేన్ని తెలుసుకొంటే అశుభం నుండి విముక్తుడ వౌతావో ఆ కర్మాకర్మల్ని గూర్చి చెప్తాను.

శాస్త్రవిహిత కర్మల తత్త్వమే కాదు, శాస్త్రనిషిద్ధమైన వికర్మల తత్త్వం కూడా తెలియాలి. కర్మ, వికర్మే కాక అకర్మ అంటే కర్మత్యాగం అంటే ఏమిటోగూడా బాగా గ్రహించాలి. కర్మతత్త్వం గహనం.

ఎవడు కర్మలో అకర్మను - అంటే అకర్తృత్వాన్ని; అకర్మలో కర్మను - అంటే బ్రహ్మసాక్షాత్కార సిద్ధిని సందర్శించగలుగుతాడో వాడు మనుష్య లందరిలో బుద్ధిమంతుడు, జ్ఞాని. తానే ప్రవృత్తి నివృత్తి రూపక కర్మలకు కర్త కాననే ఎఱుక గలవాడు. అతడే యోగి. అతడే కృత్స్నకర్మకృతుడు. కృతకృత్యుడు.

అర్జునా! నే నెవణ్ని పండితుడుగా సంభావిస్తానో తెలుసా? ఎవడు తన సకల కర్మలు ఫలతృష్ణారహితంగా కర్తృత్వాభిమాన వాసన లేకుండా జ్ఞానాగ్నిలో దగ్ధం చేస్తాడో వాడు పండితుడంటే.

అర్జునా! ఎవడు కర్మఫలాసక్తి విడనాడి నిత్యతృప్తుడై, నిరాలంబుడై కర్మాచరణాభిప్రవృత్తుడో వాడు కించిత్కర్మ కూడా ఆచరింపనివాడే అని గ్రహించు. ఎందుకంటే అతని కర్తృత్వ బుద్ధి జ్ఞానాగ్ని దగ్ధం.

నిష్కాముడు, అంతఃకరణ దేహేంద్రియ వశవర్తి, త్యక్తసర్వపరిగ్రహుడు అయిన వ్యక్తి కేవలం శరీర రక్షణార్థం కర్మ కావించినా అతనికి ఏ కిల్బిషం అంటదు. అది అకర్మే.

యదృచ్ఛాలాభ సంతుష్టుడు, ద్వంద్వాతీతుడు, విమత్సరుడు, నిర్వైరుడు, కార్యసిద్ధిలోగానీ, అసిద్ధిలోగానీ సమబుద్ధియుక్తుడు కర్మ ఆచరించినా అతణ్ని ఆ కర్మ బంధించదు. అది అకర్మే.

ఆసక్తివిరహితుడు, విముక్తుడు, జ్ఞానావస్థితచిత్తుడు అయిన వ్యక్తి, యజ్ఞార్థం - అంటే లోకసంగ్రహార్థం, ఈశ్వరప్రీత్యర్థం కావించే కర్మగానీ, తత్ఫలంగానీ సమగ్రంగా విగతకర్మమౌతుంది. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే జ్ఞానానుభూతి కలవాడు కాబట్టి. అది అకర్మే.

ఆహుతి సాధనాలైన స్రుక్స్రువాదులు బ్రహ్మస్వరూపం. హవిస్సు బ్రహ్మం. అగ్ని బ్రహ్మం. హోత బ్రహ్మం. హవనక్రియ బ్రహ్మం. కర్మలో బ్రహ్మబుద్ధి గల ఆ పురుషుడు పొందే ఫలం కూడా బ్రహ్మే. అంతా బ్రహ్మమయంగా సంభావించగల్గాలి.

**అర్జునుడు :**

భగవాన్! జ్ఞానప్రాప్తికి ఉపాయాలైన వివిధ యజ్ఞాలు కాస్త వివరిస్తారా?

**శ్రీకృష్ణ భగవానుడు :**

తప్పక చెప్తాను. వివిధ సాధనాలతో కావించే ప్రాథమికమైన యజ్ఞం ఇప్పుడే చెప్పాను గదా! ఇంకా ఎన్నోరకాల యజ్ఞా లున్నాయి. వ్యక్తి తన సంస్కారబలం కొద్దీ సాధించదగ్గవి.

కొందరు యోగులు, జ్యోతిష్టోమాది యాగాలు చేసిన తరువాత 'దేవతా పూజ' అనే యజ్ఞం నిర్వహిస్తారు. ఇది కర్మయజ్ఞం.

ఇంకా కొందరు బ్రహ్మ అనే అగ్నిలో జీవాత్మ నాహుతి చేస్తారు. అంటే సోపాధిక మైన జీవాత్మను, నిరుపాధికమైన పరమాత్మగా సందర్శిస్తారు. ఇదే జ్ఞానయజ్ఞం.

ఇతర యోగులు - నైష్ఠికబ్రహ్మచారులు, సన్యాసులు, కర్ణాది ఇంద్రియాల్ని సంయమ నాగ్నిలో ఆహుతి చేస్తారు. మరి కొంతమంది గృహస్థులు శబ్దాది విషయ సమూహాన్ని ఇంద్రియాగ్నిలో ఆహుతి చేస్తారు. అంటే ఇంద్రియాలతో ధర్మవిరుద్ధం గాని విషయాలు గ్రహించి హోమబుద్ధితో భోగిస్తారు.

ఇంకా మరికొంతమంది ధ్యానయోగులు జ్ఞానప్రదీప్తమైన ఆత్మనిగ్రహ మనే యోగాగ్నిలో ఇంద్రియ కర్మలు, ప్రాణాది వాయుపంచక కర్మలు ఆహుతిస్తారు.

మరి కొంతమంది ద్రవ్యదాన మనే యజ్ఞం నిర్వహిస్తారు. ఇదేరీతిగా తపోయజ్ఞం - చాంద్రాయణాది వ్రతపరాయణులు కొందరు. ప్రాణాయామాది రూపమయిన యోగయజ్ఞనిష్ఠులు కొందరు. యతులు వేదాభ్యాసం, వేదార్థ జ్ఞానయజ్ఞం వంటి జ్ఞానయజ్ఞాలలో నిష్ఠులు.

ఇంకా పూరకప్రాణాయామం కావించే యోగులు కొందరు. వీరు అపాన వాయువులో ప్రాణవాయువును హోమం చేస్తారు. ఇట్లాగే రేచక ప్రాణాయామం చేసేవారు. వీరు ప్రాణవాయువులో అపానవాయువు హోమం చేస్తారు. ఇంక ప్రాణాపాన వాయువుల గతి నిరోధించి ప్రాణాయామం చేసే యోగులూ వున్నారు. వీరు కుంభకులు.

మరి కొంతమంది నియతాహార యోగులు. వీరు వాయుసమూహాన్ని వాయువుల్లో హోమం చేస్తారు. వీరంతమంది యజ్ఞవేత్తలు. వీరి పాపాలు యజ్ఞాల వల్ల క్షాళనమౌతాయి.

ఓ కురుశ్రేష్ఠా! యజ్ఞశిష్టామృతం భుజించేవారు శాశ్వత బ్రహ్మపదవి నందు కొంటారు. యజ్ఞానుష్ఠాన విహీనుడు సర్వజన నిందితుడు. అతనికి అనాయాసంగా లభించే ఇహలోక సుఖం కూడా ప్రాప్తించదు. ఇక విశిష్ట సాధనసాధ్యమైన పారలౌకిక సుఖం మాటెందుకు?

వేదంలో బహుముఖీన యజ్ఞాలు ప్రస్తాపితం. అవన్నీ మనోవాక్కాయకర్మలకు సంబంధించినవి. ఆత్మ నుండి కలుగలేదు. ఆత్మ నిర్వ్యాపారి. జ్ఞాననిష్ఠతో గ్రహిస్తే విముక్తుడవవుతావు.

**అర్జునుడు :**

భగవాన్! ఎన్నెన్నో యజ్ఞాలు పేర్కొన్నారు. ఇందులో ఏ యజ్ఞం మిక్కిలి శ్రేష్ఠమో నిర్ణయించండి.

**శ్రీకృష్ణ భగవానుడు :**

పరంతపా! ఫలారంభకాలు, అనాత్మజన్యమైన అన్ని ద్రవ్యయజ్ఞాలకన్న జ్ఞాన యజ్ఞం మిన్న. శ్రేయస్కరం. ఎందుకంటే జ్ఞానం కూడా మనోవ్యాపారాధీనమే అయినా అది మనస్సు నుండి పుట్టదు. అది మనఃపరిపాకాన్ని బట్టి అభివ్యక్త మౌతుంది. అఖిల కర్మలు ఫలసమేతంగా ఆత్మజ్ఞానంలోనే అంతర్గతమౌతాయి.

**అర్జునుడు :**

బ్రహ్మజ్ఞాన మెట్లా లభిస్తుంది?

**శ్రీకృష్ణ భగవానుడు :**

అర్థిస్తే వస్తుంది. ప్రణమిల్లి పరిప్రశ్నించి, పరిచర్యలొనర్చి తత్త్వదర్శనులైన జ్ఞానుల్ని అర్థిస్తే వారు నీ కుపదేశిస్తారు - బ్రహ్మజ్ఞానం.

పాండవా! ఆ బ్రహ్మజ్ఞానం పొందితే నీ కిటువంటి వ్యామోహం కల్గనే కల్గదు. అంతేకాదు, దీనివల్ల నిశ్శేషంగా బ్రహ్మాది స్థావరపర్యంతమైన ప్రాణుల్ని నీ ఆత్మలోను, నా ఆత్మలో కూడా దర్శించగల్గుతావు.

పాపు లందరిలో నీవు మహాపాపివే అయినా, ఈ బ్రహ్మజ్ఞాన మనే తెప్ప వల్ల ధర్మాధర్మా లతిక్రమిస్తావు. బ్రహ్మజ్ఞాన మాహాత్మ్యం అటువంటిది.

అర్జునా! ప్రజ్వలితాగ్ని కాష్ఠరాశిని బూడిదచేసే రీతిగా, జ్ఞానాగ్ని శుభాశుభకర్మ సంచయాన్ని భస్మీభూతం చేస్తుంది.

కాబట్టి ఈ జగత్తులో జ్ఞానంతో సమాన మేదీ కాదు. అంతటి పవిత్రమైందేదీ లేదు. కాలక్రమంలో కర్మయోగంలో సంసిద్ధుడైన ముముక్షువు స్వయంగా తనలో నిహితంగా వున్న ఆ మహితజ్ఞానసంపత్తు నందుకొంటాడు.

శ్రద్ధాళువు, గురుసేవా నియుక్తుడు, జితేంద్రియుడు అయిన వ్యక్తి బ్రహ్మజ్ఞానం పొందుతాడు. జ్ఞానం లభించగానే మోక్ష మధిగమిస్తాడు.

అజ్ఞుడు, శ్రద్ధావిరహితుడు, సంశయాత్ముడు చెడిపోతారు. సంశయాత్ములకు ఈ లోకమే కాదు, పరలోకం కూడా లేదు. వాడికి సుఖం అంతకన్న శూన్యం.

ఓ ధనంజయా! బ్రహ్మజ్ఞాన లబ్ధి చేత ధర్మాధర్మాలు త్యజించినవాడు, జ్ఞానోప లబ్ధి చేత సకల సంశయాలు విచ్ఛిన్నమైనవాడు, ఆత్మవంతుడు అయిన వ్యక్తి నేకర్మలు బంధించవు.

కాబట్టి ఓ భారతా! అజ్ఞానసంభూతమై, నీ హృదయంలో పాదుకొన్న సంశయాన్ని జ్ఞానఖడ్గంతో ఛేదించు. నిష్కామకర్మయోగ మాశ్రయించు. లే. యుద్ధం చెయ్యి.

**అర్జునుడు :**

అధికారి భేదాన్ని బట్టి కర్మజ్ఞాన నిష్ఠ లుపదేశించి సందేహనివృత్తి గావించిన ఓ శౌరీ! నీకు నా వందనమందారాలు.

* * *

ఈ మహోదాత్త సంవాద మెవడు వినిన
శ్రద్ధ చదివిన ఆత్మవిజ్ఞాని యగును;
ఆ పరాత్పరుని యనుగ్రహమ్ము పొందు
కాంతిపథమున పయనింపగలడు నరుడు!

**ఓం తత్ సత్**



## శ్రీకృష్ణార్జున సంవాద మనే

## వచన భగవద్గీతలో

# 5. సన్న్యాస యోగం

### అర్జునుడు :

కృష్ణా! అజ్ఞాన సంజనిత సంశయాన్ని జ్ఞానఖడ్గంతో ఛేదించి కర్మయోగం అనుష్ఠింప మని ఉపదేశించావు గదా! ఇందులో పూర్వాపర విరోధం గోచరిస్తున్నది.

కర్మత్యాగమే కాకుండా కర్మానుష్ఠానం కూడ ప్రశంసిస్తున్నావు. ఈ రెండింటిలో ఏది శ్రేయస్కరమో నిర్దేశించు.

### శ్రీకృష్ణభగవానుడు :

అర్జునా! కర్మసన్న్యాసం, నిష్కామ కర్మయోగం అనేవి రెండు శ్రేయస్కరాలే. కాని ఈ రెంటిలోను నీవంటి అధికారులకు కర్మసన్న్యాసం కంటే నిష్కామ కర్మయోగమే గొప్పది.

ఓ మహాబాహూ! ఎవడు దేన్నీ ద్వేషింపడో, ఆకాంక్షింపడో అతడు కర్మ లాచరిస్తున్నా నిత్యసన్యాసే అని తెలుసుకో. సుఖదుఃఖాది ద్వంద్వరహితుడు, సంసారంలోనే ఉన్నా కూడా అతడు విముక్తుడే.

కర్మసన్న్యాసం, కర్మయోగం వేరని చెప్పేవారు అజ్ఞులు. పండితు లట్లా పేర్కొనరు. ఈ రెండింటిలో ఏదో ఒకదాన్ని చక్కగా ఆచరిస్తే చాలు. రెండింటి ఫలం లభిస్తుంది. అసలీ రెండింటికి భిన్నభిన్న ఫలాలు లేవు. రెంటి ఫలం కైవల్యమే. కర్మయోగం పరిపూర్ణంగా ఆచరిస్తే చిత్తశుద్ధి లభిస్తుంది. చిత్తశుద్ధి వల్ల జ్ఞానం, జ్ఞానం వల్ల కైవల్యం. జ్ఞానయోగం, నిష్కామ కర్మయోగం రెంటిని ఏకంగా దర్శించటమే నిజమైన దార్శనికత.

### అర్జునుడు :

భగవాన్! కర్మయోగి కూడా చివరకు సన్న్యాసం ఆశ్రయించక తప్పనప్పుడు, మొదటి నుండి సన్న్యాసం గ్రహిస్తే సరిపోతుంది గదా! ఏమంటారు?

**శ్రీకృష్ణభగవానుడు :**

మహాబాహో! అట్లా పనికిరాదు. నిష్కామకర్మ యోగానుష్ఠానం లేకుండా జ్ఞాన నిష్ఠాత్మక కర్మసన్న్యాసం పొందటం దుఃఖదాయకం, అసంభవం కూడా. నిష్కామ కర్మనిష్ఠుడైన ముని శీఘ్రంగా సన్న్యాసం లేదా పరబ్రహ్మాను పొందుతాడు.

ఈ జన్మలో కాకపోతే పూర్వజన్మలోనైనా నిష్కామకర్మానుష్ఠానం తప్పక జరిగి ఉంటుంది.

చిత్తశుద్ధి పూర్తిగా లభించనంత వరకు, సన్న్యాసం కన్న కర్మయోగమే మిన్న.

విశుద్ధాత్ముడు, విజితాత్ముడు, జితేంద్రియుడు, సర్వభూతాత్మను స్వకీయాత్మగా భావించగలవాడు అయిన నిష్కామకర్మయోగి కర్మలాచరిస్తున్నా ఆ కర్మ లతణ్ణి బంధించవు.

**అర్జునుడు :**

ఇక్కడే సందేహం నశించటం లేదు. 'కర్మ' అనేది బంధహేతువు కాకుండా ఉండగల్గుతుందా? అని.

**శ్రీకృష్ణభగవానుడు :**

కర్తృత్వాభిమానం లేకుండా ఆచరించే కర్మ బంధహేతు వెట్లా అవుతుంది? తత్త్వవిదు డయిన కర్మయోగి చూస్తున్నా, వింటున్నా, తాకుతున్నా, ఆఘ్రాణిస్తున్నా, తింటున్నా, నడుస్తున్నా, నిద్రిస్తున్నా, శ్వాసిస్తున్నా, మాట్లాడుతున్నా, విసర్జిస్తున్నా, స్వీకరిస్తున్నా, కన్నులు మూసుకున్నా, తెరచుకున్నా, ఇంద్రియాలు వాటి పనిలో ప్రవర్తిల్లుతున్నా యని నిశ్చయించుకొని ఉదాసీనుడై ఉంటాడు కాని నేను చేస్తున్నా ననుకోడు. ఈ సహజ ప్రవృత్తుల్లో సుఖించాలనే ఆసక్తి చూపించడు.

ఎవడు పరమేశ్వరార్పితంగా, ఫలాసక్తి త్యజించి, కర్మ లాచరిస్తాడో అతనికి తామరాకుమీది నీటిబిందువుకు లాగా, పాపపుణ్యా లంటుకోవు. అతడు కర్మఫలం త్యజించి, ఆత్యంతిక శాంతి ననుభవిస్తాడు. సకామకర్మి కామ పరవశతచేత కర్మఫలాసక్తుడై బంధింపబడతాడు.

మమత్వాభిమాన శూన్యులై స్నానాదికంతో శరీరాన్ని, ధ్యానాదులతో మనస్సును, తత్త్వచింతనతో బుద్ధిని, ఇంద్రియ సహాయంతో శ్రవణ కీర్తనాది కర్మ లాచరించే వారు ధన్యులు.

**అర్జునుడు :**

భగవాన్! శుద్ధచిత్తుడైన వానికి తగిన సన్న్యాసతత్త్వ మేదో వివరించవలసిందిగా అర్థిస్తున్నాను.

**శ్రీకృష్ణభగవానుడు :**

అర్జునా! జితేంద్రియుడైన పురుషుడు, వివేకబుద్ధితో నిత్యనైమిత్తక కామ్య నిషిద్ధకర్మ లన్నింటిని త్యజించి, ఆత్మ కంటే వేరైన బాహ్యవిషయాసక్తి లేనివాడై నవద్వారాలు గల దేహనగరంలో తా నేమీ చేయకుండా, కర్తృత్వరహితుడై, ఇతరుల చేత చేయించకుండా నిర్లిప్తుడై ఉంటాడు.

ఆత్మ ప్రజల కర్తృత్వాన్నిగాని, కర్మలుగానీ, కర్మఫలప్రాప్తిని గానీ కల్పించదు. అవిద్యారూపమైన మాయ వల్లనే ఆత్మలో ఇవన్నీ ఆరోపితాలు.

పరమేశ్వరుడుగానీ, ఆత్మగానీ ఎవరి పాపపుణ్యాలు స్వీకరింపడు. అజ్ఞానావృత మైన వివేకజ్ఞానం వల్లనే జీవులు మోహగ్రస్తులై అఖండ సచ్చిదానందస్వరూపమైన ఆత్మకు కర్తృత్వ భోక్తృత్వాదు లారోపిస్తున్నారు.

అజ్ఞానం నశిస్తే ఆత్మజ్ఞానం సూర్యుని లాగా పరబ్రహ్మను ప్రకాశింపజేస్తుంది.

బ్రహ్మనిష్ఠులు, బ్రహ్మాత్మభావులు, బ్రహ్మస్థితులు, బ్రహ్మపరాయణులు, జ్ఞాన నిర్ధూతకల్మషులు అయినవారు పునరావృత్తిరహిత మోక్షం పొందుతారు.

ఇటువంటి పండితులే, విద్యావినయసంపన్నుడైన బ్రాహ్మణుణ్ని, ఆవును, ఏనుగును, చివరకు కుక్కను, చండాలుణ్ని సమదృష్టితో చూస్తారు.

**అర్జునుడు :**

అన్నీ సమాన మంటే ఎట్లా కుదురుతుంది గురుదేవా? గుర్రం గాడిద ఒకటే నంటే పొసగుతుందా? సమదృష్టి శాస్త్రసమ్మతమేనా?

**శ్రీకృష్ణభగవానుడు :**

ఈ భేదబుద్ధి జ్ఞానోదయ పర్యంతమే సుమా! ఎవరి మనస్సు సర్వభూతస్థమైన బ్రహ్మంలో సమానత దాల్చి నిశ్చలమౌతుందో, వా రీజీవితంలోనే సంసారాన్ని జయిస్తారు. బ్రహ్మం గుణదోషాది విరహిత సమస్వరూపం. కాబట్టి సమదృష్టి గలవారు పునర్జన్మ నిరోధకమైన బ్రహ్మంలో సుస్థిరులై జీవన్ముక్తు లౌతారు.

స్థిరబుద్ధి గలవాడు, మోహవివర్జితుడు అయిన బ్రహ్మజ్ఞుడు, ప్రియ వస్తు
ంప్రాప్తికి సంతోషింపడు. అప్రియ వస్తుప్రాప్తికి దుఃఖింపడు. బాహ్యమైన శబ్దాది
షయాల్లో అత డనాసక్తచిత్తుడు. అతని అంతఃకరణం విషయ నిరపేక్ష సుఖం
నుభవిస్తుంది. అటువంటి బ్రహ్మయోగయుక్తాత్మ్మ డక్షయ సుఖాధికారి
వౌతాడు.

ఓ కౌంతేయా! రూపరసాది విషయసంప్రాప్త సుఖం క్షణికం. ఆద్యంతాలు
ల ఆ సుఖం దుఃఖ కారణమే. అందుచేత బుధులు అటువంటి విషయసుఖంలో
మించరు.

ఎవడు కామక్రోధోద్భవమైన వేగం జీవితాంతం సహించగల సమర్థుడో అతడు
యోగి, ఆత డానందమయుడు.

**అర్జునుడు :**

కృష్ణా! ఇంతగా చెప్పబడే ఆ కామక్రోధాదుల స్వరూపం కొంచెం వివరించ
రుతాను.

**శ్రీకృష్ణభగవానుడు :**

ఇది అందరి అనుభవంలోని విషయమే అయినా దాని స్వరూపం తెలుసుకో
లసిందే.

ఇంద్రియగోచరమైన విషయాలు విన్నా, స్మరించినా, అనుభవించినా కలిగే
ఖతృష్ణే కామం. ప్రతికూలము, దుఃఖహేతువు అయిన వానిపట్ల కల్గే ద్వేషమే
ధం. ప్రహృష్ట నేత్రవదన రోమాంచాది రూపంగా తోచే అంతఃకరణ క్షోభే కామ
గం. శరీరకంపన, స్వేద రక్త నేత్రాది రూపంగా తోచే అంతఃకరణ క్షోభే క్రోధ
గం.

**అర్జునుడు :**

కేవలం కామ క్రోధోద్భవ వేగం సహించటం వల్లనే మోక్షం లభిస్తుందా?

**శ్రీకృష్ణభగవానుడు :**

లభించదు. కాని ఇవి పెద్ద అవరోధాలు. ఎవడు విషయాల్లో సుఖించకుండా
త్మలోనే సుఖిస్తాడో, ఎవడు బాహ్యక్రీడా శూన్యుడై ఆత్మలోనే క్రీడిస్తాడో, ఎవడు

బాహ్యదృష్టి కాక అంతర్దృష్టి కలవాడో వాడే యోగి. వాడే బ్రహ్మభూతుడు. బ్రహ్మ నిర్వాణుడు. మోక్ష మంటే బ్రహ్మానందానుభూతే గదా!

క్షీణ కల్మషులు, భిన్న సంశయులు, యతాత్ములు, సర్వభూతహితరతులు అయిన ఋషులు బ్రహ్మనిర్వాణం పొందుతారు.

కామ క్రోధ విరహితులు, సంయతచిత్తులు, విదితాత్ములు అయిన యతులు దేహధారులుగాను, దేహత్యాగులుగాను బ్రహ్మనిర్వాణం పొందుతారు. అంటే వారు జన్మరహితులు.

సమస్త బాహ్యవిషయాలు మనస్సు నుండి బహిష్కరించి, దృష్టిని భ్రూ మధ్యంలో నిల్పి, నాసికామధ్యంలో సంచరించే ప్రాణవాయువుల ఊర్ధ్వ అధో గతిని కుంభకంలో సమానంచేసి, మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు నియమించి, ఇచ్ఛా భయక్రోధాలు విడనాడి మోక్ష మొక్కటే ప్రాప్యంగావించే యోగి సర్వదా బంధవినిర్ముక్తుడు.

నన్నే తపోయజ్ఞాలకు భోక్తగాను, సర్వలోక మహేశ్వరుడుగాను, సర్వ జీవకోటికి సుహృదునిగాను గ్రహించి, యోగి శాంతి పొందుతాడు.

**అర్జునుడు :**

యోగసాంఖ్యాలు అధికారభేదాన్ని బట్టి క్రమంగా మోక్షసోపానాలని నిర్దేశించిన జగద్గురూ! నీ కివే నా నమస్కృతి.

* * *

ఈ మహోదాత్త సంవాద మెవడు వినిన
శ్రద్ధ చదివిన ఆత్మవిజ్ఞాని యగును;
ఆ పరాత్పరుని యనుగ్రహమ్ము పొందు
శాంతిపథమున పయనింపగలడు నరుడు!

**ఓం తత్ సత్**



## శ్రీకృష్ణార్జున సంవాద మనే

## వచన భగవద్గీతలో

# 6. ధ్యాన యోగం

**అర్జునుడు :**

దేనికైనా మానవుడికి ప్రధానంగా చిత్తశుద్ధి కావాలి కదా. ఎప్పుడూ కర్మ లాచరిస్తుంటే చిత్తశుద్ధి లభించటం దుర్లభం. అందుచేత దుఃఖరూపమైన కర్మలు త్యజించి సన్న్యాసిగానో, యోగిగానో జీవిస్తే చిత్తశుద్ధి సులభంగా సంప్రాప్తిస్తుంది. దానివల్ల మోక్షం కల్గుతుందని నా అభిప్రాయం. ఇది సరియైన దవునో కాదో-నిర్ణయించండి అచ్యుతా!

**శ్రీకృష్ణభగవానుడు :**

ఈ అభిప్రాయం సరియైంది కాదు అర్జునా! నీ మనస్సు కర్మసన్న్యాసం వైపు మొగ్గుచూపుతున్నది. కర్మలు త్యజించి, చిత్తశుద్ధి సంపాదించినంత మాత్రానే ముక్తి లభించదు. చిత్తశుద్ధి పొందినా ధ్యానం చేయాలి. ధ్యానం లేకపోతే కేవల కర్మసన్న్యాసం వల్లనే ముక్తి లభించదు. అందుచేత ధ్యానయోగం నీ కుపదేశించాలి.

సన్న్యాసి అన్నా, యోగి అన్నా ఎవరో నీ కవగతమైనట్లు కనిపించదు. నీ కంటే నీకే కాదు, ఈ ప్రపంచంలోనే సరైన అవగాహన లేదు.

**అర్జునుడు :**

ఎవరు సన్న్యాసి అన్నా? యోగి అన్నా? నిర్వచించండి.

**శ్రీకృష్ణభగవానుడు :**

ఎవడు కర్మఫలాపేక్ష లేకుండా అవశ్యకర్తవ్యాలుగా విధింపబడ్డ నిత్యకర్మలు ధ్యానయోగానికి అంగంగా ఆచరిస్తాడో అతడే సన్న్యాసి అని, యోగి అని అనబడతాడు. అగ్నిసాధ్యమైన ఇష్టమనే యజ్ఞయాగాదులు గానీ, అగ్ని నిరపేక్షమైన

పూర్త మనే తటాకాది నిర్మాణాదులుగాని, తపోదాన కర్మలు గాని త్యజించినంత మాత్రాన అతడు సన్న్యాసీ కాదు, యోగీ కాదు.

పాండవా! శాస్త్రం సన్న్యాస మని చెప్పిందాన్నే నిష్కామకర్మానుష్ఠానయోగ మని గ్రహించాలి. ఎందుకంటే, కర్మనిష్ఠలోగానీ, జ్ఞాననిష్ఠలోగానీ, ఫలసంకల్పత్యాగం లేకపోతే అతడు 'యోగి' అనిపించుకోడు. ఫలత్యాగం సన్న్యాసికి, సంకల్పత్యాగం యోగికి అవసరం. సంకల్పత్యాగం వల్ల చిత్తవిక్షేపం పోతుంది. అతడే యోగి.

**అర్జునుడు :**

అయితే యావజ్జీవం కర్మ చేస్తూనే ఉండాలనా మీ అభిమతం? కర్మ కో అవధి లేదంటారా?

**శ్రీకృష్ణభగవానుడు :**

లేదని అనటం లేదు. ధ్యానయోగ మధిరోహించదలచిన మునికి నిష్కామ కర్మానుష్ఠానం సాధనం. ఎందుకంటే అది చిత్తశుద్ధికరం కాబట్టి.

ధ్యానయోగారూఢుడైన ధ్యాననిష్ఠాగరిష్ఠుడికి జ్ఞానపరిపాకం కారణంగా కర్మత్యాగం సముచితం.

**అర్జునుడు :**

అయితే ఆ యోగారూఢుని లక్షణ మేలాటిదో వివరించండి భగవాన్!

**శ్రీకృష్ణభగవానుడు :**

ఇంద్రియవిషయాల పట్లగానీ, తత్సాధనాలైన కర్మలపట్ల గానీ ఎవడి కేమాత్రం ఆసక్తి లేదో, ఎవడు సర్వసంకల్ప సన్న్యాసో అతడు యోగారూఢుడు.

వివేకయుక్త మనస్సుతో జీవాత్మను సంసారసాగరం నుండి ఉద్ధరించుకోవాలి. యోగారూఢత్వ మంటే అది. అట్లా ఉద్ధరించుకోవాలంటే విషయాసక్తి పోవాలి. విషయాసక్త మానసమే మానవునికి పరమ శత్రువు. బంధకారణం. విషయాసక్తం కాని, శుద్ధమానసమే మానవుడికి యథార్థహితం చేకూర్చే మిత్రము. అదే ముక్తి కారణం.

దేహేంద్రియాదుల్ని వశం చేసుకొన్న వివేకమానసమే ఆత్మబంధువు. ఆ వివేకాత్మక మనస్సు స్వేచ్ఛాప్రవృత్తి రహితం. ముక్తికి సాహాయ్యకం.

కాని అజితాత్ముడి మనస్సు వివేకశూన్యం. స్వేచ్ఛాప్రవృత్తం. అందుచేత అది అపకృతిలో సంచరిస్తుంది - శత్రువులాగా.

జితాత్ముడు, ప్రశాంతుడు అయినవాడు శీతోష్ణసుఖదుఃఖాల్లోను, మానావమానాల్లోనూ పరమాత్మలో సమాహితు డౌతాడు.

ఎవడు జ్ఞానవిజ్ఞాన తృప్తాత్ముడో, ఎవడు నిర్వికారుడో, ఎవడు విజితేంద్రియుడో మట్టిబెడ్డను, రాతిని, బంగారాన్ని సమంగా సందర్శిస్తాడో వాడు 'యోగి', యోగారూఢుడు.

ఎవడు సుహృన్మిత్ర శత్రువుల పట్లనే కాక ఉదాసీన మధ్యస్థ, విరోధి బంధువులందరిపట్ల సమంగా సంచరిస్తాడో, ఎవడు సాధువులపట్ల, పాపులపట్ల కూడా రాగద్వేష శూన్యుడో అతడే యోగారూఢుడైన శ్రేష్ఠుడు.

అటువంటి యోగారూఢుడు ఎక్కడుంటాడో తెలుసా? అత డెప్పుడూ నిర్జన ప్రదేశంలో ఏకాకిగా ఉంటాడు. అతని దేహం, మనస్సు స్వాధీనం. నిశ్చింతుడు. ఆకాంక్షావిరహితుడు. ఎవరి నుండి ఏమీ ఆశింపడు. సమాహితాత్ముడు.

**అర్జునుడు :**

ఆ యోగిశ్రేష్ఠుడికి నా వందనాలు, కాని భగవాన్! యోగ మెట్లా అభ్యసించాలో తెలియజేయరూ?

**శ్రీకృష్ణభగవానుడు :**

తెలియజేస్తాను. మున్ముందుగా శుచిప్రదేశాన్ని ఎంచుకోవాలి. అది నిమ్నోన్నతాలు లేకుండా చూచుకోవాలి. కుశాజిన చేలయుతంగా స్థిరాసనం నిర్మించాలి. దానిమీద ఆసీనుడై బాహ్యేంద్రియ కార్యాలు, అంతరింద్రియ కార్యాలు నిరోధించాలి. ఏకాగ్రమనస్కుడై చిత్తశుద్ధి కోసం యోగం అభ్యసించాలి.

మేరుదండం, కంఠం, శిరస్సు సమానంగా, స్థిరంగా నిలపాలి. కదలకుండా దిక్కులు చూడకుండా నాసికాగ్రం మీద దృష్టి నిబద్ధం చేయాలి. ప్రశాంతచిత్తంతో, భయరహితంగా బ్రహ్మచర్యనిష్ఠతో నన్నే భావిస్తూ సమాహితచిత్తుడు కావాలి.

ఈవిధంగా ఎవడు సమాహితచిత్తుడై మనస్సును సమాధానపరచుకొని ఉంటాడో ఆ యోగికి నా యధీనంలో ఉన్న నిర్వాణ రూపశాంతి ననుభవిస్తాడు.

**అర్జునుడు :**

భగవాన్! అటువంటి ధ్యాననిష్ఠుని ఆహారాది నియమాలు తెలుసుకోవాలని వుంది.

**శ్రీకృష్ణభగవానుడు :**

అవసరమే! అధికంగా భుజించేవానికి ధ్యానం కుదరదు. అట్లాని బొత్తిగా భుజించని వానికి కూడా ధ్యానం కుదరదు.

అట్లాగే అధికంగా నిద్రించేవాడికి గానీ, అమితంగా మేల్కొని వుండేవాడికి కూడా ధ్యానం నిలువదు.

కాబట్టి ధ్యానం నిలవాలంటే పరిమితాహార విహారాదు లుండాలి. జపతపాది కర్మల్లో పరిమిత ప్రయత్న ముండాలి. నిర్దిష్ట కాలపరిణామం గల నిద్రా జాగరణాలు పాటించేవాడికి ధ్యానం సంసారదుఃఖం పోగొడుతుంది.

ఐహికాముష్మిక విషయతృష్ణా విరహితమై ఎవని చిత్తం.విశేషంగా నిరోధింపబడి ఆత్మలోనే సుప్రతిష్ఠితమౌతుందో అతడు యోగసిద్ధుడు.

ఆత్మయోగ మభ్యసించేవాని చిత్తం - గాలి వీచనిచోట నిశ్చలంగా వెలిగే దీపశిఖ లాంటిది.

ఏ స్థితిలో యోగాభ్యాసం వల్ల నిరోధింపబడ్డ చిత్తం ఉపరతి పొందుతుందో

ఏ స్థితిలో యోగి చిత్తశుద్ధి వల్ల ఆత్మచైతన్యం దర్శిస్తూ ఆత్మలో పరితుష్టి నందుతాడో

ఏ స్థితిలో యోగి ఇంద్రియ నిరపేక్షంగా బుద్ధిబలంతో అతీంద్రియానంత సుఖం అనుభవిస్తాడో

ఏ స్థితిలో యోగి ఆత్మస్వరూపం నుండి అణుమాత్రం కూడా చలింపడో

ఏ స్థితిలో యోగి ఆత్మకన్న మిన్నగా లాభించేది అన్య మున్న దని తలపనే తలపడో

ఏ స్థితిలోనైనా ఎంతటి దుస్సహదుఃఖం సంప్రాప్తించినా ఆవంతకూడా చలింపడో

ఆ దుఃఖ సంయోగ వియోగ నివృత్తిస్థితినే యోగ మని గ్రహించాలి. పట్టు విడువకుండా, విసుగుచెందకుండా చిత్తైకాగ్రతతో ఆ యోగం అభ్యసించాలి.

వస్తువుల మనోరమత్వ జ్ఞానం వల్ల కల్గే సంకల్పాన్ని, సంకల్పం వల్ల 'ఇది నాది, నే ననుభవించాలి' అనే కామాన్ని సంపూర్ణంగా త్యజించి మనస్సుత

ఇంద్రియ సమూహాన్ని సమస్త విషయవ్యాప్తి నుండి మరలించాలి. అందుకు ధైర్యంతో కూడిన బుద్ధితో మెల్లమెల్లగా మనస్సును కూడగట్టుకొని ఆత్మలో సంస్థితం కావించాలి. అన్యచింతన కించిత్తు కూడా రానీయకూడదు. అంటే అంతా ఆత్మే. ఆత్మ కంటే అన్యం లేనేలే దనే దృఢనిష్ఠ ఏర్పడాలి. ఇదే యోగాన్ని గూర్చిన పరమ విధి.

చంచలము, అస్థిరము అయిన మనస్సు ఏఏ విషయోన్ముఖంగా పరుగులు తీస్తుందో తెలుసుకొని ఆయా విషయాలవైపు పరుగులెత్తకుండా పట్టుకోవాలి. దాన్ని ఆత్మలోనే స్థిరం చేయాలి. ఆత్మవశం కావించాలి.

ఈవిధంగా చేయగల్గిన ప్రశాంతచిత్తుడు, రజోగుణ ప్రేరిత విక్షేపాది విరహితుడు, అకల్మషుడు, బ్రహ్మభూతుడు అయిన యోగినే ఉత్తమసుఖం ఆశ్రయిస్తుంది. దీన్నే సమాధిసుఖ మంటారు.

ఏవం విధంగా మనస్సును సదా యోగస్థం కావించి, విగత కల్మషుడైన యోగి అనాయాసంగా బ్రహ్మానుభూతి వల్ల సంప్రాప్తించే ఆత్యంతికి సుఖం పొందుతాడు. మోక్ష మంటే అదే. బ్రహ్మసాక్షాత్కార మన్నా అదే.

### అర్జునుడు :

భగవాన్! తాము పేర్కొన్న ఆ బ్రహ్మసాక్షాత్కారస్థితి ఎటువంటితో కొంచెం వినిపించండి.

### శ్రీకృష్ణభగవానుడు :

అర్జునా! సమాహితచిత్తుడైన పురుషుడు సర్వభూతాలపట్ల సమదృష్టి కల్గి ఉంటాడు. అంటే అన్నింటిలోను బ్రహ్మను సందర్శిస్తాడు. అంతేకాదు తన ఆత్మను బ్రహ్మాదిస్థావరాంతంగా గల అఖిల భూతాలలోను, అఖిల భూతాల్ని తన ఆత్మలోను సందర్శిస్తాడు. ఏమిటలా ఆశ్చర్యపడుతున్నావు? ఇది ఎలా సాధ్య మనా? చాలా సులభం. పిపీలికాది బ్రహ్మపర్యంతంగా ఉన్న ఆత్మ నీలో నున్న ఆత్మ ఒక్కటే అని గ్రహించటం. ఉపాధి భేదాలతో నిమిత్తం లేదు.

ఇంకో విశేషం. సర్వభూతాల్లో నన్ను సందర్శించటమే కాక, నాలో సర్వభూతాల్ని సందర్శించే పురుషుడికి నే నెప్పుడూ అదృశ్యుణ్ని కాను. అతడు కూడా నా కదృశ్యుడు కాడు. అతని కెప్పుడూ నేను ప్రత్యక్షమౌతూ నా కృపాదృష్టితో అతణ్ని అనుగ్రహిస్తాను.

ఎవడు సర్వభూత సంస్థితుణ్నైన నన్ను బ్రహ్మైకత్వభావంలో ప్రతిష్ఠితుడై భజిస్తాడో ఆ యోగి సర్వవిధావస్థల్లో ప్రవర్తిల్లుతున్నా నాయందే ఉంటాడు. అతడు కర్మపరిత్యాగం చేసినా, లేక సర్వవిధ కర్మలు ఆచరిస్తున్నా అతడు ముక్తజీవనుడే. అతణ్ని ఏవిధమైన విధినిషేధాలు ఏమీ చేయలేవు సుమా!

అర్జునా! ఎవడు సర్వభూతముల సుఖదుఃఖాలు తన సుఖదుఃఖాలుగా భావిస్తాడో అతడే యోగి. అతడే శ్రేష్ఠుడని నా అభిప్రాయం. తన కెట్లా సుఖం అనుకూలమో, దుఃఖం ప్రతికూలమో ఆవిధంగానే అన్ని ప్రాణులకు కూడా అని గ్రహించి సకల జీవులకు సుఖమే అభిలషిస్తాడు. ఏ ప్రాణి దుఃఖపడటం అతడు సహించలేడు.

**అర్జునుడు :**

మధుసూదనా! మనస్సు లయవిక్షేపశూన్యమై కేవలం ఆత్మాకారమందే సమత్వ యోగం బోధించావు. బాగానే వుంది. కానీ చంచల స్వభావం గల మనస్సులో ఈ సమత్వభావం ఏవిధంగా స్థిరపడుతుందో బోధపడటం లేదు.

కృష్ణా! మనస్సు అతి చంచలం, బలీయం. ఇది శరీరానికి, ఇంద్రియాలకు మిక్కిలి క్షోభ కల్గిస్తుంది. దీన్ని విషయవాసనల నుండి నివృత్తింపచేయటం దుష్కరం. గాలిని నిరోధించట మెంత దుష్కరమో అంత దుష్కర మని భావిస్తాను.

**శ్రీకృష్ణభగవానుడు :**

మహాబాహో! మనస్సు దుర్నిరోధం. అతి చంచల మనే విషయంలో ఎటువంటి సందేహం లేదు.

కానీ కౌంతేయా! ధ్యానాభ్యాసం వల్ల వైరాగ్యం వల్ల మనస్సును నిరోధింపవచ్చు.

మనస్సులోకి ఎటువంటి ఆలోచన రానీయకుండా మనస్సుతోనే నిరోధించటం క్రమక్రమంగా సాధించాలి. వృత్తిశూన్యమైన మనస్సు శుద్ధమై బ్రహ్మాకారం వహించటమే నిర్వికల్పసమాధి.

స్వాధీనచిత్తుడు కానివానికి యోగం దుష్ప్రాపం. కాని ప్రయత్నశీలుడు, వశ్యాత్ముడు అయిన వ్యక్తి శాస్త్రవిహితము లైన ఉపాయా లభ్యసించి యోగం సాధిస్తాడు.

### అర్జునుడు :

కృష్ణా! శ్రద్ధాసక్తులతో యోగసాధన ప్రారంభించినా ఏదో లోపం వల్ల యోగ భ్రష్టుడైతే యోగంలో సిద్ధుడు కాలేకపోతే అటువంటి వాని గతేమిటి?

కర్మలు ఈశ్వరార్పణ చేసినా, లేక కర్మలు త్యజించినా స్వర్గం ప్రాప్తించదు. యోగసిద్ధి కల్గకపోతే మోక్షం లభించదు. స్వర్గమోక్షాలకు రెండింటికి చెడిన ఉభయ భ్రష్టుడు, పూర్వమేఘం నుండి తెగి, తరువాతి మేఘాన్ని పొందజాలక మధ్యలోనే నశించిపోయే మబ్బుతునక లాగా ఈ యోగభ్రష్టుడు కూడా మధ్యలోనే నశించి పోతాడా? అని నా సందేహం.

ఈ సందేహం పూర్తిగా తీర్చటానికి నీవే అర్హుడివి. నీవు కాక ఏ యితర ఋషులు, దేవతలు దీన్ని తీర్చలేరు.

### శ్రీకృష్ణభగవానుడు :

పార్థా! మంచి సందేహం వెలిబుచ్చావు. విను. యోగభ్రష్టుడు వైదికకర్మలు త్యజించినా ఇహలోకంలో పతితు డనే నింద పొందడు. అంతేకాదు, పరలోకంలో నరకంగాని, హీనజన్మగాని పొందడు. ఎందుకంటే కళ్యాణకృతు లాచరించే వా డెవ్వడూ దుర్గతి పొందనే పొందడు.

కొద్దిగా యోగ మభ్యసించి భ్రష్టుడైన వానికి, అశ్వమేధాది పుణ్యకర్మ లాచరించిన వానికిలాగానే బ్రహ్మలోకాది శుభలోకాలు ప్రాప్తిస్తాయి. అక్కడ చాలా కాలం నివసించి, ఆ తరువాత శుచిమంతులైన శ్రీమంతుల గృహంలో జన్మిస్తాడు.

ఇక చిరకాలంగా యోగాభ్యాసం కావించి భ్రష్టుడైన యోగి, ధీమంతులైన యోగుల వంశంలో జన్మిస్తాడు. ఇటువంటి జన్మ జగత్తులో దుర్లభం.

కురునందనా! ఈవిధంగా యోగుల వంశంలో జన్మించిన ఆ యోగభ్రష్టుడు, పూర్వజన్మ సంస్కారా న్ననుసరించే బుద్ధి పొంది, సిద్ధి పొందటానికి మునుపటి కన్న మిన్నగా ప్రయత్నిస్తాడు.

పూర్వజన్మలో చేసుకొన్న అభ్యాసానికి ఆకర్షితుడై ఇతడు యోగజిజ్ఞాసు వౌతాడు. వేదోక్తకర్మఫలం కంటే అధిక ఫలాన్నే ఈ యోగజిజ్ఞాసువు పొంది విముక్తు డౌతాడు.

ఇతడు పూర్వజన్మకృత ప్రయత్నం కంటే అధిక ప్రయత్నం చేసి కిల్బిషరహితుడై అనేక జన్మల సంసిద్ధిని సమీకరించుకొని, తదనంతరం పరమగతి యైన మోక్షం సంపాదిస్తాడు.

ఇటువంటి యోగి, కృచ్ఛ చాంద్రాయణాది రూపక తపస్సులు కావించిన వారికంటే అధికుడు. శాస్త్రజ్ఞులైన పండితుల కంటే కూడా శ్రేష్ఠుడు. అంతే కాదు. అగ్నిహోత్రాది యజ్ఞపరాయణులైన కర్మిష్ఠులకన్న ఎంతో మిన్న. కాబట్టి అర్జునా! నీవు యోగివి కావాలి.

అర్జునా! ఇంతకన్నా మిక్కిలి ముఖ్య విషయం విను.

ఎవడు శ్రద్ధాసక్తుడై మద్గతాంతరంగుడై నన్ను భజిస్తాడో, అతడు రుద్రాదిత్యాది దేవతానీకాన్ని ధ్యానించే సకల యోగసమితి కంటే కూడా యుక్తతము డని నా అభిమతం.

**అర్జునుడు :**

ఓ భక్తయోగశిరోమణీ! శ్రీకృష్ణభగవాన్! ధ్యానయోగం వివరించిన ఓ భక్తనిధీ! పరమానందస్వరూపా!! మాధవా!! నీ కివే వందనసహస్రం.

* * *

ఈ మహోదాత్త సంవాద మెవడు వినిన
శ్రద్ధ చదివిన ఆత్మవిజ్ఞాని యగును;
ఆ పరాత్పరుని యనుగ్రహమ్ము పొందు
కాంతిపథమున పయనింపగలడు నరుడు!

**ఓం తత్ సత్**



# శ్రీకృష్ణార్జున సంవాద మనే

# వచన భగవద్గీతలో

# 7. జ్ఞాన విజ్ఞాన యోగం

**అర్జునుడు :**

'మద్గతచిత్తుడై నన్ను భజించేవాడు యోగు లందరిలో శ్రేష్ఠుడ'ని వచించావు గదా. భక్తిభాజనుడ వైన నీ స్వరూపం ఎటువంటిదో వివరిస్తే వినాలని ఉన్నది భగవాన్!

**శ్రీకృష్ణభగవానుడు :**

మంచిది అర్జునా! నా స్వస్వరూపం వర్ణిస్తాను. ఎందుకంటే నీవు నామీద ఆసక్త చిత్తుడవు. శరణాగతయోగివి. నా సమగ్రైశ్వర్యాది సంపన్నపూర్ణస్వరూపం నిస్సంశయంగా తెలుసుకొనే రీతిగా అభివర్ణిస్తాను. విను.

నేను నీ కనుభవోపాయంతో గూడిన జ్ఞానం నిశ్శేషంగా చెప్తాను. దీన్ని గ్రహిస్తే ఇంక ఈ శ్రేయోమార్గంలో ఇంకోటి తెలుసుకోతగ్గది ఉండనే ఉండదు.

నామీద భక్తి లేకపోతే నా జ్ఞానం కల్గటం దుర్లభం. మానవేతర జీవకోటి కీ శ్రేయోమార్గప్రవృత్తే ఉండదు.

జ్ఞానయోగ్యులైన మనుష్యులు వేయిమందిలో ఏ ఒక్కడికో ఆత్మజ్ఞానం పొందాలనే ప్రయత్నం ఉంటుంది. అట్లా ప్రయత్నించే ముముక్షువుల్లోనూ అరుదుగా ఏ ఒక్కడికో నా యథార్థతత్త్వం తెలుసుకోవాలనే సంకల్పముంటుంది.

అటువంటి దుర్లభమైన ఆత్మతత్త్వం నీకు చెప్తున్నాను. ప్రకృతిసాహాయ్యంతో సృష్టికావించే ఈశ్వరతత్త్వ నిరూపణానికి ముందుగా ప్రకృతిని గురించి తెలుసుకోవాలి.

నేల, నీరు, గాలి, నిప్పు, నింగి, మనస్సు, బుద్ధి, అహంకారం అని ఎనిమిది విధాల విభజింపబడింది నా ప్రకృతి.

ఓ మహాబాహో! ఇది అపరాప్రకృతి. జడం. నికృష్టమైంది, కాని దీనికంటె భిన్నమైంది ఇంకోటి ఉంది. అదే నా పరాప్రకృతి. ఇది శ్రేష్ఠ చేతన. ఇది ప్రాణధారణకు నిమిత్తమైంది. దీనివల్లనే ఈ జగత్తు ధరింపబడుతున్నది.

చేతనాచేతనమైన సమస్త భూతవితతి ఈ ఉభయవిధాలైన ప్రకృతుల వల్లనే సంభవిస్తున్నది. జడప్రకృతి దేహరూపంలో పరిణతమై క్షేత్రం కాగా, చేతనప్రకృతి భోక్తృరూపంలో దేహంలో ప్రవిష్టమై స్వకర్మల వల్ల దేహం ధరిస్తూ జీవుడని, క్షేత్రజ్ఞుడని అనబడుతున్నది. ఈ రెండు ప్రకృతులు నానుండి కలిగినవే. కాబట్టి నేను ప్రకృతితో కూడిన సమస్త జగత్ప్రభవానికి, ప్రళయానికి కారణభూతుణ్ని.

ధనంజయా! నాకంటే శ్రేష్ఠం ఇంకోటి కించిత్తు కూడా లేదు. దారానికి గ్రుచ్చబడ్డ మణుల మాదిరిగా ఈ జగత్తు సర్వం నన్నాశ్రయించుకొని ఉంది. నాచేతనే ధరింపబడుతున్నది.

కుంతీపుత్రా! నీటిలో రసతన్మాత్ర నేనే. చంద్రసూర్యుల్లో జ్యోతిని నేనే. నాల్గు వేదాల్లో ప్రణవమైన ఓంకారం నేనే. ఆకాశంలో శబ్దతన్మాత్ర నేనే. మనుష్యుల్లో పురుషకారం నేనే.

భూమిలోని పుణ్యగంధం నేనే. అగ్నిలోని తేజస్సు నేనే. సర్వభూతాల్లోని ప్రాణవాయువు నేనే. తపస్వులలో శీతోష్ణాది ద్వంద్వ సహనసామర్థ్యం గల తపశ్శక్తి నేనే.

అర్జునా! స్థావర జంగమాత్మక సర్వభూతాలకు కారణాంతరరహిత నిత్యకరణం నేనే. బుద్ధిమంతుల వివేకశక్తి నేనే. తేజోవంతులైన ధీరుల తేజస్సు నేనే.

ఓ భరతర్షభా! బలవంతుల కామరాగవివర్జిత బలం నేనే. జీవుల్లో ధర్మవిరుద్ధం గాని అభిలాష నేనే.

పురుషుల్లోని శమదమాది సాత్త్విక భావాలు, హర్షదర్పాది రాజసిక భావాలు, శోకమోహాది తామసిక భావాలు నా నుండే కల్గుతాయని గ్రహించు. అయినా నేను వాని కధీనుణ్ని కాను, అవన్నీ నా అధీనాలే.

అర్జునుడు :

అయితే భగవాన్! ఎందుకు నిన్నీ లోకం తెలుసుకోలేకపోతున్నది?

### శ్రీకృష్ణభగవానుడు :

త్రిగుణసంజాతమైన రాగద్వేషమోహాదుల వల్ల భ్రాంతిలోపడ్డ లోకం, ఈ భావాల కతీతమూ, అవ్యయమూ, నిరుపాధికము అయిన నా స్వరూపం గ్రహింపలేకపోతున్నది.

అయితే ఎవరు నన్ను పొందగల్గుతారని ప్రశ్నిస్తావు. అత్యద్భుతమైన, త్రిగుణాత్మక మైన నా మాయ నతిక్రమించటం అత్యంత కష్టం.

కాని ఎవరు నన్నే శరణుపొందుతారో, నన్నే ఆశ్రయిస్తారో వారు నా యీ దుస్తరమాయను తరించగల్గుతారు. అంటే నన్ను తెలుసుకొని సంసారబంధ విముక్తు లౌతారు.

దుష్కర్ములు, పాపులు, మూఢులు అయిన నరాధములు, మాయవల్ల అపహృతజ్ఞానులై దంభ, దర్పాభిమాన క్రోధ పారుష్యాది ఆసురభావా లాశ్రయించి నన్ను భజింపలేకపోతున్నారు. అయితే ఎవరు నన్ను భజింపగల్గు తారని నీ ఆకాంక్ష.

నన్ను భజించే పుణ్యజనులు నాల్గువిధాలుగా ఉంటారు. (1) ఆర్తుడు (2) జిజ్ఞాసువు (3) అర్థార్థి (4) జ్ఞాని

### అర్జునుడు :

ఈ నలువురిలో ఎవరు మీ కత్యంత ప్రీతిపాత్రులు?

### శ్రీకృష్ణభగవానుడు :

ఈ నలువురు భక్తుల్లో నా కత్యంత ప్రియుడు జ్ఞాని. ఎందుకో తెలుసా? అతడు సర్వదా నాలో సమాహితచిత్తుడు. ఏకనిష్ఠుడు. తత్త్వజ్ఞుడు. ఏకాంతభక్తి నిత్యయుక్తత్వా లీజ్ఞాని కొక్కనికే ఉంటాయి. ఎందుకంటే ఇతనికి దేహాభిమాన ముండదు. అందువల్ల చిత్తవిక్షేపం కల్గదు.

ఇందువల్ల నేనితర భక్తుల్ని పర్యుదాసం చేస్తున్నా నని భావించవాకు. వీరందరూ ఉదారులే. ప్రీతిపాత్రులే. అయినా జ్ఞాని నా ఆత్మస్వరూపుడే అని నా అభిమతం. ఎందుకంటే అతడు ఏకాగ్రచిత్తుడు. అనుత్తముడు. గతిగా గమ్యంగా నన్నే ఆశ్రయించుకొని ఉంటాడు. నేను భగవంతుడైన వాసుదేవుణ్ణని, స్వరూపతః నే నన్యుణ్ణి కాననే దృఢబుద్ధి సర్వదా కలవా డీజ్ఞాని.

అనేక జన్మల్లో కొంచెంకొంచెంగా చేసికొన్న పుణ్యఫలం చివరిజన్మలో పచేళిమం కాగా ఈ తత్త్వజ్ఞాని నన్నే సర్వచరాచర జగత్తంతటా వ్యాపించియుండే వాసు దేవుడుగా సంభావించి భజిస్తాడు. ఇటువంటి అపరిచ్ఛిన్న దృష్టి గల మహాత్ముడు సుదుర్లభుడు.

పుత్ర పశు స్వర్గాది విషయవాంఛల చేత వినష్ట వివేకులైన వ్యక్తులు తమ తమ కోర్కెల సాధన కనుకూలంగా జపోపవాసాదు లాచరించి తమ స్వభావానికి వశీభూతులై వాసుదేవేతర దేవతల్ని సేవిస్తారు.

ఏఏ భక్తులు, ఏఏ దేవతామూర్తుల్ని శ్రద్ధతో అర్చిస్తారో, ఆయా భక్తుల్ని ఆయా దేవతామూర్తుల్లోనే అచంచల శ్రద్ధాభక్తులు కలవారినిగా నేనే కావిస్తాను.

ఆ భక్తులు మత్ప్రసాదలబ్ధశ్రద్ధాయుక్తులై ఆ దేవతల నారాధించి, తద్దేవ తాంతర్యామి నగు నాచే నిర్ణయింపబడ్డ ఆ కామ్య విషయాలు ఆ దేవత నుండి పొందుతాడు.

ఈవిధంగా సర్వదేవతలు నా స్వరూపమే. వారి ఆరాధనం నా ఆరాధనమే. ఫలప్రదాతను నేనే. అయినా ఆ భక్తులకు, సాక్షాత్ నా భక్తులకు ఫలవైషమ్యం గమనించాలి. అల్పబుద్ధులైన వ్యక్తుల ఆరాధనా లబ్ధఫలం నేనిచ్చిందే అయినా అది అశాశ్వతం. ఆ దేవతోపాసకులు వినాశయుక్తులైన దేవతల్నే పొందుతున్నారు. మరి నా భక్తులో ఆదిమధ్యాంతరహితుణ్ని, పరమానందస్వరూపుణ్ని అయిన నన్నే పొందుతున్నారు. అందువల్ల ఆ తారతమ్యం తప్పదు.

**అర్జునుడు :**

అయితే భగవాన్! పరిశ్రమ సమానమైనా ఫలవైషమ్య మధికమైన ఈ అన్య దేవతారాధనం దేనికి? దాన్ని విడిచి అందరూ అధిక ఫలదాతవైన నిన్నే సాక్షాత్తుగా ఆశ్రయించవచ్చుకదా! ఎందుకట్లా చేయరు?

**శ్రీకృష్ణభగవానుడు :**

నిజమే. కాని అవివేకులు, అవ్యయము, అనుత్తమము, పరము అయిన నా స్వరూపం తెలుసుకోలేరు. అప్రకాశకుణ్నైన నన్ను ప్రకాశమానుడుగా మాత్రమే గ్రహించగల్గుతున్నారు. అంటే దేహవిశిష్టునిగా, మత్స్యకూర్మాది రూపాల్లో

వ్యక్తమయ్యే దేవతాంతరునిగా భావిస్తున్నారు. అందువల్ల అంతంతమాత్రమైన ఫలాలు పొందుతున్నారు.

నేను యోగమాయాసమావృతుణ్ణి. అందరికి కనిపించను. అందుచేత ఈ మూఢ జగత్తు నన్ను జన్మరహితునిగాను, అవ్యయునిగాను గ్రహించలేకపోతున్నది.

**అర్జునుడు :**

'యోగమాయ' అంటే ఏమిటి? భగవాన్!

**శ్రీకృష్ణభగవానుడు :**

'యోగమాయ' అంటే అనాది, అనిర్వచనీయము అయిన అజ్ఞానం. ఇది అచింత్యప్రజ్ఞావిలాసం. అఘటన ఘటనా పటీయ మీమాయ. లేనిది ఉన్నట్లుగా కనిపించేది. దీన్ని ఆత్మసంకల్పాను విధాయిని అని కూడా అనవచ్చు. జన్మమృత్యురహితుణ్ణైన నన్ను జన్మమృత్యుసహితుణ్ణిగా తలపింపజేసేది.

కాని నేను సర్వోత్తముణ్ని. నా జ్ఞానశక్తి అనావృతం.

పార్థా! నేను భూత భవిష్యద్వర్తమాన విషయాలు తెలిసినవాణ్ని. కాని నన్ను తెలుసుకొన్నవా డెవ్వడూ లేడు. నా శరణాగత భక్తుడికి కొంత అవగతం కాగల నేమో?

పరంతపా! భారతా! ప్రాణుల స్థూలదేహాలుత్పన్నం కాగానే ఇచ్ఛాద్వేషాల నుండి సుఖదుఃఖాలైన ద్వంద్వాలు కల్గుతాయి. సుఖదుఃఖ నిమిత్తమైన బుద్ధి భ్రంశం వల్ల ఎల్ల ప్రాణులు సమ్మోహితమౌతాయి. అందుచేతనే నా ఎఱుక గల్గి నన్ను భజించలేకపోతున్నాయి.

**అర్జునుడు :**

అయితే కొంతమంది నిన్ను భజిస్తున్నారు గదా! దానికి కారణం?

**శ్రీకృష్ణభగవానుడు :**

నిజమే. ఏ పుణ్యకర్మలైన జనుల పాపం పరిసమాప్తమైందో, ఎవరు ద్వంద్వ మోహనిర్ముక్తులో, ఎవరు పరమార్థతత్త్వ మిదమిత్థం, అన్యవిధం కాదని గ్రహించిన దృఢవ్రతులో అటువంటివారు నన్ను భజింపగల్గుతున్నారు.

జరామరణ విముక్తులు కాగోరి ఎవరు నన్నాశ్రయించి నిశితంగా సాధన చేస్తారో అటువంటివారు పరిపూర్ణ పరబ్రహ్మాన్ని, తత్ప్రాప్తికి దోహదంచేసే దేహాది వ్యతిరిక్త విశుద్ధాత్మను, తత్సాధనకు తోడ్పడే సకల కర్మరహస్యాలు గ్రహించగల్గుతారు.

ఇంకా అధిభూత, అధిదైవ, అధియజ్ఞాలతో గూడిన నన్ను సమాహితచిత్తులై ఉపాసించే వ్యక్తులు, మృత్యుకాలంలో కూడా ఎటువంటి చిత్తవ్యాకులత చెందకుండ సంస్మరింపగల్గుతారు.

**అర్జునుడు :**

కృష్ణభక్తివల్లనే బ్రహ్మజ్ఞానం లభిస్తుందని విజ్ఞానయోగ వివేకం కల్గించిన సకల విజ్ఞానమూర్తీ! నీ కివే నా ప్రణామాలు.

* * *

ఈ మహోదాత్త సంవాద మెవడు వినిన
శ్రద్ధ చదివిన ఆత్మవిజ్ఞాని యగును;
ఆ పరాత్పరుని యనుగ్రహమ్ము పొందు
కాంతిపథమున పయనింపగలడు నరుడు!

**ఓం తత్ సత్**



# శ్రీకృష్ణార్జున సంవాద మనే

# వచన భగవద్గీతలో

# 8. అక్షర బ్రహ్మ యోగం

**అర్జునుడు :**

ఓ పురుషోత్తమా! నీవు పేర్కొన్న ఆ బ్రహ్మం ఏది? అధ్యాత్మ మంటే ఏమిటి? కర్మస్వరూప మెటువంటిది? అధిభూత మని దేన్ని అంటారు? ఇంకా అధిదైవ మని చెప్పబడేది ఏది?

మధుసూదనా! సమస్తకర్మలకు ఆధారమైన ఈ శరీరంలో అధిష్ఠించి, నియమించి, ఫలాలు ప్రసాదించే వాడెవడు? అత డేవిధంగా ఈ శరీరంలో స్థితుడై ఉంటాడు? సంయతచిత్తులగు వ్యక్తులు మృత్యుసమయంలో కూడా ఏ ఉపాయం చేత నిన్ను సంస్మరింపగల్గుతున్నారో వివరించ వేడుకొంటున్నాను.

**శ్రీకృష్ణభగవానుడు :**

బాణపరంపరలులాగా ప్రశ్నపరంపర కురిపించావు. నీ జిజ్ఞాస అభినందనీయం. సమాధానాలు శ్రద్ధగా విను.

నిత్యుడైన జీవుని కంటే పరమమైన మూలకారణం బ్రహ్మ మంటారు. ఈ బ్రహ్మము ప్రశాసనం వల్లనే సూర్యచంద్రులు ధరింపబడుతున్నారు.

అంశరూపంలో ప్రతి దేహంలో ప్రవేశించే బ్రహ్మ స్వభావమే జీవుడు. ఈ జీవుడే అధ్యాత్మ మనబడుతున్నాడు. ఇలా కూడా భావించవచ్చు. దేహాని కధికారిగా భోక్తృరూపంలో ఉండేదే అధ్యాత్మ మంటే.

ఇదివరకే చెప్పినా, మళ్లీ చెప్తాను విను. జీవుల జన్మస్థితులకు కారకమైన ద్రవ్యత్యాగరూపమైన యజ్ఞమే కర్మ.

ఓ దేహభృద్వరా! ప్రతి జీవుణ్ని అనుసరించి ఉండే దేహాది క్షరభావాలే అధిభూత మంటే.

పురుషు డంటే నిజాంశభూతులైన సర్వదేవతలకు అధిపతి, సూర్యమండల మధ్యవర్తి అయిన వైరాజపురుషుడు - హిరణ్యగర్భుడే అధిదైవతం. ఈ అధిష్ఠాన దేవతనే విరాట్పురుషుడనీ అంటారు. ఇతడే ప్రథమ శరీరి.

ఈ శరీరంలో అంతర్యామి రూపంలో వెలుగొందే నేనే అధియజ్ఞాన్ని. విష్ణు వంటారు. యజ్ఞాధిష్ఠాన దేవతను, యజ్ఞప్రవర్తకుణ్ని, యజ్ఞఫలదాతనుగూడా నేనే.

అన్యచింతన లేకుండా చిన్నతనం నుండి అనన్య భక్తితో నన్నే కీర్తిస్తూ, నన్నే సంస్మరిస్తూ ఉండే వ్యక్తి అంత్యకాలంలో కూడా నన్నే సంస్మరించగల్గుతాడు. నా సంస్మరణంతోనే శరీరం త్యజించి పయనించి నా స్వరూపమే పొందుతాడు. ఈ విషయంలో ఎటువంటి సందేహం లేదు.

ఇంతేకాదు కౌంతేయా! అంత్యకాలంలో ఎవడెవడు ఏయే దేవతాభావం చింతిస్తూ శరీరం విడిచిపెడతాడో అత డాయా దేవతాభావాలు పొందుతాడు.

కాబట్టి సర్వకాల సర్వావస్థల్లో నన్నే సంస్మరించు. ఈ యుద్ధసమయంలో కూడా సుమా. నాకు సమర్పించిన మనోబుద్ధులు కలవాడు నిస్సందేహంగా నన్నే పొందుతాడు.

ఈ నిరంతర సంస్మరణం సాధ్యమా? అని సందేహించకు. మానవున కసాధ్య మనేదే లేదు.

పార్థా! అభ్యాసయోగయుక్తమై, అనన్య విషయాసక్తముగాని చిత్తంతో అనుచింతన సాగిస్తే పరముడు, దివ్యుడునైన పరమేశ్వరుణ్ని పొందవచ్చు.

అభ్యాసయోగ మంటే నిర్వచించటం అవసరమే. "సజాతీయ ప్రత్యయ ప్రవాహం - విలక్షణ ప్రత్యయ విరహిత తుల్యప్రయత్నం తిరిగి తిరిగి ఆవృత్తం కావటం" అభ్యాసయోగం.

లోకవ్యవహారాల్లో సతమతమయ్యే వ్యక్తి కిది సాధ్యమేనా అని సందేహపడకు. సాధ్యమే. పతివ్రతాలలామ గృహకృత్యాలు నిర్వహిస్తున్నా ఆమె మనస్సు తన భర్తమీదే ఉంటుంది. ఆయన క్షేమమే ఆకాంక్షిస్తుంది. నర్తకి గీత తాళ లయాన్వితంగా నర్తిస్తున్నా, తన లక్ష్యమంతా నెత్తిమీది కలశం పడిపోకుండా కాపాడుకోటమే. శ్రీమంతుని యింట్లో దాది, యజమాని పిల్లల సేవలో నిమగ్న మైనా, ఆమె మనస్సంతా తను కన్నబిడ్డల మీదనే నిల్పుతుంది. తాబేలు గ్రుడ్లు పెట్టి, ఆహారాన్వేషణకై ఎక్కడెక్కడ సంచరించినా, దాని మనస్సు గ్రుడ్లమీదనే. మనస్సుతోనే పొదుగుతుంది. ఇలా ఎన్నో ఉదాహరణలున్నాయి పరిశీలించు.

అర్జునుడు :

భగవాన్! అనుస్మరణీయుడైన ఆ దివ్యపురుషుని అభివర్ణించి ఆహ్లాదింప చేయరూ?

శ్రీకృష్ణభగవానుడు :

ఎవ డందరి కర్మఫల దాతో
ఎవడు సర్వజ్ఞుడో, పురాణపురుషుడో
ఎవడు విశ్వనియంతో
ఎవ డణువు కంటే సూక్ష్మతరుడో
ఎవ డచింత్యస్వరూపుడో
ఎవ డాదిత్య ప్రకాశుడో
ఎవడు మోహాంధకారాతీత ప్రవర్తకుడో

ఆ పరమపురుషుణ్ని మృత్యుసమయంలో కూడా భక్తియుక్తుడై ఏకాగ్రచిత్తంతో, యోగాభ్యాస లబ్ధచిత్తస్థైర్యంతో భ్రూమధ్యంలో ప్రాణం సమగ్రంగా నిల్పి ధారణ చేస్తే వాడు, ఆ జ్యోతిర్మయ పరమేశ్వరుణ్నే పొందగల్గుతాడు.

వేదవిదులు దేన్ని అక్షర మని పేర్కొంటారో, వీతరాగులైన యతులు దేని లోనికి ప్రవేశింప ఆకాంక్షిస్తారో, జిజ్ఞాసువులు దేన్ని పొందగోరి గురుకులాల్లో బ్రహ్మచర్యవ్రత నిష్ఠాత్ము లౌతున్నారో ఆ బ్రహ్మపద సాధనను గూర్చి నీకు సంక్షేపంగా వివరిస్తాను విను.

బాహ్యవిషయగ్రహణ ద్వారాలైన సర్వేంద్రియాలు నియమించి, మనస్సును హృదయపుండరీకంలో నెలకొల్పి, ప్రాణం భ్రూమధ్యంలో గాని, సహస్రారంలోగాని ఉంచి, ఆత్మయోగధారణంలో సుస్థిరులై 'ఓమ్' అనే ఏకాక్షర బ్రహ్మము నుచ్చరిస్తూ నన్ను సంస్మరిస్తూ శరీరం వీడి, అర్చిరాది మార్గంలో పయనించే వ్యక్తి పర బ్రహ్మమును పొందుతాడు.

ఎవడనన్యచిత్తుడై నన్ను అనుదినం యావజ్జీవం నిరంతరంగా సంస్మరిస్తుం టాడో అటువంటి సంతత సమాహితచిత్తుడైన యోగికి నేను సులభ లభ్యుణ్ని.

నేను సులభంగా లభిస్తే లాభమేమి టని గదూ ఆలోచిస్తున్నావు? పరమసిద్ధి యైన మోక్షం పొందిన మహాత్ములు, దుఃఖస్థానము, అనిత్యము, పునర్జన్మకారక మైన ఇతర లోకాలు పొందరు. నన్ను చేరుకొంటారు.

అర్జునా! భూలోకం ఆదిగా బ్రహ్మలోకం వరకు ఉన్న అంటే భూలో
స్వర్లోక మహర్లోక జనోలోక తపోలోక సత్యలోకాలు ఏడు పునరావృత్తి
కొన్నవి. బ్రహ్మలోకానికి వెళ్లిన తరువాత జ్ఞానం లభించిన వారికే
దీన్నే క్రమముక్తి అంటారు. భోగేచ్ఛతో కర్మ లాచరించేవారు ఈ లోకా
తిరిగివస్తారు. కల్పాంత ప్రళయకాలంలో వీరు బ్రహ్మతోపాటు ముక్తిపొం
కాని కౌంతేయా! నన్ను పొందితే మఱి జన్మే లేదు. సరాసరి ముక్తే.

**అర్జునుడు :**

కల్పాంతప్రళయ మంటే యేమిటి? బ్రహ్మదేవుని ఆయు వెంత?

**శ్రీకృష్ణభగవానుడు :**

నాల్గు యుగాలు - సత్య త్రేతా ద్వాపర కలియుగాలు వేయి అయి
దేవునికి పగలు. అట్లాంటి వేయి ఆయనకు రాత్రి. ఇటువంటి దివారా
న్ననుసరించి బ్రహ్మదేవుని ఆయువు శతవర్షం. యోగుల కీదివారాత్రి తత్త్వ
తెలుసు. చంద్రసూర్యమానం అల్పజ్ఞులకే.

బ్రహ్మకు పగటివేళ చరాచర వస్తుసమూహం అవ్యక్తం నుండి
మౌతుంది. రాత్రి కాగానే ఆ వస్తుజాత మంతా లయ మౌతుంది.

పార్థా! పూర్వకల్పంలోని ఆ భూతసమూహమే మరల మరల పుడు
కాగానే లయిస్తుంది. పునర్జన్మలు జీవులకు చేసుకొన్న కర్మలకొలది స

ప్రజాపతి నిద్రావస్థయైన అవ్యక్తం కన్న భిన్నమైంది, చక్షురాది ఇంద్రి
గోచరం కానిది, సర్వతంత్ర స్వతంత్రము అయిన చేతన బ్రహ్మస్వరూప
జంగమ భూతాలన్నీ నశించినా అది నశించదు.

అవ్యక్షము, అక్షరబ్రహ్మము అని శాస్త్రం అభివర్ణించేది జీవునకు ప
ఏ అక్షరబ్రహ్మను పొందితే జీవుడు తిరిగి సంసారంలోకి రాడో అదే ప్రాప్య
అదే విష్ణుపదం. పరంధామం.

పార్థా! అఖిల భూతచయము ఎవని మధ్య సంస్థితమో, ఎవనిచేత ఈ
సర్వం పరివ్యాప్తమో ఆ పరమపురుషుణ్ని అనన్య భక్తిచేత పొందవచ్చు

**అర్జునుడు :**

పరమేశ్వరోపాసకులు తత్పదం పొంది మరల జన్మించరని, ఇతరులు మరల మరల జన్మిస్తారని చెప్పారు గదా!

భగవాన్! ఏ కాలంలో ప్రయాణంచేస్తే ఉపాసకులు, కర్మిష్ఠులు, ముక్తినిగానీ, పునర్జన్మగాని పొందగలరో ఆ కాలాన్ని గూర్చి తెలియజేయగోరుతాను.

**శ్రీకృష్ణభగవానుడు :**

సగుణ బ్రహ్మోపాసకులు అగ్ని, జ్యోతి, దినము, శుక్లపక్షం, ఆరుమాసాలతో కూడింది ఉత్తరాయణం. ఇది దేవయానమార్గం. ఈ మార్గంలో పయనించే పరమేశ్వరోపాసకులు బ్రహ్మమును పొందుతారు. మరల తిరిగి రారు.

ధూమము, రాత్రి, కృష్ణపక్షము, ఆరుమాసాలు దక్షిణాయనం. ఇది పితృయాన మార్గం. ఈ మార్గంలో పోయే కర్మపరుడు చంద్రలోకం. అదే స్వర్గంలోకి పోయి తిరిగి జన్మిస్తాడు.

జ్ఞానాధికారులకు శుక్లగతి, కర్మాధికారులకు కృష్ణగతి అనేది అనాదిగా వస్తున్నవి. దేవయాన మార్గంలో గమించే వారికి క్రమముక్తి కల్గుతుంది.

పార్థా! ఈ రెండు మార్గాలు బాగా తెలుసుకొన్న ఉపాసకుడు గానీ, కర్మిష్ఠి-గానీ ఎప్పటికీ మోహగ్రస్తుడు కాడు. అంటే అనిత్యములైన కర్మల దెసకు పోడు. పరమేశ్వరనిష్ఠుడే అవుతాడు. కాబట్టి నీవూ యోగయుక్తుడవు కావాలనే నా ఆకాంక్ష.

వేదాధ్యయనం, యజ్ఞానుష్ఠానం, తపస్సు, దానం - వీటివల్ల ఏ పుణ్యఫలం శాస్త్రాలు పేర్కొన్నాయో, దాన్ని గ్రహించి, అనుష్ఠించి, యోగి దాన్నతిక్రమించి అంతకన్న మిన్నయైన యోగైశ్వర్యం పొందుతాడు. జగన్మూలభూతము, శ్రేష్ఠము అయిన బ్రహ్మపదం అందుకొంటాడు.

**అర్జునుడు :**

భగవాన్! నా ఎనిమిది ప్రశ్నలకు సమాధానం సమగ్రంగా సమకూర్చి, అభిలషిత స్థానం పొందమని ప్రబోధించారు. మీకు మా ప్రణామాలు.

**ఓం తత్ సత్**



## శ్రీకృష్ణార్జున సంవాద మనే

## వచన భగవద్గీతలో

# 9. రాజవిద్యా రాజగుహ్య యోగం

**అర్జునుడు :**

భగవాన్! పరమేశ్వరుణ్ని శుద్ధభక్తి వల్ల పొందవచ్చునవనే నీ ప్రబోధం ఆలకించి పరమానందభరితుణ్ని అయినాను. ఆ పరమాత్ముని విస్మయకరమగు విభూతి ఇంకా వినాలని నా వీనులు తపిస్తున్నాయి.

**శ్రీకృష్ణభగవానుడు :**

అర్జునా! దేన్ని తెలుసుకుంటె వ్యక్తి అశుభం నుండి విముక్తు డవుతాడో అటువంటి అతి రహస్యజ్ఞానవిజ్ఞానం తిరిగి తిరిగి తెలుసుకోవాలనే నీ అసూయా విరహితబుద్ధి మెచ్చతగింది. దీన్ని గ్రహిస్తే అశుభకరమైన సంసారం నుండి వెంటనే విముక్తి లభిస్తుంది.

ఈ బ్రహ్మవిద్య విద్యలన్నింటిలో శ్రేష్ఠం. అతిగుహ్యం. అనధికారికి అగమ్యం. పరమపవిత్రం. సాక్షాత్తుగా ఫలప్రదం. ధర్మసంగతం. అనుష్ఠాన సులభం. ఎన్నటికి తరిగిపోనిది.

పరంతపా! ఈ బ్రహ్మజ్ఞానం శ్రద్ధావిరహితులు పొందక మృత్యుసంసారంలో పరిభ్రమిస్తున్నారు.

ఇంద్రియాలకు గోచరించని అవ్యక్తమూర్తిని నేను. నాచేత ఈ సర్వజగత్తు పరివ్యాప్తమై ఉంది. చరాచర భూతసంతానమంతా నా నుండి ఆవిష్కృతం. నా మీదనే ఆధారపడి ఉంది. కాని నేను మాత్రం వాటిమీద ఆధారపడి లేను.

నా అసాధారణ యోగమాయా వైభవం గ్రహించు. నే నసంగుణ్ని. భూతాలేవీ నాలో లేవు. నా ఆత్మ భూతాల్ని ధరించి పాలిస్తున్నది. అంతేకానీ నేను భూతాల్లో లేను.

జీవుడు కూడా శరీరం ధరించి, దాన్ని పాలిస్తాడు. అయితే అహంకారం వల్ల శరీరంతో సంశ్లిష్టుడై అదే తానని భ్రాంతి చెందుతాడు. నా కటువంటి అహంకారం లేదు. ఆ భేదం గమనించు.

అంతటా సంచరించే మహావాయువు నిత్యం ఎలా ఆకాశస్థితమో, అదేరీతిగా సర్వ భూతాలు నా స్థానీయాలు. అంటే నే నాకాశంలాంటి వాణ్ని. ఆధారాన్ని. భూత సమూహం వాయువు వంటిది. ఆధేయం.

కౌంతేయా! సర్వభూతాలు కల్పక్షయం కాగానే నా త్రిగుణాత్మక మాయా ప్రకృతిలో లీనమౌతాయి. తిరిగి కల్పాదిలో ఆ భూతాలన్నీ నాచేత సృజింప బడతాయి.

**అర్జునుడు :**

మీ రసంగులు, నిర్వికారులు గదా! మీ రెట్లా సృష్టించగల్గుతారు?

**శ్రీకృష్ణభగవానుడు :**

నేను సృష్టిస్తానని అనలేదే. నాచేత సృష్టింపబడతాయి. నేను సృష్టింపచేస్తానంటే ఇంకా బాగుంటుంది.

స్వీయము, స్వాధీనము, అవిద్యారూపము అయిన మాయ నధిష్ఠించి, దానిచేత ప్రాక్తన సంస్కారవశాన జన్మమృత్యువుల కధీనమైన చతుర్విధ భూతజాల సృష్టి జరిగేటట్లు చూస్తాను. నా మాయవల్లనే జరుగుతుంది.

**అర్జునుడు :**

మీరు సృష్టించినా, మీ మాయ సృష్టించినా పెద్దగా భేదమేమీ లేదు. మాట పట్టింపు తప్ప. ఇలాంటి సృష్టికర్మ మీకు బంధహేతువు కాదా?

**శ్రీకృష్ణభగవానుడు :**

కాదు. ఎందుకంటే నే నాప్తకాముణ్ని. నా కాసక్తి లేదు కర్మల్లో. నే నుదాసీనుణ్ని తటస్థుణ్ని. అందుచేత నన్నా కర్మలు బంధించవు.

కౌంతేయా! నా అధ్యక్షతలో త్రిగుణాత్మిక మాయచేత ఈ చరాచర జగత్తు సృష్టిపబడుతున్నది. ఈ కారణంగానే ఈ వ్యక్తావ్యక్త విశ్వమంతా వివిధ రూపాల్తో పరివర్తిస్తున్నది.

సర్వభూతమహేశ్వరుణ్నైన నా పరమతత్త్వం సరిగా తెలియని మూఢులు, మానవదేహంతో కనిపిస్తున్న నన్ను సామాన్యమానవుడిగానే భావించి, అవజ్ఞ చేస్తున్నారు.

ఈ మూఢులు పలురకాలు : అన్యదేవతలు శీఘ్రఫలప్రదాతలనే మోహావేశోపేతులు కొందరు. నా నుండి విముఖులైన విఫలకర్ములు కొందరు. నానావిధ కుతర్కబుద్ధులైన నిష్ఫలజ్ఞానులు కొందరు. విక్షిప్తచిత్తులైన వివేక శూన్యులు కొందరు, హింసాది ప్రచురతామసులు కొందరు, మోహకరమగు దేహాత్మబుద్ధులైన రాక్షసతామసులు, అసురరాజస్వభావులు కొందరు. ఈవిధంగా బహుముఖీనంగా ఉన్న మూఢులు నన్నవమానిస్తారు.

దానికి కారణం వారి ప్రకృతే. అంతమాత్రంచేత నేనేమీ బాధపడను. ఎందుకంటే పార్థా! దైవీస్వభావం గల మహాత్ములూ ఎందరో ఉన్నారు. వా రనన్య మనస్కులై నన్ను జగత్కారణంగాను, నిత్యునిగాను తెలుసుకొని భజిస్తారు. నన్ను సతతం కీర్తిస్తారు. వారిలో కొంతమంది దృఢవ్రతులై ప్రయత్నశీలురై భక్తిపూర్వకంగా నమస్కరిస్తూ సర్వదా సమాహితచిత్తులై నన్నుపాసిస్తారు.

ఇంకా మరికొంతమంది సర్వం వాసుదేవుడే అనే జ్ఞానయజ్ఞపూర్వకంగా ఉపాసిస్తారు. ఇంకా కొంతమంది ఏకత్వభావనతోను, మరికొందరు పృథక్భావనతోను ఉపాసిస్తారు. ఇంకా కొందరు విశ్వరూపుణ్నైన నన్ను బ్రహ్మరుద్రాదిత్యాది రూపాల్లో బహుధా ఉపాసిస్తారు.

నేనే అగ్నిష్టోమాది శ్రౌతయజ్ఞాన్ని. నేనే పంచమహాయజ్ఞాదులైన స్మార్తయజ్ఞాన్ని. నేనే పితృదేవతా సంబంధమైన శ్రాద్ధకర్మను. నేనే ఔషధీప్రభవమైన అన్నాన్ని. నేనే మంత్రాన్ని. నేనే ఆజ్యాన్ని - హోమసాధన హవిస్సును. నేనే హోమాగ్నిని. నేనే వ్రేల్చబడే హోమాన్ని. ఈ సర్వం నేనే.

నేనే జగత్పితను, మాతను, ధాతను, పితామహుణ్ని. నేనే జ్ఞేయాన్ని. నేనే పవిత్రాన్ని. నేనే ప్రణవాన్ని. ఋగ్యజుస్సామవేదాన్నీ నేనే.

నేనే కర్మఫలాన్ని, పోషకుణ్ని, ప్రభువును, ప్రాణుల శుభాశుభసాక్షిని. నేనే నివాసస్థానాన్ని. శరణాగతాశ్రితుణ్ని, ఆర్తిహరుణ్ని. ప్రత్యుపకారం కోరకుండా హితం చేకూర్చే సుహృత్తును. సృష్టికర్తను, సంహర్తను నేనే. ఆధారస్థానం, ప్రళయస్థానం కూడా నేనే. అక్షయబీజం నేనే.

అర్జునా! సూర్యరూపంలో వేడినిచ్చేది నేనే. జల మాకర్షించి వర్షించేదీ నేనే. అమరుల అమృతం, మర్త్యుల మృత్యువూ నేనే. స్థూల సూక్ష్మ దృశ్యాదృశ్యరూప మగు సదసత్తులు నేనే.

త్రివేదజ్ఞులు యజ్ఞానుష్ఠానంతో నన్ను పూజించి, సోమపానంతో పాప విముక్తులై స్వర్గగమనులై పుణ్యఫలంగా సురేంద్రలోకం చేరి దేవభోగా లనుభవిస్తారు.

వా రా విశాల స్వర్గంలో భోగా లనుభవిస్తారు. పుణ్యం క్షీణించగానే తిరిగి మర్త్యలోకం చేరుకొంటారు. ఏవం విధంగా వేదధర్మానుష్ఠానులైన భోగేచ్ఛా పరాయణులు రాకపోకలు సాగిస్తారు.

ఇక నా విశేష భక్తుల విషయం విను. అనన్యచిత్తంతో, ఆత్మభావంతో, నన్నే చింతిస్తూ పర్యుపాసించే అనవరత యోగయుక్తులైన భక్తుల యోగక్షేమం నేను వహిస్తాను. వీరికి నేను తప్ప ఇతరం లేదు. కాబట్టి నేనే వారి బాధ్యత వహించవలసి వచ్చింది.

**అర్జునుడు :**

భగవాన్! నీకంటే వేరే దేవత లేదు గదా! ఇంద్రాది దేవతారాధకులు కూడా భవదారాధకులే భంగ్యంతరంగా. వారి కీరాకపోకల తిప్పలెందుకు కల్పించినట్లు?

**శ్రీకృష్ణభగవానుడు :**

కౌంతేయా! శ్రద్ధాన్వితులై ఆస్తిక్యబుద్ధితో ఏ భక్తు లన్యదేవతల్ని పూజిస్తున్నారో, వాళ్లు కూడా అజ్ఞానపూర్వకంగా, తమకు తెలియకుండానే నన్నే పూజిస్తున్నారు. భగవంతుడే అన్యదేవతా రూపధారి అని తెలియకపోవటమే అజ్ఞానం. మోక్షా కాంక్షతో కాక భోగాకాంక్షతో కూడినవారు కాబట్టి రాకపోకల తిప్పలు వారికి తప్పవు.

నేను, శ్రౌత స్మార్తాది సర్వయజ్ఞాలకు ఆయా నిర్దిష్టదేవతారూపంలో భోక్తను, ప్రభువును, ఫలదాతను. కానీ ఆ అన్యదేవతారాధకులు ఆవిధంగా నన్ను బాగా తెలుసుకోకుండా ఆ దేవతలే భోక్తలని, ప్రభువులని భావించటంచేత వారికి పునరావృత్తి అనివార్యం.

దేవవ్రతులు ఇంద్రాది దేవతల్ని పొందుతున్నారు. పితృవ్రతులు ఆర్యమాదులైన పితృదేవతల్ని పొందుతున్నారు. భూతోపాసకులు వినాయక మాతృగణాదుల్ని

పొందుతున్నారు. ఇంక నన్ను పూజించేవారు అక్షయ పరమానందస్వరూపుణ్ణైన నన్నే పొందుతున్నారు. వారికి పునర్జన్మ లేదు.

### అర్జునుడు :

భక్తులు అందరి దేవతలకన్న మిన్నయైన నిన్నారాధించాలంటే నీకు తగినట్లు ఘనంగా ఉండాలి కదా వారి ఆరాధన?

### శ్రీకృష్ణభగవానుడు :

ఇతర దేవతల్ని ఎంతో ఆడంబరంగా వ్యయప్రయాసలతో ఆరాధిస్తారు. కానీ నా ఆరాధన మత్యంత సహజం. నిరాడంబరం. భక్తిప్రపూరితంగా ఏ ఆకునో, పూవునో, పండునో, నీటినో సమర్పిస్తే చాలు. ఆ విశుద్ధచిత్తుడు నిష్కామభక్తితో సమర్పించే ఆ బహుమతులు నేను గ్రహిస్తాను. మహావిభూతిపతినైన నన్ను కేవల నిష్కామభక్తితోనే సంతృప్తిపరచగలరు గానీ బాహ్యాడంబరాలతో కాదు.

ఇంకో విశేషం కూడా గుర్తుంచుకో. ఈ పత్రపుష్పఫలాదులు కూడా యజ్ఞ ద్రవ్యాలు లాగా శ్రమపడి సేకరించుకోవాలనే నిర్బంధం లేదు. దేన్ని నీ వాచరిస్తు న్నావో, దేన్ని భుజిస్తున్నావో, దేన్ని హోమం చేస్తున్నావో, దేన్ని దానం చేస్తున్నావో, దేన్ని తపం కావిస్తున్నావో దాన్ని నాకర్పించు చాలు. నన్ను భజించటమంటే ఏదో నియతకాలంలో, నియతవిధి ప్రకారం పూజించటం అనే అభిప్రాయం చాలా సంకుచితం. అవశ్యకర్తవ్యాలైన కర్మలు నాకు సమర్పించటమే నా భజనం. దీని కోసం ఇతర అనుష్ఠానా లక్కరలేదు.

ఈవిధంగా ఆచరిస్తే శుభాశుభఫల విశిష్ట కర్మబంధాల నుండి విముక్తుడ వవుతావు. సన్న్యాసయోగయుక్తాత్ముడవై అంటే కర్మఫలత్యాగ, రూపకర్మాను ష్ఠానంతో జీవన్ముక్తుడవు కాగల్గుతావు. దేహత్యాగానంతరం నన్ను పొందుతావు. తిరిగి జన్మించవు.

### అర్జునుడు :

భగవాన్! భక్తులకే నీవు మోక్షప్రదాతవు. భక్తులు కానివారికి కాదు. అంటే మీకు కూడా రాగద్వేషాదికృతమైన వైషమ్యం ఉందని భావించవచ్చా?

**శ్రీకృష్ణభగవానుడు :**

అట్లా భావించటం అజ్ఞానజనకం. నేను సర్వభూతాల పట్ల సముణ్ని. నా కే పక్షపాతం లేదు. నాకు ప్రియుడుగాని, అప్రియుడుగాని లేడు. అయితే నన్ను భక్తితో భజించేవారు నాలో ఉంటారు. వారి హృదయాల్లో నే నుంటాను. ఒక్క ఉదాహరణం పరిశీలించు. అగ్నిని సమీపించేవారికి తమశ్శీతాది జనిత దుఃఖ ముపశమిస్తుంది. సమీపించని వారికి కల్గదంటే అది అగ్ని లోపం కాదు గదా! భక్తితో సేవించేవారికే ముక్తి. అది భక్తిమహిమగాని నా దేమీ లేదు.

ఎంత దురాచారుడైనా ఏకాంతభక్తితో నన్ను భజిస్తే అతణ్ని సాధువుగానే పరిగణించవచ్చు. ఎందుకంటే అతని సంకల్పం అటువంటిది. భగవద్భజనం వల్ల కృతార్థుడు కావాలని అతని నిశ్చయం. భక్తిప్రభావ మటువంటిది. అతడు శీఘ్రంగా ధర్మాత్ముడవుతాడు. నిత్యశాంతి అనుభవిస్తాడు. కౌంతేయా! నా భక్తుడు నశింపడు. కృతార్థుడే అవుతాడు. ఈ విషయంలో ఎటువంటి వివాదం లేదు. ఎవరైనా కుతర్కం చేస్తే వారి వాదం నిశితంగా ఖండించు.

**అర్జునుడు :**

అచారభ్రష్టుల్నే కాక అసత్కులజాతుల్ని, అనధికారుల్ని కూడా భక్తి ముక్తుల్ని కావిస్తుందా?

**శ్రీకృష్ణభగవానుడు :**

ఆ:. నికృష్టజన్ములైన అంత్యజాదులు, కృష్యాదినిరతులైన వైశ్యులు, అధ్యయన రహితులైన స్త్రీ శూద్రులు కూడా పార్థా! నన్ను సేవిస్తే మోక్షం పొందుతారు.

అసత్కులజాతులు, అనధికారులు కూడా నన్నాశ్రయించి ముక్తులౌతుంటే పవిత్రకులోద్భవుల సంగతి వేరుగా చెప్పాలా? నన్నాశ్రయించిన వారెవ్వరు నిష్ఫలరు కారు.

కాబట్టి అర్జునా! అనిత్యము, సుఖరహితము అయిన ఈ లోకాన్ని గుర్తించు కొని, శీఘ్రంగా నన్ను భజించు. అనిత్యం కాబట్టి ఆలసింపవాకు. సుఖరహితం కాబట్టి సుఖపడాలి అనే వ్యర్థప్రయత్నం చేయవాకని నా హెచ్చరిక.

నన్నెలా సేవించాలో తిరిగి తిరిగి ఉద్ఘాటిస్తాను. ఆలకించు.

మద్గతచిత్తుడవు కా.

మద్భక్తుడవు కా.

నన్ను పూజించు.

నాకు నమస్కరించు.

మత్పరాయణుడవు, నా శరణాగతుడవు కా.

మనస్సు నామీదే నిల్పు.

నన్నే పొందుతావు.

**అర్జునుడు :**

అచ్యుతా! ఆశ్చర్యకరమైన భవదైశ్వర్యాన్ని గూర్చి, భక్తివైభవాన్ని గూర్చిన రాజ రహస్యం హృదయానికి హత్తుకొనేటట్లు బోధించిన నీ కృపకు నా ధన్యవాదాలు.

* * *

ఈ మహోదాత్త సంవాద మెవడు వినిన
శ్రద్ధ చదివిన ఆత్మవిజ్ఞాని యగును;
ఆ పరాత్పరుని యనుగ్రహమ్ము పొందు
కాంతిపథమున పయనింపగలడు నరుడు!

**ఓం తత్ సత్**



శ్రీకృష్ణార్జున సంవాద మనే

వచన భగవద్గీతలో

# 10. విభూతి యోగం

అర్జునుడు :

భగవాన్! ఇతఃపూర్వం అనేక సందర్భాల్లో భవద్విభూతు లభివర్ణించావు. సర్వత్ర ఈశ్వరదృష్టి అలవరచుకోటానికి, ఉపాసనా సౌకర్యార్థం, సమగ్రంగా నీ విభూతులు విశదపరచి నన్నానందింపజేయవలసిందిగా అర్థిస్తున్నాను.

శ్రీకృష్ణభగవానుడు :

మహాబాహో! నా వాక్కు లాలించి సంప్రీతుడవు అవుతున్నావు కాబట్టి నేను నీ హితం కోరి తిరిగి తిరిగి నీకుదాత్త తత్త్వవాగ్వితతి వినిపిస్తాను ఆలకించు.

ఇంద్రాది దేవతలు, భృగ్వాది మహర్షులు నా ఉత్పత్తి తెలుసుకోలేరు. జన్మ లేని నేను నానా విభూతులతో ఆవిర్భవించటం తెలుసుకోవాలంటే చాలా కష్టం. ఎందుకంటే సకల దేవతాగణానికి, మహర్షి సమూహానికి ఉత్పాదకుణ్ని, బుద్ధి ప్రవర్తకుణ్ని అయిన మూలకారణం నేనే.

ఎవడు నన్ను అనాదిగాను, కారణ రహితుడుగాను, జన్మరహితుడుగాను, లోకమహేశ్వరునిగాను తెలుసుకొంటాడో అతడు మనుష్యుల్లో మోహశూన్యుడు. తెలిసిగాని, తెలియకగానీ, తెలిసీ తెలియకగాని అతడు చేసిన పాపాల నుండి విముక్తు డౌతాడు.

బుద్ధి, జ్ఞానం, అసంమోహం, క్షమ, సత్యం, శమం, దమం, సుఖం, దుఃఖం, భావం, అభావం, భయం, అభయం, అహింస, సమత్వం, తుష్టి, తపం, దానం, యశం, అయశం మొదలైనవి ప్రాణులకు స్వకర్మానుసారంగా నా వల్లనే కల్గుతాయి.

భృగ్వాది సప్తర్షులు, వారికన్న పూర్వులు సనక, సనందన, సనత్కుమార, సనాతన మహర్షులు, స్వయంభువాదులగు చతుర్దశ మనువులు, హిరణ్యగర్భ రూపుణ్నైన నా సంకల్పం వల్ల జనించినవారే. మద్గతచిత్తులు కావటంచేత నా ప్రభావంతో విరాజిల్లుతున్నారు. వీరి నుండే ఈ స్థావర జంగమాత్మక సంతతి సముద్భవిస్తుంది.

ఎవడు నా విభూతియోగం యథార్థరూపంలో గ్రహిస్తాడో అత డచంచల సమ్యగ్దర్శనం పొందుతాడు. ఇందుకు సందేహం లేదు.

### అర్జునుడు :

భగవాన్! మీ విభూతియోగ సమ్యగ్ సందర్శనక్రమం నిరూపించ గోరుతాను.

### శ్రీకృష్ణభగవానుడు :

ఆ క్రమం వివరిస్తాను, విను. "నే నీ సర్వజగత్తుకు ప్రభవస్థానం. నా నుండే సర్వం ప్రవర్తిల్లుతున్నది" అని గ్రహించి బుధులు భక్తియుక్తులై నన్ను భజిస్తారు.

మద్గతచిత్తులు, మద్గతప్రాణులు అయినవారు, జ్ఞాన బల వీర్యాది విశిష్టుణ్నైన నన్ను పరస్పరం కథాప్రసంగసంకీర్తనాదుల ద్వారా ఒండొరులు తెలియపరచు కొంటూ సంతోషానందతరంగితు లౌతారు.

ఎవరు నిత్యయుక్తులై ప్రీతిపూర్వకంగా అన్యవాంఛలు పరిత్యజించి నన్ను భజిస్తున్నారో వారికి బుద్ధియోగం ప్రసాదిస్తాను. ఆ బుద్ధియోగబలంతో వారు నా ఆత్మరూపం పొందుతారు.

వారి ననుగ్రహించటానికే నేను వారి బుద్ధిలో నెలకొని సమ్యగ్దర్శన దీప్తితో కూడిన జ్ఞానదీపంతో అవివేక సంజనిత మోహాంధకారం నశింపజేస్తాను.

### అర్జునుడు :

నీవు పరబ్రహ్మవు. పరమపదానివి. పరమ పవిత్రుడవు. దేవర్షి నారదుడు, అసితుడు, దేవలుడు, వ్యాసుడు మున్నగువారు నిన్ను సనాతనుడుగాను, దివ్య పురుషునిగాను, సర్వవ్యాపకుడుగాను వర్ణిస్తారు. నీవు కూడా నా కట్లే చెప్తున్నావు.

కేశవా! నీవు నాకు చెప్పే సర్వం ఋత మని నా నమ్మకం. నీ ఆవిర్భావం దేవతలకు కూడా తెలియదు. దానవులకు కూడా తెలియదు.

ఓ పురుషోత్తమా! భూతభావనా!! భూతేశా!! దేవదేవా! జగత్పతీ!! నిరతిశయ జ్ఞానైశ్వర్యబలశక్తి విశిష్టుడ వగు నిన్ను నీవే సాధనాంతర వ్యతీతంగా తెలుసుకో గలవు. అన్యుల కగోచరం.

ఏయే విభూతుల వల్ల నీవీ లోకాల్లో వ్యాపించి స్థిరపడ్డావో ఆ దివ్యాత్మ విభూతులు సంపూర్ణంగా వివరించటానికి నీవే సమర్థుడవు. ఆ విభూతి భేద ప్రయోజనాలు కూడా సూచించాలని నా కోరిక.

యోగేశ్వరా! ని న్నేరీతిగా నిరంతరం చింతిస్తే నిన్ను నేను తెలుసుకోగలను? ఏయే భవాలతో నిన్ను నేను ధ్యానించాలి?

చిత్తం బహిర్ముఖమైనా విభూతిభేదా న్ననుసరించి ఏయే భావాలతో నిన్ను చింతించటానికి వీలో ఆయా విభూతు లన్నీ విస్తరించి చెప్పు. జనార్దనా! నీ వాగమృతం ఎంత గ్రోలినా నాకు తృప్తిగల్గటం లేదు. ఇంకా తిరిగి తిరిగి వినాలనే ఉంది.

శ్రీకృష్ణభగవానుడు :

ఓహో కురుశ్రేష్ఠా! మదీయ దివ్యాత్మ విభూతు లనంతాలు. అయినా యోగ్యత ననుసరించి వివరిస్తాను.

గుడాకేశా! ప్రాణు లందరి హృదయాల్లో ఉన్న ఆత్మను నేను. నేనే ప్రాణుల ఉత్పత్తి స్థితి ప్రళయ కారణాన్ని.

నేను ద్వాదశాదిత్యుల్లో విష్ణువును. జ్యోతుల్లో విశ్వవ్యాప్తరశ్మిమంతుడైన సూర్యుణ్ని. మరుద్గణసప్తకంలో మరీచిని. నక్షత్రగణాధిపతియైన చంద్రుణ్ని నేనే.

వేదాల్లో నేను సామవేదాన్ని. త్రింశత్కోటి దేవతల్లో నే నింద్రుణ్ని. ఏకాదశేంద్రియాలలో నేను మనస్సును. ప్రాణుల శరీరంలోని జ్ఞానశక్తిని నేనే.

ఏకాదశరుద్రుల్లో శంకరుణ్ని. యక్షరాక్షసుల్లో కుబేరుణ్ని. అష్టవసువుల్లో అగ్నిని. శిఖరాలున్న కొండల్లో నేను మేరువును.

అర్జునా! పురోహితుల్లో ముఖ్యుడైన బృహస్పతిని నన్నుగా గ్రహించు. సేనాపతుల్లో దేవసేనా నాయకుడైన కుమారస్వామిని నేనే. జలాశయాల్లో సముద్రుణ్ని నేనే.

మహర్షుల్లో భృగువును నేనే. వాక్కుల్లో ఏకాక్షరము, బ్రహ్మవాచకమునైన ఓంకారాన్ని నేను. శ్రౌత స్మార్తాది యజ్ఞాల్లో జపయజ్ఞాన్ని. స్థావర కోటిలో హిమాలయాన్ని.

అన్ని వృక్షాల్లో అశ్వత్థవృక్షాన్ని. దేవర్షుల్లో నారదుణ్ని. గంధర్వుల్లో చిత్రరథుణ్ని. సిద్ధుల్లో కపిలుణ్ని.

అశ్వాల్లో నేను అమృతంతోపా టుద్భవించిన ఉచ్చైఃశ్రవాన్ని. గజేంద్రుల్లో ఐరావతాన్ని. మనుష్యుల్లో రాజును నేనే అని తెలుసుకో.

ఆయుధాల్లో వజ్రాయుధాన్ని, ఆవుల్లో కామధేనువును, సంతానోత్పాదకుల్లో కందర్పుణ్ని నేనే. విషసర్పాల్లో వాసుకిని నేనే.

విషరహిత నాగుల్లో అనంతుణ్ని నేనే. జలదేవతల్లో వరుణుణ్ని. పితృదేవతల్లో ఆర్యముణ్ని. శాస్తల్లో యముణ్ని.

దైత్యుల్లో ప్రహ్లాదుణ్ని. గణకుల్లో కాలాన్ని. మృగాల్లో సింహాన్ని. పక్షుల్లో గరుత్మంతుణ్ని.

వేగవంతుల్లో వాయువును. ఆయుధధారుల్లో రాముణ్ని. మత్స్యాల్లో మకరాన్ని. నదుల్లో గంగను.

అర్జునా! ఆకాశాది సృష్టవస్తువుల్లో ఉత్పత్తి స్థితి సంహారక కర్తను నేనే. విద్యల్లో మోక్షప్రదమైన ఆధ్యాత్మికవిద్యను నేనే. తార్కికుల వాద, జల్ప, వితండాల్లో తత్త్వ నిర్ణయ సమర్థమైన వాదం నేనే.

అక్షరాల్లో అకారం నేనే, సమాసాల్లో ఉభయపదప్రధానమైన ద్వంద్వసమాసం నేనే. ప్రవాహరూపకాలం నేనే. విశ్వతోముఖ ఫలప్రదాతయైన ధాతను నేనే.

నేనే జీవసంహర్త మృత్యువును. భవిష్యత్కళ్యాణ గుణాల్లో అభ్యుదయాన్ని. ధర్మని సపత్నులైన కీర్తి, శ్రీ, వాక్కు, స్మృతి, మేధ, ధృతి, క్షమలు కూడా నేనే.

సామగీతాల్లో బృహత్సామం నేనే. ఛందోవిశిష్ట ఋక్కుల్లో ద్విజత్వం చేకూర్చే గాయత్రీఛందం నేనే. మాసాల్లో సమశీతోష్ణమైన మార్గశీర్షమాసం నేనే. ఋతువుల్లో వసంతఋతువును.

వంచనపరుల జూదం, తేజశ్శాలుర తేజం, ఉద్యమకారుల ఉద్యమం, జయ శీలుర విజయం, సాత్త్వికుల సత్త్వగుణం నేనే.

యాదవుల్లో శ్రీకృష్ణుణ్ని. పాండవుల్లో అర్జునుణ్ని. మునుల్లో వేదవ్యాసుణ్ని. కవుల్లో శుక్రుణ్ని.

దండించేవారి దండాన్ని. జిగీషుల్లో రాజనీతిని. రహస్య గుప్తపరుల్లో మౌనాన్ని. జ్ఞానుల తత్త్వజ్ఞానాన్ని.

అర్జునా! సర్వభూత మూలకారణం నేనే. ఇదీ అదీ అనటం దేనికి? స్థావర జంగమాత్మక వస్తువుల్లో ఏ ఒక్కటీ నా సత్తా లేకుండా నిలువలేదు. అన్నీ మదాత్మకాలే.

అర్జునా! నా దివ్యవిభూతి పరంపర కంతేలేదు. అయినా సంక్షేపంగా నీకు వివరించాను.

చివరగా నీకు చెప్తున్నా నర్జునా!

ఐశ్వర్యయుక్తము, శ్రీమంతము, ఊర్జితము అయిన ఏ వస్తువైనా సరే, ఏ ప్రాణి అయినా సరే, నా తేజోఽంశ సంభవంగా నీవు గ్రహించాలి.

పార్థా! ఇంత అధికంగా నా విభూతులు తెలుసుకొన్నందువల్ల నీకు గల్గే లాభ మేమిటి? నే నీ సమస్త విశ్వాన్ని వ్యాపించి ధరించి ఉన్నా ననే సత్యం ఏ ఒక్క అంశాన్నిబట్టైనా నీవు సమగ్రంగా గ్రహించగలవు.

**అర్జునుడు :**

చిత్తం. బహిర్గతమైన ఈశ్వరుణ్ని, ఇంద్రియ ద్వారముల ద్వారా సర్వత్ర సందర్శించే మహావకాశం కల్గించిన సర్వేశ్వరా! మీకు నా కృతజ్ఞతాభివందనాలు.

* * *

ఈ మహోదాత్త సంవాద మెవడు వినిన
శ్రద్ధ చదివిన ఆత్మవిజ్ఞాని యగును;
ఆ పరాత్పరుని యనుగ్రహమ్ము పొందు
కాంతిపథమున పయనింపగలడు నరుడు!

**ఓం తత్ సత్**



శ్రీకృష్ణార్జున సంవాద మనే

వచన భగవద్గీతలో

# 11. విశ్వరూప దర్శన యోగం

అర్జునుడు :

భగవాన్! పరమకృపతో నీ విభూతివైభవం అభివర్ణించి మహానందభరితుణ్ని కావించావు. దాని నాకర్ణించిన తరువాత నీ విశ్వరూప దిదృక్షాకాంక్ష తీవ్రమైంది. నన్ననుగ్రహించు.

పరమపురుషార్థప్రదము, అత్యంత రహస్యము, ఆత్మానాత్మ వివేక విషయము, ఆధ్యాత్మికమునైన భవద్దివ్యవాక్య మాలకించిన తరువాత విగత వ్యామోహుణ్నై నాను.

ఓ కమలపత్రాక్షా! భూతకోటి జనన మరణాలు రెండూ నీ వల్లనే కల్గుతున్నా యనే విషయం విశదం. సర్వాత్మకత్వ నిర్లేపకత్వాది రూపకమైన భవదక్షయ మహాత్మ్యం విశ్రుతం.

పరమేశ్వరా! ఓ పురుషోత్తమా! నీవు నుడివిన ఆత్మతత్త్వం మీద నా ప్రత్యయం అచంచలం. భవద్ జ్ఞానైశ్వరశక్తి బలవీర్యాది సంపన్నస్వరూపం దర్శించాలని ఉత్కంఠిస్తున్నాను.

నేను నీ విశ్వరూప దర్శనానికి యోగ్యుణ్నని నీ వనుకుంటేనే ఓ యోగేశ్వరా! నీ అవ్యయ జగదాత్మరూపం ప్రదర్శించు.

శ్రీకృష్ణభగవానుడు :

పార్థా! నీ ఉత్కంఠ నా కవగతం. నీ అర్హత ప్రశ్నింపరానిది. సావధానుడవు కా. నా నానావిధ దివ్యరూపాలు, నానావిధ వర్ణాకృతులతో అలరారేవి వందలు, వేలు ఉన్నాయి. అవన్నీ సందర్శించు.

భారతా! వారే ద్వాదశాదిత్యులు. వా రష్టవసువులు. ఏకాదశరుద్రు లరుగో. వీరు సూర్యపత్ని సంజ్ఞాదేవికి జనించిన అశ్వనీకుమార ద్వయం. మరుద్దేవతా సప్తక మదిగో చూడు. నీవుగానీ, తదితరు లెవ్వరుగానీ ఇంతవరకూ చూడని అనేకాద్భుత రూపాలు చూపిస్తాను.

ఓ గుడాకేశా! ఈ నా శరీరంలోని అవయవంలాగానే ఉండే స్థావర జంగమాత్మక విశ్వమంతా వీక్షించు. అంతేకాదు. జగదాశ్రయభూతమైన కారణస్వరూపాన్ని, జగత్ స్థితిగతుల్ని, జయపరాజయాదుల్ని నీవు చూడాలని కోరేవాటి నన్నింటిని బాగా చూడు.

యోగ్యతను గూర్చి ప్రస్తావించావు. నీ మాంస చక్షువులతో నన్ను నీవు చూడలేవు. కాబట్టి నీకు దివ్యచక్షువులు ప్రసాదిస్తున్నాను. వీటితోనే నా అసాధారణ యోగశక్తి దర్శించగల్గుతావు.

### సంజయుడు :

ధృతరాష్ట్ర మహారాజా! మహాయోగేశ్వరుడు శ్రీహరి ఆరీతిగా మాట్లాడిన తరువాత పార్థునకు పరమమైన విశ్వరూపం దర్శింపజేసాడు.

అనేక వక్త్రనయనము, అనేకాద్భుత దర్శనము, అనేక దివ్యాభరణము, అనేక దివ్యాయుధయుక్తమునైం దీవిశ్వరూపం.

దివ్యమాల్యాంబరధరము, దివ్యగంధానులేపనము, సర్వాశ్చర్యమయము, అనంతదీప్తిమంతము, విశ్వతోముఖమునైం దీవిశ్వరూపం.

ఒకేతడవ ఆకాశంలో సహస్రసూర్యు లుదయిస్తే ప్రభవించే జ్యోతి, ఈ విశ్వరూపుని కాంతి కొకింత సరిపోవచ్చు.

అప్పు డర్జును డాదేవదేవుని శరీరంలో దేవ పితృ మనుష్యాది నానారూపాల విభక్తమైన జగత్తు నంతా చూచాడు. అది ఆ విశ్వరూపంలో ఒక అవయవం లాగా గోచరించింది.

అనంతరం అర్జును డాశ్చర్యచకితుడు, పులకితగాత్రుడై విశ్వరూపధారియైన భగవంతుడికి శిరసా ప్రణమిల్లి కృతాంజలియై కావించిన స్తుతి నోరాజా! ఆలకించండి.

అర్జునుడు :

సందర్శిస్తున్నానో దేవా! నీ దేహంలో సకల దేవతాసమితిని; స్థావర జంగమాత్మక భూతసముదాయాన్ని; వసిష్ఠాది దివ్యఋషుల్ని; తక్షకాది సర్పాల్ని; పృథివికి పద్మకర్ణికయైన మేరుపర్వతాన్ని; నీ నాభిపద్మంలో ఆసీనుడైన సృష్టికర్త బ్రహ్మను.

సందర్శిస్తున్నానో విశ్వేశ్వరా! విరాడ్రూపధరా! సర్వత్రా నీ అనంతరూపాన్నే. అది అనేక బాహూదరవక్త్రనేత్రం. ఈ నీ రూపానికి ఆది యేదో, మధ్య మేదో, తుది యేదో తెలుసుకోలేకపోతున్నాను.

అంతటా కిరీటధారివి, గదాధరుడవు, చక్రహస్తుడవు, దీప్తిమంతుడవు, తేజో విరాజమానివి, దుర్నిరీక్ష్యుడవు, ప్రదీప్తానలార్క తేజోమయుడవు, అప్రమేయుడవు అయిన నిన్నే తిలకిస్తున్నాను.

అక్షరపరబ్రహ్మ వీవు. ఏకమాత్ర జ్ఞేయవస్తువవు. విశ్వానికి పరమాశ్రయుడవు. అవ్యయుడవు. శాశ్వత ధర్మగోప్తవు. సనాతన పురుషుడవు.

సమీక్షిస్తున్నాను నిన్ను - ఆదిమధ్యాంతరహితునిగా; అనంతవీర్యవంతునిగా; అనంత బాహుసమన్వితునిగా; శశిసూర్యనేత్రునిగా; ప్రజ్వలితాగ్ని ముఖ విశిష్టునిగా; స్వతేజఃప్రతప్త సర్వలోకునిగా.

మహాత్మా! భూ నభోంతర పరివ్యాప్త్యైకమూర్తి వీవే. సకల దిశావ్యాప్తుడ వీవే. భవ దద్భు తోగ్ర రూప సందర్శనంవల్ల లోకత్రయం భయపడుతుంది.

యుద్ధసన్నద్ధులైన మానవశరీరధారులు, వసువులు, తదితర దేవతలు నీలోకే ప్రవేశిస్తున్నారు. కొందరు భీతచిత్తులై ప్రాంజలించి నిన్ను స్తుతిస్తున్నారు. మహర్షి సిద్ధసంఘాలు స్వస్తివాచకాలతో పుష్కలంగా నిన్ను సన్నుతిస్తున్నారు.

రుద్రులు, ఆదిత్యులు, వసువులు, సాధ్యులు, విశ్వేదేవతలు, అశ్వనీదేవతలు, మరుద్గణం, పితృదేవతలు, గంధర్వులు, యక్షులు, అసురులు, సిద్ధులు మున్నగు వారందరూ విస్మితులై నిన్ను వీక్షిస్తున్నారు.

ఓ మహాబాహో! బహువక్త్రనేత్రము; బహు బాహూరుపాదము; బహూదరము; బహు దంష్ట్రాకరాళము అయిన భవత్ మహద్రూపం విలోకించి, లోకులు వ్యథిత చిత్తులైనారు. నేను కూడా వారి లాగానే భయగ్రస్తుణ్ని.

ఓ విష్ణూ! గగన స్పర్శము, ప్రదీప్తము, నానావర్ణ సంయుక్తము, విస్ఫార వదనము, ఉజ్జ్వల విశాలనేత్రము అయిన నీ విశ్వరూపం వీక్షించి నా మనస్సు కలవరపడుతున్నది. ధైర్యం వహించలేకపోతున్నాను. అశాంతుణ్ణవుతున్నాను.

ఓ దేవేశా! జగన్నివాసా!! దంష్ట్రాకరాళము, కాలానలసన్నిభము అయిన నీ ముఖాలు చూస్తుంటే దిగ్భ్రమ కల్గుతున్నది. సుఖంగా ఉండలేకపోతున్నాను. ప్రసన్నుడవు కా.

నృపతిమండలంతో కూడిన ఈ ధృతరాష్ట్ర పుత్రు లందరూ, అదేరీతిగా భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు ఇంకా మన యోధముఖ్యులు దృష్టద్యుమ్నాదులు కూడా నీ లోనికే ప్రవేశిస్తున్నారు.

వారందరూ వికృత దంష్ట్రలతో కూడిన నీ భయానక ముఖవివరాల్లోకి తొందర పాటుతో చేరుతున్నారు. కొంతమంది పండ్లసందుల్లో చిక్కువడి నుగ్గునుగ్గౌతున్న శిరస్సులతో కనిపిస్తున్నారు.

ఏరీతిగా నదులన్నీ సముద్రముఖంగా ప్రవహించి సముద్రంలోకే ప్రవహిస్తు న్నాయో అదేరీతిగా నరలోక వీరు లందరూ ప్రజ్వలించే నీ వక్త్రాల్లోకి చేరుతున్నారు.

మిడుతలదం డేరీతిగా సమృద్ధ వేగంతో పండు నిప్పుల్లోకి దూకుతుందో అదేరీతిగా ప్రజానీకమంతా అతివేగంగా నశించటానికి నీ నోళ్లలోకి దూకుతున్నది.

భగవంతుడా! దేదీప్యమాన ముఖాలతో సమగ్ర వీరలోకాన్నిగ్రసిస్తూ, ఆసమంతంగా ఆస్వాదిస్తున్నావు. నీ ఉగ్రప్రభాకాంతులతో ఈ జగత్తును తపింప జేస్తున్నావు.

ఇంతటి మహోగ్రమూర్తివి నీ వెవరవో పేర్కొను. నీకు నమస్కారం. దేవదేవా! ప్రసన్నుడవు కా. ఆదిపురుషుడవు నిన్ను తెలుసుకోవాలనే నా ఆకాంక్ష. నీ ప్రవర్తన నా కేమీ అర్థంకావటం లేదు. తెలియజెయ్యి స్వామీ!

### శ్రీకృష్ణభగవానుడు :

అర్జునా! నేను లోకసంహారార్థం విజృంభించే కాలుణ్ని. ఇప్పుడు ప్రాణ సంహారాని కుపక్రమించాను. నీవు యుద్ధం చేయకపోయినా, శత్రుపక్షంలోని వీరు లందరూ ఇకముం దుండరు.

కాబట్టి నీవు లేవాలి. యశస్సు నార్జించాలి. శత్రువుల్ని నిర్జించాలి. నిష్కంటకంగా రాజ్యభోగా లనుభవించాలి. ఈ వీరు లందరు ఇంతకు మునుపే నాచేత నిహతులు. ఓ సవ్యసాచీ! నీవు నిమిత్తమాత్రుడవే సుమా!

ఎవరిని వధించటానికి నీవు సంకోచిస్తున్నావో ఆ భీష్ముడు, ద్రోణుడు, జయద్రథుడు, కర్ణుడు, ఇంకా తదితర వీరుల్ని కూడా నీవు చంపు. అందు కేమాత్రం విచారించకు. భయపడకు. నీవు జయిస్తావు. యుద్ధం చెయ్యి.

### సంజయుడు :

రాజా! కేశవుని మాట విని వణికిపోతూ కిరీటి కృతాంజలియై శ్రీకృష్ణునికి నమస్కరించి, ఎక్కువగా భయపడుతూ, ప్రణమిల్లి గద్గదస్వరంతో ఇట్లా అన్నాడు.

### అర్జునుడు :

హృషీకేశా! నీ మహాత్మ్య ప్రకీర్తనంచేసి జగత్తు ఆనందిస్తున్నది. అనురంజిస్తున్నది. రాక్షసులు భీతిచెంది నలుదిక్కులకు పారిపోతారు. సిద్ధసంఘాలన్నీ నమస్కరిస్తున్నాయి. ఇది యుక్తియుక్తం.

మహాత్మా! అనంతా! దేవేశా! జగన్నివాసా!! బ్రహ్మకు కూడా గురుడవు నీవు. ఆదికర్తవు. వ్యక్తావ్యక్తము నీవే. ఈ రెంటికీ అతీతమైన అక్షరుడవు నీవే. అందుచేత దేవతలుసైతం నీకు నమస్కరిస్తారు.

అనంతరూపా! నీ వాదిదేవుడవు. పురాణపురుషుడవు. నీ వీ విశ్వాని కేకాశ్రయుడవు. సర్వజ్ఞుడవు. జ్ఞేయం నీవే. పరంధాముడవు. విశ్వవ్యాప్తుడవు.

నీవు వాయుదేవుడవు. యముడవు. అగ్నివి. వరుణుడవు. చంద్రుడవు. ప్రజాపతి రూపంలో లోకానికి తండ్రివి. బ్రహ్మకు కూడా తండ్రివి కాబట్టి పితామహుడవు. నీకు నా సహస్ర నమస్కారాలు. పునః పునః ప్రణతులు.

ఓ సర్వాత్మా! నీకు ముందుండి నమస్కరిస్తాను. వెనుకనుండి నమస్కరిస్తాను. అన్నివైపుల నుండి నమస్కరిస్తాను. అనంత వీర్యామిత పరాక్రముడవు. సర్వవ్యాపివి. కనుక సర్వస్వరూపుడవు.

విశ్వరూప ధారణ సమర్థమైన నీ మహిమ సరిగా గుర్తింపలేక, ప్రమాదవశం వల్లగానీ, ప్రణయంచేత గానీ, సఖ్యభావంతో గానీ హే కృష్ణా! హే యాదవా!!

హే సఖా! అని తిరస్కారపూర్వకంగా సంబోధిస్తే, ఇంకా ఓ అచ్యుతా! విహార శయ్యాసన భోజనాదుల్లో గానీ, ఏకాంతంలో గానీ, పరుల సమక్షంలో గానీ, పరిహాసార్థంగా గానీ, ఇంకా ఏరీతిగానైనా ని న్నవమానితుణ్ని చేస్తే అప్రమేయుడవైన నీవు నన్ను క్షమించాలని ప్రార్థిస్తున్నాను.

ఓ అప్రతిమప్రభావా! నీ వీ చరాచర లోకపితవు. పూజ్యుడవు. గురుడవు. గరీయుడవు. లోకత్రయంలో నీ సమానుడు, అభ్యధికుడు లేడు.

కాబట్టి ఓ దేవా! నీకు సాష్టాంగదండప్రణామా లాచరిస్తున్నాను. వందనీయుడవు ఈశ్వరుడవు అయిన నీవు నాకు ప్రసన్నుడవు కా. కుమారుణ్ని తండ్రీ, సఖుణ్ని స్నేహితుడు, ప్రేయసిని ప్రియుడు ఏవిధంగా సహిస్తారో అలా నీవు నా తప్పులు క్షమించాలి.

ఓ దేవా! పూర్వ మెవ్వరికి లేని నీ విశ్వరూపదర్శన భాగ్యం నా కిప్పుడు కల్గించి ఆనందభరితుణ్ని కావించావు. కాని మనస్సు భయాకులితమవుతున్నది. దేవేశా! జగన్నివాసా! ఇంక నీ పూర్వరూపమే నాకు సందర్శనీయం కావించు. నన్ననుగ్రహించు.

నిన్ను పూర్వరీతిగా కిరీటధారునిగా, గదాధరునిగా, చక్రహస్తునిగా చూడాలనే ఆకాంక్షిస్తున్నాను. ఓ సహస్రబాహూ! విశ్వమూర్తీ!! నీ చతుర్భుజ రూపాన్నే ధరించు.

## శ్రీకృష్ణభగవానుడు :

అర్జునా! ఆత్మయోగం వల్ల ఈ తేజోమయము, అనంతము, ఆద్యము, పరము అయిన విశ్వరూపం దర్శించావు గదా! ఇటువంటి రూపం నీకు గాక మరే యితరులకు అదృష్టపూర్వం.

ఓ కురుప్రవీరా! మానవలోకంలో నీవు దక్క అన్యు లెంత వేదవిద్యాధ్యయనపరులైనా, యజ్ఞనిర్వాహకులైనా ఈ రూపం దర్శనీయం కాదు. నిత్యాగ్నిహోత్ర తత్పరులకు గానీ, తులా పురుషాది దానకర్తలకు గానీ, చాంద్రాయణాది కఠోరవ్రతులకు గానీ, ఉగ్రతపోనిరతులకు గానీ ఈ రూపదర్శనం సాధ్యం కాదు.

ఇటువంటి భయంకర రూపం చూచి నీవు చకితుడవు కావలసిన పనిలేదు. చిత్త వైకల్యం పొందవలసిన పని అంతకన్న లేదు. భయ రహితుడవై, ప్రీతమానసుడవై శంఖ చక్ర గదా పద్మధరమైన నా చతుర్భుజ రూపం చూడు.

### సంజయుడు :

మహారాజా! వాసుదేవు డీరీతిగా అర్జునునితో పల్కి అతడు కోరినట్లే తన చతుర్భుజమూర్తి చూపించాడు. విశ్వాత్మమూర్తి సౌమ్యమూర్తియై భీతుడైన అర్జునుణ్ని ఆశ్వాసించాడు.

### అర్జునుడు :

జనార్దనా! నీ సౌమ్యమానుషరూపం చూచి యిపుడు నా మనస్సు హాయిగా ఉంది. స్వస్థుణ్ని అయినాను.

### శ్రీకృష్ణభగవానుడు :

అర్జునా! నీవు చూచిన ఈ విశ్వరూపం అత్యంత దుర్లభం. దేవతలు కూడా ఈ విశ్వరూపం వీక్షించాలని ఆకాంక్షిస్తారు.

ఏరూపంలో నీవు నన్ను చూచావో, అటువంటి రూపం వేదపఠనంవల్ల గానీ, తపస్సువల్ల గానీ, దానంవల్ల గానీ, యజ్ఞయాగాదులవల్ల గానీ సందర్శించటం సాధ్యపడదు.

పరంతపా! అర్జునా!! కేవలం అనన్యభక్తి వల్లనే నన్ను గూర్చిన యథాశాస్త్ర పరిజ్ఞానం ప్రత్యక్ష సాక్షాత్కారం, తాదాత్మ్యమైన మోక్షం సంభవం.

పాండవా! ఎవడు నా ,కోసమే కర్మ లాచరిస్తాడో, నన్నే పరమపురుషార్థంగా సంభావిస్తాడో, ఎవడు దార పుత్త్రాదికం మీద సంగరహితుడో, ఎవడు నన్నే ఆశ్రయించుకొన్న పరమభక్తుడో, ఎవడు తన కపకారం చేసే జీవులపట్ల కూడా వైరభావ విరహితుడో వాడు నన్ను పొందగలడు.

### అర్జునుడు :

దేవతలకు గానీ, తపో యజ్ఞాది కర్మనిరతులకు గానీ సాధ్యంకాని నీ విశ్వరూప సందర్శనం నాకు సుసాధ్యం కావించిన దేవా! నీకు నా సాష్టాంగ సహస్రనతులు.

* * *

ఈ మహోదాత్త సంవాద మెవడు వినిన<br>
శ్రద్ధ చదివిన ఆత్మవిజ్ఞాని యగును;<br>
ఆ పరాత్పరుని యనుగ్రహమ్ము పొందు<br>
కాంతిపథమున పయనింపగలడు నరుడు!

**ఓం తత్ సత్**



# శ్రీకృష్ణార్జున సంవాద మనే
# వచన భగవద్గీతలో
# 12. భక్తి యోగం

## అర్జునుడు :

భగవాన్! సర్వకర్మార్పణం కావించి, నిరంతర నిష్ఠాగరిష్ఠులై, విశ్వరూపుడవైన నిన్ను పర్యుపాసించే భక్తులు; నిర్గుణము, నిర్విశేషము అయిన అక్షర పరబ్రహ్మ ధ్యానపరాయణులు, వీరిరువురిలో ఎవరు యోగవిత్తములో నిష్కర్షించవలసిందిగా ప్రార్థన.

## శ్రీకృష్ణభగవానుడు :

ఎవరు నామీదనే మనస్సు నిల్పి, నిత్యయుక్తులై, ఉత్తమ శ్రద్ధోపేతులై నన్నుపాసిస్తారో వారు యుక్తతము లని నా అభిప్రాయం.

కాని సర్వకాలాల్లో సమబుద్ధి కల్గి, సర్వభూతహితరతులై, ఇంద్రియ నిగ్రహంతో, అనిర్దేశ్యము, అవ్యక్తము, సర్వవ్యాప్తము, అచింత్యము, కూటస్థము, అచలము, అక్షరము నైన నిర్గుణ పరబ్రహ్మమును పర్యుపాసించేవారు నన్నే పొందుతారు.

ఇటువంటి నిర్గుణ బ్రహ్మనిష్ఠులకు క్లేశ మధికం. ఎందుకంటే దేహాభిమానులకు నిర్గుణ బ్రహ్మనిష్ఠ కుదరటం అత్యంత కష్టం.

ఎవరు సమస్త కర్మలు నా కర్పించి, మత్పరులై ఐకాంతిక భక్తియోగంలో నన్ను, సగుణ జగదాత్మరూపంగా గాని, అవతారరూపంలో గాని ధ్యానిస్తారో, ఉపాసిస్తారో అటువంటి ఆవేశితచిత్తుల్ని మృత్యుసంసారసాగరం నుండి శీఘ్రంగా సముద్ధరిస్తాను. నిర్గుణ సగుణోపాసనల్లో ఒకటి శ్రేష్ఠమని, ఇంకోటి నికృష్టమనే విచక్షణ విహితం కాదు. సగుణారాధకులు కూడా సముద్ధరింపబడతారు.

కాబట్టి నామీదనే నీ చిత్తం సుస్థిరం గావించు. బుద్ధి నేకాగ్రం చేయి. ఇట్లా కావిస్తే దేహత్యాగానంతరం నీవు నాలోనే వసిస్తావు. సంశయించవాకు.

ధనంజయా! నామీదనే నీ చిత్తం స్థిరంగా నిల్పుకోటానికి తగిన సమర్థత లేక పోతే అభ్యాసయోగంతో నన్ను పొంద ప్రయత్నించు. విషయాల నుండి మనస్సు మరల్చు. ఏదో ఒక దేవతామూర్తి మీదగానీ, మానసమూర్తి మీదగానీ, ప్రతిమ మీదగానీ మనస్సు నిల్పే ప్రయత్నం ఎడతెగకుండా కావించు. అదే అభ్యాసమంటే.

ఇటువంటి అభ్యాసానికి కూడా నీవు అసమర్థుడవైతే నాకు ప్రీతికరమైన కర్మ లాచరించు. అంటే ఏకాదశి ఉపవాసం, వ్రతాచరణం, వివిధ పూజా నిర్వహణం, నామసంకీర్తనం, నామజపం మొదలైనవి. సిద్ధిపొందుతావు.

ఇటువంటి ప్రీతికరములైన కర్మలకు కూడా తగిన సమర్థత లేకపోతే, సంయత చిత్తుడవై నన్ను శరణుపొందు. దృష్టాదృష్ట విషయఫలాలు, నిత్యకర్మల ఫలం, నా కర్పించు. నా ప్రసాదం వల్ల నీవు కృతార్థుడ వవుతావు.

ఇంకా వివరిస్తాను. వివేకవిరహితమైన అభ్యాసంకంటే జ్ఞానమే శ్రేయోదాయకం. యుక్తిపూర్వక పరోక్షజ్ఞానం కన్న ధ్యానం మిన్న. ధ్యానం కన్న సామాన్యులకు కర్మఫలత్యాగం, అదే నిష్కామకర్మ, మిన్న. కర్మఫల త్యాగానంతరం శాంతి లభిస్తుంది.

**అర్జునుడు :**

భగవాన్! ఎటువంటి గుణాలతో శోభిల్లేవాడు మీ కత్యంత ప్రియుడో వివరిస్తారా?

**శ్రీకృష్ణభగవానుడు :**

ఎవడు సకల ప్రాణికోటిని ద్వేషింపడో
ఎవడు సర్వప్రాణులపట్ల మైత్రీభావోపేతుడో
ఎవడు కరుణాకలితుడో
ఎవడు మమకారం లేనివాడో
ఎవడు నిరహంకారుడో
ఎవడు సుఖదుఃఖాలపట్ల సమభావ సమపేతుడో
ఎవడు క్షమాశీలుడో
ఎవ డెల్లవేళల సంతుష్టుడో
ఎవడు సమాహితచిత్తుడో

ఎవడు సంయత స్వభావుడో
ఎవడు సంకల్పం కలవాడో
ఎవడు తన మనోబుద్ధులు నా కర్పిస్తాడో
ఎవడు నాయందు భక్తితత్పరుడో
అతడు నా కత్యంత ప్రియుడు.

ఎవ డెవ్వరికీ భయాశంకలవల్ల సంక్షోభంగానీ, సంతాపంగానీ కల్గించడో
ఎవ డెవ్వరి నుండి సంక్షోభం పొందడో
ఎవడు హర్షామర్ష భయోద్వేగ విరహితుడో
అతడు నా కత్యంత ప్రియుడు.

ఎవడు దేహేంద్రియ వాంఛారహితుడో
ఎవడు బాహ్యాభ్యంతర శౌచ సంపన్నుడో
ఎవడు యథాప్రాప్త కార్యాచరణ దక్షుడో
ఎవడు ఉదాసీనుడో
ఎవడు భయరహితుడో
ఎవడు సకామ కర్మానుష్ఠానం త్యజిస్తాడో
అతడు నా కత్యంత ప్రియుడు.

ఎవ డిష్టప్రాప్తికి సంతోషింపడో
ఎవ డనిష్టప్రాప్తిని ద్వేషింపడో
ఎవ డిష్టవస్తు నష్టానికి శోకింపడో
ఎవ డప్రాప్తాన్ని వాంఛింపడో
ఎవడు పుణ్యపాప కర్మలు పరిత్యజిస్తాడో
అతడు నా కత్యంత ప్రియుడు.

ఎవడు శత్రుమిత్రులపట్ల సమభావుడో
ఎవడు మానావమానాలపట్ల కూడా సముడో
ఎవడు శీతోష్ణసుఖదుఃఖాలపట్ల చలింపడో
ఎవడు ప్రపంచ విషయాలపట్ల ఆసక్తి రహితుడో

ఎవడు నిందాస్తుతులపట్ల తుల్యుడో
ఎవడు వాక్సంయమనం గలవాడో
ఎవడు కించిత్తు లభించినా సంతుష్టుడో
ఎవడు అనికేతనుడో
ఎవడు నిశ్చలచిత్తుడో
అటువంటి భక్తుడు నా కత్యంత ప్రియుడు.

ఎవరు శ్రద్ధాళువులై మత్పరాయణతతో అమృతతుల్యధర్మం అనుష్ఠిస్తారో అటువంటి భక్తులు నా కత్యంత ప్రియులు.

**అర్జునుడు :**

భగవాన్! నిర్గుణోపాసన మిక్కిలి కష్టమని, విఘ్నబహుళమని, భక్తి సత్పథ మవలంబించి బుధులు భవత్పదాంభోజాలు భజించి తరించవచ్చు నని ఉపదేశించారు. మీ కివే మా ప్రణామాలు.

భవద్భక్తు డెటువంటి గుణాల నలవరచుకొంటే మీ కత్యంత ప్రీతిపాత్రు డవుతాడో కూడా విశదీకరించారు. వాటి నాచరించి నరోత్తముణ్ని కావాలనే ఆకాంక్షిస్తున్నాను.

* * *

ఈ మహోదాత్త సంవాద మెవడు వినిన
శ్రద్ధ చదివిన ఆత్మవిజ్ఞాని యగును;
ఆ పరాత్పరుని యనుగ్రహమ్ము పొందు
కాంతిపథమున పయనింపగలడు నరుడు!

**ఓం తత్ సత్**



శ్రీకృష్ణార్జున సంవాద మనే

వచన భగవద్గీతలో

# 13. క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగం

అర్జునుడు :

భగవాన్! భక్తుల్ని సంసారం నుండి సముద్ధరిస్తానని అభయమిచ్చావు గదా! అందుకు మా కెటువంటి తత్త్వజ్ఞాన మవసరమో తెలియజేయ గోరుతాను. అందుకు ప్రప్రథమంగా ప్రకృతి పురుషులు, క్షేత్ర క్షేత్రజ్ఞులు, జ్ఞాన జ్ఞేయాలు అనే విషయాలు విదితం చేయమని వేడుకొంటున్నాను.

శ్రీకృష్ణభగవానుడు :

కౌంతేయా! త్రిగుణాత్మక ప్రకృతి దేహేంద్రియాకారంగా పరిణమించిన సంఘాతమే శరీరం. దీన్నే క్షేత్ర మంటారు. సంసారోత్పత్తి భూమి కాబట్టి దీనికి క్షేత్రమనే పేరు వచ్చింది. దీన్ని తెలుసుకొనేవాడు క్షేత్రజ్ఞుడు.

భారతా! సర్వక్షేత్రాల్లో ఉండే నన్ను క్షేత్రజ్ఞునిగా తెలుసుకో. క్షేత్రజ్ఞుని జ్ఞానమే యథార్థజ్ఞానం.

ఏది క్షేత్రమో, ఏ జడదృశ్యాది స్వభావం కల్గి, ఎటువంటి ఇచ్ఛాధర్మాలతో కూడిందో, ఏ యింద్రియ వికారాలకు లోనౌతుందో చెప్తాను. ఇంకా ఏ ప్రకృతి పురుష సంయోగం వల్ల కల్గి, ఏ స్థావర జంగమాది భేదాలతో ఒప్పుతుందో కూడా పేర్కొంటాను. ఇంకా క్షేత్రజ్ఞుని స్వరూపం, అతని అచింత్య యోగైశ్వర్య ప్రభావం కూడా సంగ్రహంగా చెప్పి నీ జిజ్ఞాస తీరుస్తాను.

క్షేత్రక్షేత్రజ్ఞుల మాహాత్మ్యం ఋషులు విభిన్న వేదమంత్రోక్తుల్లో పేర్కొన్నదే. సంశయరహితంగా, హేతుబద్ధంగా బ్రహ్మసూత్రాల్లో అభివర్ణింపబడింది.

పంచ సూక్ష్మభూతాలు, వాటికి కారణమైన అహంకారం, దానికి కారణమైన బుద్ధి, బుద్ధికి కారణమైన అవ్యాకృత బ్రహ్మశక్తి అనబడే మూలప్రకృతి,

దశేంద్రియాలు, మనస్సు, ఇంద్రియ విషయాలైన శబ్దాలు, ఇచ్ఛాద్వేష సుఖదుఃఖ సంఘాతమైన శరీరం, దానిలో గోచరించే బుద్ధిచేతన, ధైర్యం కలిసి క్షేత్ర మనబడు తున్నది. ఇదే ఇంద్రియాదుల వికారాలతో కూడిన క్షేత్రతత్త్వ రహస్యం'

ఇక జ్ఞాన సాధనాలు ఇరవై. ఇవి తప్పక ఆచరింపవలసినవి.

1. అమానిత్వం - తన్ను తాను పొగడుకోకుండా ఉండటం.
2. అదంభత్వం - స్వధర్మం ప్రకటించకుండా ఉండటం.
3. అహింస - పరులను పీడించకపోవటం.
4. క్షాంతి - క్షమ - ఇతరు లపరాధం చేస్తే మనసు కలతనందక పోవటం.
5. ఆర్జవం - సరళత; కుటిలత లేకపోవటం.
6. ఆచార్యోపాసనం - గురు శుశ్రూష.
7. శౌచం - బాహాభ్యంతర శుచిత్వం.
8. స్థైర్యం - మోక్ష సన్మార్గంలో ఏకనిష్ఠ.
9. ఆత్మవినిగ్రహం - స్వాభావిక ప్రవృత్తులు నియమించి సన్మార్గంలో ప్రవృత్తం చేయటం.
10. ఇంద్రియభోగ విరక్తి.
11. అనహంకారం.
12. జన్మ, మృత్యు, జరావ్యాధి దుఃఖ దోషానుదర్శనం.
13. అనాసక్తి - పుత్ర దార గృహాదుల్లో ఆసక్తి లేకపోవటం'
14. అనన్యాత్మభావం - అన్యుల దుఃఖాలకు చలింపకపోవటం.
15. సమచిత్తత్వం - శుభాశుభప్రాప్తిపట్ల సమభావం.
16. ఐకాంతిక భక్తి - సర్వాత్మదృష్టితో భక్తి నెరపుట.
17. వివిక్త దేశసేవిత్వం - చిత్తప్రసాద ప్రదేశాల్లో నివాసం.
18. జనసంసది అరతి - ప్రాకృతజన సంసర్గత్యాగం.
19. అధ్యాత్మజ్ఞాననిష్ట.
20. తత్త్వజ్ఞానార్థ దర్శనం - మోక్షం పట్ల సర్వోత్కృష్ట బుద్ధి.

వీటి విపరీతమైన మానిత్వదంభాదు లజ్ఞాన సాధనాలని వేరుగా చెప్పాలా?

అర్జునా! ఇక ఏది జ్ఞేయమో, దేన్ని తెలుసుకొంటే అమృతత్వం లభిస్తుందో దాన్ని వివరిస్తాను, విను. అది అనాది. పరబ్రహ్మము. అది సత్ శబ్దగోచరమూ కాదు, అసత్ శబ్దగోచరమూ కాదు. ఎందుకంటే ఇంద్రియగోచరమయ్యే వస్తువులన్నీ సదసద్వాచ్యాలు. కాని బ్రహ్మ మింద్రియగోచరం కాదు. వేదప్రమాణ విషయాలన్నీ విధిముఖంగానో, నిషేధముఖంగానో అభివర్ణితం. విధిముఖ గోచరాలు. సత్‌శబ్దవాచ్యాలు. నిషేధాలన్నీ అసత్ శబ్దవాచ్యాలు. బ్రహ్మం ఉభయ విలక్షణం. బ్రహ్మం అవిషయం.

అయితే అంతటా హస్తపాదాలు కలదిగా, అంతటా కళ్ళు, తల, నోరు కలదిగా, అంతటా చెవులు కలదిగా బ్రహ్మం లోకమంతటా వ్యాపించింది.

సర్వేంద్రియ వ్యాపారాల్లో బ్రహ్మం ప్రకాశిస్తుంది. అయితే దానికే యింద్రియం లేదు. సంగరహితం. అన్నిటికిని ఆధారం. త్రిగుణరహితమైనా గుణాల్ని పరిపాలిస్తుంది. జీవరూపంలో భోక్తగా ఉంటుంది.

ఇంకా ఆ బ్రహ్మం, చరాచర భూతాల బహిరంతరాల్లో కూడా ఉన్నది. స్థావర జంగమ శరీరముల వెలుపల, లోపల కూడా బ్రహ్మమే. వాటి శరీరం కూడా బ్రహ్మమే. సూక్ష్మం కావటం చేత అది తెలియరాదు. విషయబుద్ధుల కది దూరస్థం. శుద్ధచిత్తులకు సమీపంగానే ఉన్నది. అంటే తెలియకపోవటంచేత అజ్ఞానులకు దూరం. జ్ఞానులకు ఆత్మస్వరూపం కాబట్టి సమీపం.

ఈ బ్రహ్మము సర్వభూతాలకు కారణరూపంలో అభిన్నమైనా, కార్యరూపంలో భిన్నం. ఎలాగంటే ఫేన బుద్బుదాలు, సముద్రజాతమే అయినా సముద్రం కన్న భిన్నంగా గోచరిస్తున్నట్లు. బ్రహ్మమే భూతభర్త. సంహర్త. ప్రభవిష్ణువు కూడా.

ఈ బ్రహ్మము సూర్యచంద్రాది జ్యోతులకు జ్యోతి. తమస్సుచే తాకబడనది. ఇదే బుద్ధివృత్తులచేత అభివ్యక్తమయ్యే జ్ఞానం. రూపాది ఆకారంలో తెలియబడేది జ్ఞేయం. అమానిత్వాది సాధనలచేత బ్రహ్మము తెలియబడుతుంది. ఇది అందరి హృదయాల్లో అంతర్యామిగా ఉన్నది. అందుచేత ఇది పొందరానిదిగా భావించ కూడదు.

ఈవిధంగా క్షేత్రం, జ్ఞానం, జ్ఞేయం అనే మూడింటిని గూర్చి సంక్షిప్తంగా పేర్కొన్నాను. నా భక్తు డీమూడింటిని తెలిసికొని బ్రహ్మభావం పొందటానికి యోగ్యుడౌతాడు.

ఇక ప్రకృతి పురుషులు : ఈ ఇర్వురూ కూడా ఆదిలేనివారే. అనాదియైన ఈశ్వరశక్తి కాబట్టి పురుషుడు కూడా ఈశ్వరాంశ కాబట్టి అతడూ అనాదే. శరీరేంద్రియ రూపాలైన వికారాలు, సుఖదుఃఖ మోహాదు లయిన గుణ పరిణామాలు ప్రకృతి నుండి కల్గినవిగానే గ్రహించాలి.

ఈశ్వరుని త్రిగుణాత్మిక మాయాశక్తియైన ప్రకృతి దేహేంద్రియాలు సృష్టిస్తున్నది. జీవుడు సుఖదుఃఖాలు భోగిస్తాడు.

అచేతనమైంది ప్రకృతి. దీనికి స్వతః కర్తృత్వం లేదు. అవికారియైన పురుషుడికి భోక్తృత్వం లేదు. అయినా ప్రకృతి సాన్నిధ్యం వల్ల పురుషుడికి భోక్తృత్వం చెప్పబడుతున్నది. గుణసంగం వల్లనే పురుషుడైన జీవుడికి దేవతాది సత్‌జన్మలు, పశ్వాది అసత్‌జన్మలు, ఉభయవిధ మనుష్యజన్మ కల్గుతున్నాయి.

పురుషుడు ప్రకృతికార్యమైన శరీరంలో ఉంటున్నా స్వతంత్రుడు. గుణబద్ధుడు కాడు. ఎందుకంటే శరీరేంద్రియ వ్యాపారాల సంసర్గం లేకపోయినా, వాటికి వేరుగా ఉన్నా సామీప్యస్థితి వల్ల వాటికి సాక్షిమాత్రుడు. అనుగ్రాహకుడు. భర్త, భోక్త, మహేశ్వరుడు, పరమాత్మ అని శ్రుతి చెప్తున్నది.

ఏవం విధంగా ఎవడు సాక్షాత్తుగా ఆత్మభావంతో పరమపురుషుడైన పరమాత్మను, ప్రకృతిని గ్రహిస్తాడో అతడు మరల జన్మింపడు.

కొందరు మనస్సును ధ్యానప్రవృత్తం కావించి, మరికొందరు ప్రకృతి పురుష భేద పర్యాలోచనమైన జ్ఞానయోగ మవలంబించి, ఇంకా కొందరు అష్టాంగయోగం ద్వారాను, తదితరులు నిష్కామకర్మయోగం అవలంబించి ఆత్మను దర్శిస్తారు.

మరికొందరు ఆత్మను యథార్థంగా తెలుసుకోలేకపోయినా గురుముఖంగా విని ఉపాసిస్తారు. గురూపదేశ నిష్ఠులు కూడా మృత్యుమయమైన సంసారం క్రమంగా అతిక్రమిస్తారు.

భరతర్షభా! స్థావర జంగమ రూపమైన పదార్థసృష్టి, క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగం వల్లనే, అంటే అవివేకకృత తాదాత్మ్య - అధ్యాసవల్లనే అని గ్రహించు.

దీన్ని నివారించాలంటే అసంగాత్మక సమ్యగ్ దర్శనం కావాలి. స్థావర జంగమాత్మక సర్వభూతాలపట్ల సమభావం ప్రవర్తిల్లాలి. నశ్వర వస్తువుల్లో కూడా నశించకుండా ఉండే పరమేశ్వరుణ్ని ఎవడు దర్శించగల్గుతాడో వాడే యథార్థ దర్శి.

ఎందుకంటే, సర్వత్ర సమానంగా ఉండే పరమాత్మను దర్శించే వ్యక్తి, తన్ను తాను హింసించుకోడు. అవిద్య వల్ల సచ్చిదానందమైన ఆత్మను వినాశనం చేసి కోడు. కనుక అతడూ మోక్షార్హుడే. అట్లా చూడని దేహాత్మదర్శి, శరీరంతో పాటు ఆత్మను హింసిస్తాడు. దేహాన్నే ఆత్మగా గ్రహించి, దాని మృతి తన మృతిగా భావించి మాటిమాటికి హతుడౌతున్నాని బాధపడతాడు.

ఎవడు మనోవాక్కాయ కృత కర్మలన్నీ దేహేంద్రియాకారంగా పరిణమించిన ప్రకృతే సర్వప్రకారాలుగా చేస్తున్నదని, ఆత్మ, కర్తృత్వరహితమని, సర్వోపాధి వర్జితమని, దేహాభిమానం వల్లనే కర్తృత్వభ్రాంతి యని గ్రహిస్తాడో వాడు యథార్థ దార్శనికుడు.

ఎప్పుడు భూతసమూహపార్థక్యం, వాటి నానాత్వం, ఒకే ఆత్మలో నెలకొనటం, ఆ ఆత్మనుండే భూతోత్పత్తి, నానాత్వాదులు కల్గుతున్నట్లు గ్రహింపగల్గుతాడో అప్పు డాయోగి బ్రహ్మస్వరూపు డౌతాడు.

అర్జునుడు :

సంసారస్థితిలో శరీర నిమిత్తాలయిన కర్మలు, కర్మఫలాలు, సుఖదుఃఖాలు కల్గుతుంటే సమదర్శన మెట్లా సాధ్యం?

శ్రీకృష్ణభగవానుడు :

కౌంతేయా! పరమాత్మ అనాది, ఉత్పత్తిరహితం, నిర్గుణం, గుణాసంగం. కనుక అవ్యయం. అవికారం. పరమాత్మ శరీరంలో ఉన్నా ఏమీ చేయడు. అందుచేత కర్మఫలసంగం ఉండదు. పరమాత్మే శరీరస్థుడై మిథ్యగా జీవభావం పొందు తున్నాడు.

ఇందుకు మంచి ఉదాహరణం - ఆకాశం. ఇది సర్వవ్యాపి. సూక్ష్మం. అందువల్ల దేనిచేతా అంటబడదు. ఆవిధంగానే వివిధ శరీరాల్లో వెలుగొందే ఆత్మ కూడా శరీరగత గుణదోషాల చేత తాకబడదు. నిర్లిప్తంగానే ఉంటుంది.

భారతా! సూర్యు డీ సమస్త జగత్తునూ ఏవిధంగా ప్రకాశింపజేస్తున్నాడో ఆవిధం గానే దేహి అయిన పరమాత్మ సమస్త క్షేత్రాల్ని ప్రకాశింప చేస్తున్నాడు.

ఏవం విధంగా ఎవడు క్షేత్రక్షేత్రజ్ఞులకున్న ప్రభేదం, అదే విధంగా భూత సమూహానికి చెందిన అవిద్యా లక్షణమైన ప్రకృతి మిథ్యాత్వాన్ని జ్ఞాననేత్రంతో సందర్శించగల్గుతాడో వాడు పరబ్రహ్మాన్ని పొందుతాడు.|

ఒకదాని నుండి ఇంకోటి వేరైన దృక్-దృశ్యం అనేవి రెండు పదార్థాలు. దృక్ అంటే ద్రష్ట, చూచేవాడు బ్రహ్మము. దృశ్యమంటే జగత్తు, మాయ.

దృక్, ద్రష్ట, క్షేత్రజ్ఞుడు అంటే చైతన్య స్వస్వరూపుడైన విజ్ఞాత. ప్రకాశకమగు బ్రహ్మము. దృశ్యము, క్షేత్రము, జగత్తు అనేవి జడము. విషయము.

ఇట్లా నిరంతరం భావించగల్గితే సమదర్శనం సంప్రాప్తిస్తుంది.

**అర్జునుడు :**

ఓ నందనందనా! ఈశ్వరా! వాస్తవానికి వేరై, అధ్యాస వల్ల కలిసిపోయిన ప్రకృతి పురుషుల తత్త్వం విశదంచేసి కనువిప్పు కల్గించిన కరుణామయా! నీకు నా నమస్కారాలు.

* * *

ఈ మహోదాత్త సంవాద మెవడు వినిన
శ్రద్ధ చదివిన ఆత్మవిజ్ఞాని యగును;
ఆ పరాత్పరుని యనుగ్రహమ్ము పొందు
కాంతిపథమున పయనింపగలడు నరుడు!

**ఓం తత్ సత్**



## శ్రీకృష్ణార్జున సంవాద మనే

## వచన భగవద్గీతలో

# 14. గుణత్రయ విభాగ యోగం

అర్జునుడు :

భగవాన్! ప్రకృతి పురుషుల స్వాతంత్ర్యం నివారిస్తూ గుణాల వల్ల కల్గే సంసార వైచిత్ర్యం విశదపరచవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

శ్రీకృష్ణభగవానుడు :

జ్ఞానాలన్నింటిలో ఉత్తమమైంది పరమాత్మ విషయక జ్ఞానం. ఈ జ్ఞానం వివరిస్తాను మరల. ఇందులోనే నీ వడిగిన వైచిత్రి విశదమౌతుంది. ఈ జ్ఞానం పొందిన మునులు దేహబంధం విడివడి పరమసిద్ధియైన మోక్షం పొందుతారు.

ఈ జ్ఞాన మనుష్ఠిస్తే నా స్వరూపం పొందుతారు. వీరు ప్రళయకాలంలో వ్యథ చెందరు. సృష్టికాలంలో పుట్టరు.

భారతా! త్రిగుణాత్మక ప్రకృతి నాకు గర్భస్థానం. అది దేశకాలాల నతిక్రమించి, స్వకార్యరూపంలో వృద్ధిపొందుతుంది కాబట్టి 'మహద్ బ్రహ్మ' అనబడుతుంది. అందులో సృష్టి బీజ ముంచుతాను. అనంతరం సంభవించిన హిరణ్యగర్భుని నుండే సర్వప్రాణులు సృష్టింపబడుతాయి.

కౌంతేయా! దేవ, పితృ, మనుష్య, పశ్వాది యోనుల నుండి ఉత్పన్నమయ్యే దేహాల కన్నింటికి యోని అంటే ఉపాదాన కారణం, ఈ మహద్ బ్రహ్మ - త్రిగుణాత్మక ప్రకృతే. నేను బీజప్రదాతనైన జనకుణ్ని. నిమిత్త కారణాన్ని. సర్వ భూతోత్పత్తి పరమేశ్వరుని అధీనంలో ఉన్న ప్రకృతి పురుషుల నుండి కల్గుతుంటే, ప్రకృతి సంగమం వల్ల పురుషుడికి గల్గే సంసార విషయం వివరిస్తాను, విను.

మహాబాహో! సత్త్వము, రజము, తమము అనే త్రిగుణాలు ప్రకృతి నుండి సంభవించేవి. ఈ గుణాలే నిర్వికారమైన ఆత్మను శరీరంలో బంధిస్తున్నాయి.

అనఘా! ఈ మూడింటిలో సత్త్వగుణం నిర్మలమైంది. ఇది ఉపద్రవరహిత మయిన సుఖాన్ని అభివ్యక్తం చేస్తుంది. చైతన్యాన్ని కూడా ఆవిష్కరిస్తుంది. ఇది సుఖాసక్తి, జ్ఞానాసక్తుల వల్ల ఆత్మను శరీరంలో బంధిస్తున్నట్లు కనిపిస్తుంది.

కౌంతేయా! రజోగుణం, రాగాత్మకం, తృష్ణను పెంపొందింపజేస్తుంది. ఇది జీవుణ్ని అనేక కర్మల్లో అనురాగకలితుణ్ని కావించి, ఫలాశను ప్రేరేపిస్తూ ఆత్మను శరీరంలో బంధిస్తున్నట్లు గోచరిస్తుంది.

భారతా! తమోగుణం ఆవరణశక్తి ప్రధానమైన ప్రకృతి అంశం నుండి కల్గింది. ఇది దేహధారులకు మోహం పుట్టిస్తుంది. ఇది మరపు, మత్తు, సోమరితనం, నిద్ర మొదలైన వాటిచేత ఆత్మను శరీరంలో బంధిస్తున్నట్లు అనిపిస్తుంది.

అర్జునా! ఇంక వీటి విశేషం, సామర్థ్య మాలకించు. సత్త్వగుణం, దుఃఖశోకాదు లున్నప్పటికీ, జీవుడికి సుఖం చేకూరుస్తుంది. ఆవిధంగానే రజోగుణం కర్మాచరణకు ప్రేరేపిస్తుంది. ఇక తమోగుణం - సత్త్వరజోగుణాలు తిరస్కరించి, మహాత్ముల సన్నిధిలో సత్యోపదేశాన్ని మరుగుపరచి ప్రబలుతుంది.

మానవ దేహంలో కఫ వాత పిత్తాలకు సంగ్రామం జరుగుతున్నట్లుగానే, నిరంతరం ఈ గుణాలు ఒకదాన్ని వేరొకటి అతిక్రమించటానికి ప్రయత్నిస్తునే ఉంటాయి. జయించిన గుణం ముందుకు వచ్చి ప్రకాశిస్తుంది.

భారతా! సత్త్వగుణం, రజస్తమాల్ని ఆక్రమించి ప్రబలుతుంది. రజోగుణం, సత్త్వతమాల్ని తిరస్కరించి ప్రాధాన్యం వహిస్తుంది. అట్లాగే తమోగుణం, సత్త్వ తమోగుణాల్ని పరాభవించి పైకి వస్తుంది.

ఇంక ఈ గుణా లేరీతిగా అభివృద్ధిచెందుతాయో విను :

ఈ శరీరంలోని సమస్తేంద్రియ ద్వారాలు వాటిని ప్రకాశింపజేసే జ్ఞానరూపక మైన బుద్ధివృత్తి ప్రజ్వలిస్తే సత్త్వగుణం ప్రవృద్ధమౌతుంది.

భరతర్షభా! ధనం అనేక గతుల్లో లభిస్తున్నా, ఇంకా కావాలనే అభిలాషే - లోభం. నిరంతర కార్యోన్ముఖత్వం - ప్రవృత్తి. ఆ పని ముగించి, ఈ పని చేబట్టాలనే ఆరాటమే - అశాంతి. ఏ వస్తువైనా చూడగానే దాన్ని కోరటమే - స్పృహ. ఇవన్నీ రజోగుణాన్ని వృద్ధిపొందించేవి.

కురునందనా! అవివేకం, ప్రయత్నశూన్యత, కర్తవ్యం పట్ల ఔదాసీన్యం, మోహం అనేవి తమోగుణ వివృద్ధి కారణాలు.

సత్త్వగుణాభివృద్ధి చెందినప్పుడు మరణిస్తే, ఆ వ్యక్తికి ఉత్తమోపాసకులకు లభించే వినిర్మల సుఖభోగస్థానాలైన లోకాలు సంప్రాప్తిస్తాయి.

అదేవిధంగా, రజోగుణం ప్రబలంగా ఉన్నకాలంలో గతిస్తే ఆ వ్యక్తి కర్మసక్తమైన మనుష్యలోకంలో జన్మిస్తాడు. అట్లాగే తమోగుణం వృద్ధిచెందినప్పుడు చస్తే, ఆ వ్యక్తి పశ్వాది మూఢయోనుల్లో పుడతాడు.

అర్జునా! సాత్త్విక కర్మాచరణం వల్ల నిర్మలసుఖం సంప్రాప్తిస్తుంది. రాజసిక కర్మాచరణంవల్ల దుఃఖం సంప్రాప్తిస్తుంది. అదేవిధంగా తామసిక కర్మల వల్ల, అధర్మకృత్యాలవల్ల మోహం ప్రాప్తిస్తుంది.

సత్త్వగుణం నుండి సకలేంద్రియ జ్ఞానం జనిస్తుంది. అందుకే ప్రకాశబహుళమైన సుఖం దానివల్ల సంప్రాప్తం. రజోగుణం వల్ల లోభం కల్గుతుంది. ఇది దుఃఖ హేతువు. తమస్సు నుండి అవివేకం, కర్తవ్యంలో ఔదాసీన్యం, విమూఢత్వం కల్గుతాయి.

సాత్త్వికులు ఉన్నతబుద్ధికి స్థానమైన ఊర్ధ్వ, దేవలోకాలు చేరుతారు. రాజసికులు మధ్యలో ఉండే భూలోకంలో ఉంటారు. ఇది కర్మేంద్రియ స్థితి. నీచగుణయుక్తులైన తామసికులు, పాతాళాది నిమ్నలోకాలు చేరుకొంటారు. ఇది గుణసంగకృత సంసారం. దీనికి వ్యతిరేకమైన మోక్షం ఎలా ఉంటుందో విను.

ఎప్పుడు ద్రష్ట అయిన జీవుడు వివేకవంతుడై బుద్ధ్యాద్యాకారంగా పరిణమించిన గుణాల కంటె వేరుగా కర్తనైన నన్ను చూడడో; ఈ త్రిగుణ వ్యాపారాలకు అతీతుడైన సాక్షినిగా ఆత్మను సందర్శిస్తాడో అప్పు డతడు నా భావం పొందుతాడు.

దేహోత్పత్తికి కారణాలైన, దేహాద్యాకారంగా పరిణమించిన ఈ గుణత్రయాన్ని అతిక్రమించిన జీవుడు, జనన మరణ జరా దుఃఖాల నుండి విముక్తుడై అమృతత్వం పొందుతాడు.

### అర్జునుడు :

ప్రభూ! ఏయే లక్షణాలు గల మనుష్యు డీమూడు గుణాలకు అతీతుడై ఉండగల్గుతాడు? అతని ఆచరణం ఎలా ఉంటుంది? ఏ ఉపాయంతో ఇతడు వీటి నతిక్రమిస్తాడు?

### శ్రీకృష్ణభగవానుడు :

పాండవా! ప్రకాశమైన సత్త్వగుణ ధర్మం; రజోగుణధర్మమైన ప్రవృత్తి; తమోగుణ ధర్మమైన మోహం ఆవిర్భవించినా ఎవడు ద్వేషించడో; అవి నివృత్తమైనా ఎవడు

ఆకాంక్షింపడో అతడు గుణాతీతుడుగా పరిగణించాలి. గుణకార్యాల్లో తన కను కూలమైన వాటిని కాంక్షిస్తూ, ప్రతికూలమైన వాటిని నిరాకరించేవాడు సమ్యగ్దర్శి కాడు. వీటితో తన ఆత్మకేమీ సంపర్కం లేదని అనుకూల, ప్రతికూల బుద్ధులు ప్రదర్శించనివాడు ప్రవృత్తి నివృత్తులు కోరనివాడు సమ్యగ్దర్శి.

ఎవ డుదాసీనుని వలె ఆసీనుడై, గుణకార్యాలైన సుఖదుఃఖాలకు చలింప కుండా, స్వరూపప్రచ్యుతి పొందకుండా, గుణాలు తమ స్వకార్యంలో ప్రవర్తిల్లు తున్నాయని, వాటితో తనకేమీ పని లేదని, సంబంధంలేదనే వివేకజ్ఞానంతో తూష్ణీ భావంతో ఉండేవాడు గుణాతీతుడు.

ఎవడు సుఖదుఃఖాల్లో సమబుద్ధియో, ఎవడు ఆత్మస్వరూపస్థితుడో, ఎవడు శిలామృత్పిండసువర్ణాల్లో భేదం పరిగణించడో, లోకదృష్టిలో ప్రియాప్రియాలుగా పరిగణింపబడేవాటి నెవడు ఏకంగా భావిస్తాడో, ఎవడు నిందాస్తుతులు తుల్యం గానే స్వీకరిస్తాడో ఆ ధీరుడు గుణాతీతుడు.

ఎవడు మానావమానాల్లో సమానుడో, ఎవడు శత్రుమిత్ర పక్షాలనే వాటిని పరిగణింపడో, ఎవడు పుణ్యపాపము లొసగే సర్వకర్మలు పరిత్యజిస్తాడో అతడు గుణాతీతుడు.

ఎవడు నన్ను, సర్వభూత హృదయస్థుణ్నైన నారాయణుణ్ని, ఐకాంతిక భక్తి యోగంతో ఉపాసిస్తాడో అతడు, ఈ గుణాల్ని అతిక్రమించి, బ్రహ్మత్వానికి సమర్థు డౌతాడు.

నన్ను సేవిస్తే గుణాల నతిక్రమించే సామర్థ్యం ఎలా వస్తుందంటావా? విను. నేను బ్రహ్మమును. ఘనీభవించిన బ్రహ్మప్రతిమను. ఘనీభూత ప్రకాశమే సూర్య మండల మైనట్లుగా, నిత్యముక్తికి, తత్సాధనమైన సనాతన ధర్మానికి, తత్ఫలమైన అఖండ సుఖానికి నేనే ఆశ్రయుణ్ని. నన్నాశ్రయించిన భక్తులు నా అంతవారౌతారు. నేను నిర్వికల్పబ్రహ్మను. అమృతము, అవ్యయము, సోపాధికము, సగుణము అయిన సవికల్పక బ్రహ్మానికి ఆశ్రయుణ్ని. జ్ఞాననిష్ఠ అనే సనాతన ధర్మానికి, తత్ఫలమైన అఖండ సుఖానికి ఆశ్రయుణ్ని.

**అర్జునుడు :**

భవదధీనుడై ఆసక్తితో సేవిస్తే భవసాగరాన్ని నీ భక్తుడు అనాయాసంగా దాటగలడని ప్రబోధించిన ప్రభూత్తమా! నీకు మా ప్రభూత ప్రణామాలు.

**ఓం తత్ సత్**



# శ్రీకృష్ణార్జున సంవాద మనే
# వచన భగవద్గీతలో
# 15. పురుషోత్తమప్రాప్తి యోగం

అర్జునుడు :

పరమేశ్వరుణ్ని ఏకాంతభక్తితో ఉపాసించేవారికి తత్ప్రసాదలబ్ధ జ్ఞానంచేత బ్రహ్మభావం కల్గుతుందని వచించారు గదా! ఇది లభించాలంటే వైరాగ్యమెంతో కొంత ఉండాలి. భగవాన్! వైరాగ్యపూర్వక జ్ఞానాన్ని గూర్చి ఉపదేశించవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

శ్రీకృష్ణభగవానుడు :

వైరాగ్యప్రాప్తికి సంసారస్వరూపం బాగా తెలిసుకోవాలి. దీన్ని వృక్షంతో పోల్చి ఆలంకారికంగా చెప్తాను. ఆలకించు :

వేళ్లు పైన గలది, క్రింద కొమ్మలు గలది, అనాదియైన అశ్వత్థవృక్షం. వేద సమూహాలు దీని పర్ణాలు. ఈ సంసారవృక్షాన్ని సమూలంగా ఎవడు తెలిసికొంటాడో వాడు వేదవిజ్ఞుడు.

అర్జునుడు :

మరీ యింత సాంకేతికంగా సెలవిస్తే ఎలా అర్థమౌతుంది? కాస్త వివరించండి.

శ్రీకృష్ణభగవానుడు :

ఏముంది? సంసారమనే వృక్షానికి మూలం ఈశ్వరుడు. తదంశలైన బ్రహ్మాదులు శాఖలు. ఇది వినశ్వరం. కాని ప్రవాహరూపంలో నిత్యం ఈ వృక్షపత్ర స్థానీయాలు - వేద శాస్త్ర పురాణాలు. వేదవిహిత కర్మలచే ఇది సేవింపబడుతుంది. ఇది తెలిసినవాడు వేదజ్ఞుడు.

అర్జునుడు :

అశ్వత్థవృక్షంతోనే పోల్చటం దేనికి?

శ్రీకృష్ణభగవానుడు :

అశ్వత్థం అంటే రేపటి వరకు ఉంటుందని చెప్పటానికి వీలులేంది. అంటే క్షణికం. విశ్వాసానర్హం.

ఈ సంసారవృక్ష శాఖాసమూహం వారివారి భావనలకు, కర్మలకు ఫలిత మనదగిన జీవులు. జలసేచనం చేత శాఖలు వృద్ధిపొందే రీతిగా, గుణత్రయం చేత జీవులు పరిపుష్టు లౌతారు. విషయములే వీని చివుళ్లు. విషయపల్లవాలతో ఈ శాఖలు, ఊర్ధ్వాధోదేశాల్లో వ్యాపిస్తాయి. కాని మనుష్యలోకంలోనే ధర్మాధర్మ జనకములైన దీని మూలసమూహాలు క్రిందుగా పాదుకొని ఉంటాయి. అంటే కర్మఫల జనితాలు, ధర్మాధర్మ ప్రవృత్తులకు కారణాలయిన రాగద్వేషాది వాసనలు అవాంతర మూలములుగా గ్రహించాలి.

ఇహలోకంలో ఈ సంసారంలో ఉండే ప్రాణులు, ఈ సంసారరూపమైన అశ్వత్థ వృక్షస్వరూపం తెలుసుకోటం అసాధ్యం. ఎందుకంటే ఇది స్వప్నం వంటిది. ఎండమావుల లాగా నష్టస్వభావం కలది. దీనికి ఆది లేదు. అంతమూ లేదు. దీని స్థితి తెలుసుకోటం సాధ్యంకాదు. ఇది బద్ధమూలం కలది. పాతుకొన్న మొదళ్లు కలది. ఈ సంసారమనే అశ్వత్థాన్ని అనాసక్తి యనే దృఢశస్త్రంతో ఛేదించాలి. పుత్ర విత్త లోకేషణ త్యాగమే వైరాగ్యశస్త్రం. పరమాత్మాభిముఖ్యం ఎంత దృఢంగా ఉంటే, వైరాగ్యశస్త్ర మంత నిశితంగా ఉంటుంది. వివేక శమాదులు పునః పునః అభ్యసించటం చేత ఈ శస్త్రం బాగా నిశితమౌతుంది.

దేన్ని పొందితే తిరిగి ఈ సంసారానికి రామో, అటువంటి పరమపదం అన్వేషించాలి. ఎవని నుండి అనాదియైన ఈ సంసారప్రవాహం వినిర్గతమైందో, ఆ ఆదిపురుషుణ్ని శరణువేడుకోవాలి. ఎటువంటివారు ఈ పరమపదం చేరుకో గలరో, అనేక పర్యాయాలు వివరించాను. తిరిగి వివరిస్తాను. విను.

అభిమానావివేకాలు లేనివారు, సంగదోషం జయించినవారు, పరమాత్మ జ్ఞాన నిష్ఠులు, వినివృత్తకాములు, సుఖదుఃఖాది ద్వంద్వ విముక్తులు, అయిన జ్ఞానులు ఈ అన్వయ పరమపదం పొందగల్గుతారు.

గంతవ్యమైన ఆ పరమపదం ఎటువంటిదో అర్జునా! ఆలకించు. దేనిని పొందితే తిరిగి రారో; దేన్ని సూర్యచంద్రాగ్నులు కూడా ప్రకాశింపచేయలేవో; అదే నా పరమపదం.

నిజానికి నాదే అయిన పురాతనాంశమే జీవలోకంలో, కర్త, భోక్తగా ప్రసిద్ధికెక్కిన జీవుడుగా వ్యవహరింపబడుతున్నది. ఈ జీవుడే ప్రకృతిలో లీనమైన ఇంద్రియ పంచకాన్ని, మనస్సును, మరల సంసారోపభోగార్థం ఆకర్షిస్తున్నాడు. ఇది అవిద్వాంసుడైన జీవుని పని. కాని శుద్ధస్వరూపప్రాప్తి నందిన విద్వాంసుడు, బ్రహ్మపద ప్రాప్తే పునర్జన్మ నాశకం కాబట్టి తిరిగిరాడు.

వాయువు, పుష్పాదుల ఆధారకోశం నుండి గంధం అపహరించే రీతిగా, జీవుడు కర్మవశంచేత శరీరాంతరం పొందుతాడు. అప్పుడు పూర్వశరీరం నుండి మనస్సును, ఇంద్రియాల్ని తనవెంట తీసుకుపోతాడు. అంటే పూర్వదేహంలోని ఇంద్రియాలే నూతన శరీరంలోకి ప్రవేశిస్తున్నాయి.

ఈ దేహి చెవిని, కంటిని, చర్మాన్ని, నాలుకను, ముక్కును, మనస్సును ఆశ్రయించి శబ్దాన్ని, రూపాన్ని, స్పర్శను, రసాన్ని, గంధాన్ని అంటే విషయపంచకాన్ని మనస్సు సాహాయ్యంతో అనుభవిస్తాను.

**అర్జునుడు :**

అయితే భగవాన్! శరీరవ్యతిరిక్తుడయిన జీవుణ్ని అందరూ ఎందుకని చూడలేక పోతున్నారు?

**శ్రీకృష్ణభగవానుడు :**

దేహాంతరంలోకి ప్రవేశించేవాడు, శరీరంలో సుస్థితుడు, విషయభోగరతుడు, త్రిగుణ పరిణామాలయిన సుఖదుఃఖ వ్యామోహమగ్నుడు అయిన జీవాత్మను విమూఢచిత్తులు సందర్శించలేరు. జ్ఞానచక్షువులు మాత్రమే సందర్శించగలరు. ఆత్మానాత్మ వివేకం అనే సాధన సంపత్తి గల ముముక్షువులు మాత్రం చూడగలరు. వీరి మనస్సు విషయాకర్షణం వల్ల బహిర్ముఖం కాదు. వీరంతర్ముఖులు.

సమాహితచిత్తులయిన యోగులు ఈ ఆత్మను, స్వీయబుద్ధిలో సాక్షిరూపమైన దానినిగా చూడగల్గుతున్నారు. శాస్త్రాదు లెంతగా అభ్యసించినా అవిశుద్ధచిత్తులు, మందమతులు, ఈ ఆత్మను సందర్శింపలేరు.

జీవుని లక్షణాలు వివరించాను గదా! ఇక పరమేశ్వరుణ్ణైన నా అనంత లక్షణాలు తిరిగి వివరిస్తాను. విను. ఇవి అంతగా గ్రహించటానికి సాధ్యమయ్యేవి కావు. అందుచేత ఎప్పటికప్పుడు నీకు వివరిస్తుంటాను.

సూర్యునిలో ఉండే ఏ తేజస్సు అఖిల జగత్తును ప్రకాశింపజేస్తుందో; చంద్రునిలో ఉండే కాంతి యేదో; అగ్నిలో ఏ ప్రభ వెలుగొందుతున్నదో ఆ తేజఃకాంతిప్రభలు నావిగా తెలుసుకో.

నేను ఓజస్సు చేత పృథివిలోకి ప్రవేశించి, చరాచర భూతకోటిని ధరిస్తాను. ఇంకా నేను రసస్వరూపుడైన చంద్రుణ్నై పంటనిచ్చి యెండిపోయే ఓషధుల్ని పోషిస్తాను.

నేను వైశ్వానర నామ జఠరాగ్నిని. జీవుల దేహా లాశ్రయించి ప్రాణాపాన వాయువులతో కూడి, భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్యాలనే నాల్గు రకాలైన అన్నాన్ని పరిపక్వం గావిస్తాను.

నేను పిపీలిక బ్రహ్మపర్యంతంగా గల ప్రాణులందరి హృదయాల్లో అంతర్యామిరూపంలో ప్రవిష్టుణ్ని. సర్వకర్మాధ్యక్షుణ్నైన నానుండే, ఈ జన్మకు, పూర్వజన్మకు సంబంధించిన స్మృతి, దేశకాలాలవల్ల వ్యవహితము, అవ్యవహితము నైన వస్తువుల గూర్చిన జ్ఞానం, ఈ రెంటి విస్మృతి కలుగుతున్నాయి. నాల్గు వేదాల వల్ల ఆయా దేవతారూపాల్లో తెలియదగినవాణ్ని నేనే. వేదాంత సంప్రదాయ ప్రవర్తకుణ్ని నేనే. వేదార్థవేత్తను గూడా నేనే అని గ్రహించు.

విశిష్టోపాధికృతమైన నా విభూతి సంక్షిప్తంగా వర్ణించాను. ఇక క్షరాక్షరోపాధి విభాగం కావించి, తదతీత నిరుపాధిస్వరూపం కూడా అర్జున! వివరిస్తాను.

### అర్జునుడు :

అవశ్యం. మీ కృపకు నన్ను పాత్రుణ్ని కావిస్తున్నారు.

### శ్రీకృష్ణభగవానుడు :

క్షరుడని, అక్షరుడని ఇరువురు పురుషులే జగత్తులో ప్రసిద్ధులు. బ్రహ్మాది స్థావరాంతరాలైన జడశరీరాలు, వినాశశీలమైన వికారజాతమంతా క్షరపురుషుడు. అక్షరు డంటే అవినాశియైన పురుషుడు. ఇతడు కూటస్థుడు. మాయా వంచన రూపంలో స్థితుడు. ఇతడు నిర్వికారుడైన చేతన భోక్త. క్షరపురుషుని ఉత్పత్తికి బీజం. సంసారబీజం అనంతం కావటంచేత అక్షరసంజ్ఞ.

క్షరాక్షరాలకు వేరుగా ఉండే ఉత్తమ పురుషుడు ఒకడున్నాడు. అతడే పురుషోత్తముడు. అతడే చేతనుడైన జీవుని కంటే పరుడు కాబట్టి పరమాత్మ

అనబడుతున్నాడు. అత డవ్యయుడు, ఈశ్వరుడు, భూర్భువస్సువర్లోకాలతో కూడిన విశ్వాన్నంతా తన మాయాశక్తి చేత ఆవేశించి తన స్వరూప సత్త ననుగ్రహిస్తూ పరిపాలిస్తున్నాడు.

క్షరమయిన అశ్వత్థ మనబడే సంసార మాయావృక్షాని కతీతుణ్ని కాబట్టి, అక్షర మనబడే సంసారబీజభూతమైన శక్తి కంటే కూడా ఉత్తముణ్ని కావటం చేత, వేదాలు, లోకాలు కూడా నన్ను పురుషోత్తముడుగా పరిగణిస్తాయి.

భారతా! ఎవడు స్థూల సూక్ష్మ కారణ శరీరాభిమానరహితుడై పురుషోత్తముణ్నైన నన్ను ఆత్మరూపంలో తెలుసుకొంటాడో అతడు నాయందనురక్తుడై సర్వాత్మనా నన్నే భజిస్తుణ్నవాడౌతాడు. పిదప సర్వజ్ఞుడు కూడా కాగలడు.

అనఘా! ఈ గుహ్యతమ శాస్త్రం నాచేత చెప్పబడింది. భారతా! నీవీ తత్త్వం బ్రహ్మబుద్ధితో తెలుసుకొని బుద్ధిమంతుడవు కా. కృతకృత్యుడవు కావాలని ఆ ఆకాంక్ష.

**అర్జునుడు :**

భగవాన్! సంసారవృక్షాన్ని ఛేదించి, పరమపదాన్ని గూర్చి, నీ పురుషోత్తమత్వాన్ని గూర్చి విశదీకరించిన పురుషోత్తమా! నీ కివే నా ధన్యవాదాలు.

* * *

ఈ మహోదాత్త సంవాద మెవడు వినిన<br>
శ్రద్ధ చదివిన ఆత్మవిజ్ఞాని యగును;<br>
ఆ పరాత్పరుని యనుగ్రహమ్ము పొందు<br>
కాంతిపథమున పయనింపగలడు నరుడు!

ఓం తత్ సత్



## శ్రీకృష్ణార్జున సంవాద మనే

## వచన భగవద్గీతలో

# 16. దైవాసుర సంపద్విభాగ యోగం

అర్జునుడు :

భగవాన్! ఆసురీసంపద విడిచిపెట్టి, దైవీసంపద గ్రహించే వారికి ముక్తి సంప్రాప్తిస్తుం దంటారు గదా! అటువంటి దైవీసంపద స్వరూప మభివర్ణించ వలసిందిగా అర్థిస్తున్నాను.

శ్రీకృష్ణభగవానుడు :

భయరాహిత్యం, ఆలోచించేది, చెప్పేది, చేసేది ఒకటిగా ఉండటం - దీన్నే భావశుద్ధి లేక త్రికరణశుద్ధి అంటారు; జ్ఞాన నిష్ఠ - ఆచార్యోపదేశానుసారం బ్రహ్మాత్మాదుల నెరిగే జ్ఞానంతో నెలకొన్న వ్యవస్థితి; యోగనిష్ఠ - ఇంద్రియ సంయమం, ఏకాగ్రతతో గ్రహించిన వస్తువు సాక్షాత్కారమొనర్చుకొనే ప్రయత్నం, దానం, దమం - బాహ్యేంద్రియ నిగ్రహం; యజ్ఞం - అధికారాన్ననుసరించి దర్శ పూర్ణమాసాది యజ్ఞాచరణ; స్వాధ్యాయ మనే బ్రహ్మయజ్ఞం; తపస్సు, ఆర్జవం - ఋజుప్రవర్తనం; అహింస, సత్యం, అక్రోధం, త్యాగం, శాంతి, అపైశునం-ఇతరుల దోషాలు వెల్లడిచేయకపోవటం; భూతదయ, అలోలుప్త్వం - విషయాలెదుటనున్నా చలించకపోవటం; మార్దవం, హ్రీః - కుకార్య కుచింతల పట్ల సిగ్గు; అచాపలం - వ్యర్థకార్యాచరణం పట్ల బుద్ధి చలింపకపోవటం; ప్రతిభ, క్షమ, ధృతి, శుచి, అద్రోహం, అతిమానిత - తా నధికపూజ్యుణ్ని భావించకపోవట మనే లక్షణాలు ఓ భారతా! దేవీసంపద పొందే యోగ్యతతో జన్మించినవారిలో ఉంటాయని గ్రహించు.

ఇన్ని లక్షణాలెట్లా గుర్తుంటాయనా? అలా చూస్తున్నావు? మూడు లక్షణాలు ముచ్చటగా చెప్తాను గుర్తుంచుకో - అభయం, సత్త్వసంశుద్ధి, జ్ఞానయోగ వ్యవస్థితి.

అయితే అర్జునా! ఆసురీ లక్షణాలు సంక్షిప్తంగా చెప్తాను విను -

దంభం - కపటధర్మాచరణం

దర్పం - విద్యా ధన జన నిమిత్త గర్వం

అభిమానం - అతిపూజ్యత్వాభిమానం, అహంకారం, క్రోధం, పారుష్యం

అజ్ఞానం - కర్తవ్యాకర్తవ్యం, అవివేకం

పాండవా! దేవీయోగ్యమైన సాత్త్వికసంపద విముక్తిహేతువుగాను; ఆసురీసంపద బంధహేతువుగాను చెప్తారు. అర్జునా! విచారింపకు. నీవు దైవీసంపద్యోగ్యుడుగానే జన్మించావు.

**అర్జునుడు :**

ఆసుర సంపద సర్వాత్మనా వర్జింపదగింది కదా! మీరు నన్ను దైవీసంపదకు తగినవాణ్ణిగా నిర్ణయించినా ఆ లక్షణాలు కూడా భగవాన్! వివరించవలసిందిగా అర్థిస్తున్నాను. నరుడు సదా వాటిపట్ల అప్రమత్తుడుగా సంచరించాలిగదా!

**శ్రీకృష్ణభగవానుడు :**

సత్యం వచించావు. ఈ ప్రశ్నే నీ యోగ్యతను చెప్పక చెప్తున్నది. ఈ జగత్తులో దైవీస్వభావ సంపన్నులు, ఆసురీ స్వభావయుక్తులు అని రెండు విధాలుగా మనుష్యు లుంటారు. దైవీస్వభావ సంపన్నుల విషయం విశదపరచాను. నీవు కోరినట్లుగా ఆసురీస్వభావయుక్తుల్ని గూర్చి చెప్తాను, విను.

అసురస్వభావం గలవారికి ధర్మప్రవృత్తి, అధర్మనివృత్తి ఉండదు. వారికి శౌచ సదాచార సత్యసంపద లుండవు.

వారీజగత్తును అసత్యంగాను - అంటే వేదపురాణేతిహాస ప్రమాణశూన్యంగాను; ప్రతిష్ఠారహితంగాను - అంటే ధర్మాధర్మ వ్యవస్థాశూన్యంగాను; అనీశ్వరంగాను - అంటే కర్త, ఫలదాత అయిన ఈశ్వరుడు లేడని, కామవశంగా స్త్రీపురుష సంయోగం వల్లనే ఉత్పత్తి జరుగుతుందని భావిస్తారు.

ఇటువంటి దృష్టి ననుసరించి, సాధనచ్యుతులు, ఉగ్రకర్ములు, అహితులు, అల్పబుద్ధులు అయినవారు జగతి క్షయానికే ప్రభవిస్తారు.

దంభాభిమానమదయుక్తులై, అపరిమితకామాశ్రయులై, మోహాతిరేకంతో ఏవో మంత్రతంత్రాలతో ఆయా దేవతారాధనలు కావిస్తూ, మహానిధులు పొందాలనే అశుభ నిశ్చయాలతో , అశుచి వ్రతాలతో ప్రవర్తిల్లుతారు.

వారు చచ్చేవరకు అంతుపొంతులేని చింతతో కామోపభోగపరాయణులై అదే పరమపురుషార్థమనీ, చైతన్య విశిష్టమైన కాయమే పురుషుడని నమ్ముతారు.

ఆశాపాశపరశ్శతబద్ధులై కామక్రోధాధీనులై కామభోగార్థం, చౌర్యాదిగా గల అసదుపాయా లవలంబించి అర్థసంచయం కూడబెట్టటాని కుద్యమిస్తారు.

"నే డిది నాకు లభించింది. ఈ మనోరథం ఇంకముందు చేకూరుతుంది. ఈ ధనం నా కున్నది. ఇంకముందు కూడా ఇంత ధనం వస్తుంది.

ఈ శత్రువు నాచే హతుడు. మిగిలిన వారిని కూడా హతమార్చగలను. నేను భోగిని, నేను ఈశ్వరుణ్ని. పురుషార్థసంపన్నుణ్ని. బలవంతుణ్ని. సుఖిని.

నేను ధనాఢ్యుణ్ని. సత్కులసంజాతుణ్ని. నాకు సమాను డెవ్వడు? నేను యజ్ఞం చేస్తాను. దానా లిస్తాను. ఆనందిస్తాను" అంటూ అజ్ఞాన విమోహితులై అనేక చిత్త విభ్రాంతులతో మోహజాల సమావృతులై కామభోగ ప్రసక్తులై వారు మలిన నరకంలో పడతారు.

వారు ఆత్మశ్లాఘ సంసక్త చిత్తులు. వినయ విహీనులు. ధన మాన మదాన్వితులు. వారు అసురపురుషులు. దంభప్రవృత్తితో శాస్త్రవిధు లుల్లంఘించి నామమాత్రంగా యజ్ఞాలు నిర్వహిస్తారు.

వారు సర్వానర్థ దోషాలకు మూలమైన అహంకారం
పరపీడాకరమైన బలం
ధర్మోల్లంఘన కారణమైన దర్పం
స్త్రీ విషయమైన రతి
ఇచ్ఛాప్రతిహతోద్భూత క్రోధం

ఆశ్రయించి, స్వదేహంలోను, పరదేహంలోను ఉన్న నన్ను, ఈశ్వరుణ్ణి ద్వేషిస్తారు. నా శాసన మతిక్రమిస్తారు. సన్మార్గవర్తుల సద్గుణాలిని నిందిస్తారు.

విద్వేషులు, క్రూరులు, నరాధములు, అశుభవర్తులు అయిన వీరిని జన్మ జన్మల్లో ఆసురయోనుల్లోనే అజస్రం ఉంచుతాను.

కౌంతేయా! మూఢులు ప్రతి జన్మలోను ఆసురశరీరం పొందుతూ, నన్ను పొందక, సన్మార్గ విముఖులై క్రమంగా అధోగతిపాలై క్రిమికీటకాది జన్మలు పొందుతారు.

నరకానికి ద్వారాలు మూడు. అవే కామం, క్రోధం, లోభ మనేవి. కాబట్టి జీవుణ్ని అధోగతిదాయకమైన నాశనానికి దారితీసే ఈ మూడింటిని త్యజించాలి.

ఈ నరకద్వారాలు వెలువడ్డ మనుష్యుడు స్వీయ కళ్యాణసాధనాల ద్వారా తపోయోగాది కర్మ లాచరించి తత్ఫలితమైన మోక్షం చేరుకొంటాడు.

ఎవడు కర్తవ్యాకర్తవ్యా లుపదేశించే విధినిషేధా లుల్లంఘించి యథేచ్ఛాసంచారి యౌతాడో వాడు పురుషార్థాన్ని పొందటానికి కూడా యోగ్యుడు కాడు. ఐహిక సుఖశాంతు లనుభవించలేడు. ఉత్తమగతియైన మోక్షం పొందలేడు.

కాబట్టి అర్జునా! కార్యాకార్య విషయ నిర్ణయంలో శాస్త్రమే నీ కత్యంత ప్రమాణం. శాస్త్ర మంటే వేదమూలకాలు, వేదానుగతాలు, స్మృతి, పురాణేతిహాస తంత్రాదులు. కనుక, ఈ లోకంలో శాస్త్రవిధానోక్త విధినిషేధ పరిజ్ఞానంతో కర్మాధి కారివి కావటానికే ఈ నా ప్రబోధం.

**అర్జునుడు :**

దైవాసుర సంపద్విభాగం వల్ల సాత్త్వికునకే తత్త్వజ్ఞానాధికారమనే సత్యం ప్రదర్శించిన పరమాత్మా! నీకు నా ప్రణామాలు.

* * *

ఈ మహోదాత్త సంవాద మెవడు వినిన
శ్రద్ధ చదివిన ఆత్మవిజ్ఞాని యగును;
ఆ పరాత్పరుని యనుగ్రహమ్ము పొందు
కాంతిపథమున పయనింపగలడు నరుడు!

**ఓం తత్ సత్**



## శ్రీకృష్ణార్జున సంవాద మనే

## వచన భగవద్గీతలో

# 17. శ్రద్ధా త్రయ విభాగ యోగం

### అర్జునుడు :

జ్ఞానాధికారికి శాస్త్రప్రమాణంపట్ల విశ్వాసం చాలా ముఖ్యం. అది ముఖ్య శ్రద్ధ అయితే గౌణశ్రద్ధలు కూడా కొన్ని ఉంటాయి గదా! వాటిని కూడా వివరించ మని వేడుకొంటున్నాను.

'శాస్త్రవిధి నుల్లంఘించే కామచారికి తత్త్వజ్ఞానాధికారం లేద'న్నారు గదా! కాని యధేచ్ఛా సంచారి కాక శ్రద్ధాయుక్తుడగు వాని కధికార మున్నదీ లేందీ తెలుసు కోవాలని ఉంది. భగవాన్! శాస్త్రనిర్దిష్టాలైన విధినిషేధాలు కష్టతరములుగా తలపోసి కానీ, ఔదాసీన్యం వహించిగానీ తెలుసుకోటానికి తగినరీతిగా ప్రయత్నించకుండా, ఆస్తిక్యబుద్ధితో ప్రాచీనుల ఆచార సంప్రదాయాలు, పరంపరానుగతంగా వచ్చే వాటిని అనుసరిస్తూ దేవతల్ని ఆరాధించేవారి ప్రవృత్తి యెటువంటిది? సత్త్వికమా? రాజసికమా? తామసికమా? నిర్ణయించి తెల్ప ప్రార్థన.

### శ్రీకృష్ణభగవానుడు :

అర్జునా! మనుష్యులకు దేవపూజా విషయక శ్రద్ధ - సాత్త్వికం. యక్షరాక్షస పూజా విషయకమైన శ్రద్ధ - రాజసికం. భూతప్రేత పూజా విషయకమైన శ్రద్ధ - తామసికం. ఈ త్రివిధ శ్రద్ధలు పూర్వజన్మకృత ధర్మాధర్మ సంస్కారా న్ననుసరించి కల్గుతాయి.

భారతా! మానవు లందరి శ్రద్ధ, విశిష్ట సంస్కారయుక్తమైన అంతఃకరణాను గుణంగా కల్గుతుంది. ఈ జీవుడు శ్రద్ధామయుడు. అతని శ్రద్ధ ననుసరించే అతడు గ్రహించే నిష్ఠ ఉంటుంది.

సాత్త్వికులు దేవతల్ని, రాజసికులు యక్షరాక్షసుల్ని, తామసికులు భూతప్రేత పిశాచాల్ని పూజిస్తారు. పూజాభిరుచి ననుసరించే పూజించేవారి స్వభావం తెలుసుకోవచ్చు.

దంభాహంకార సంయుక్తులు, కామరాగబలాన్వితులు అయిన ఏ అవివేక జనులు, శరీరంలోని ఇంద్రియ సమూహాన్ని, బుద్ధికి సాక్షిగా ఉండే ఆత్మ స్వరూపుణ్ణైన నన్ను వ్యర్థోపవాసాదులచేత కష్టపెడుతూ, అశాస్త్రవిహితంగా ఘోర తపస్సు ననుష్ఠిస్తారో వారు, ఆసురస్వభావులని తెలుసుకో.

ఆహారం కూడా ఈ త్రివిధ జనాళికి, త్రివిధాలుగా ప్రియం. అదేవిధంగా యజ్ఞ దాన తపస్సులు కూడా మూడువిధాలుగానే ఉంటాయి. వాని ప్రభేదం విను.

ఆయువు, ఉత్సాహం, శక్తి, ఆరోగ్యం, చిత్తప్రసాదం, సంతోషం విశేషంగా వృద్ధిగావించే రసవంతాలు, స్నేహయుక్తాలు, పుష్టిమంతాలు, మనోహరాలు అయిన భక్ష్యభోజ్యాలు సాత్త్వికులకు ఇష్టం.

మిక్కిలి చేదు, పులుపు, ఉప్పు, వేడి, కారంగా ఉండేవి; బాగా ఎండిపోయినవి, కడుపులో మంటపుట్టించే ఆహారపదార్థాలు రాజసికులకు ప్రియం చేకూరుస్తాయి. ఇవి రోగకారకాలు.

జాముకాలం నిల్వ ఉండటంచేత చల్లబడిపోయినవి, రసహీనమై పిప్పిగా ఉండేవి, పాచిపోయి దుర్గంధపూరితమైనవి, చద్దివి, ఎంగిలిపడ్డవి, నిషిద్ధాలైన ఆహారం తామసులకు ప్రీతిదాయకం.

ఈవిధంగానే త్రివిధ యజ్ఞా లున్నాయి. ఫలకాంక్షావిరహితంగా, యజ్ఞాను ష్ఠానమే కర్తవ్యంగా నిశ్చయించుకొని, శాస్త్రోక్తంగా నిర్వహింపబడే యజ్ఞాలు సాత్త్విక మైనవి.

భరతశ్రేష్ఠా! స్వర్గాది ఫలం అపేక్షిస్తూ దంభబుద్ధితో చేయబడే యజ్ఞం రాజసం.

విధివిహీనం, అన్నదాన రహితం, మంత్రవర్జితం, దక్షిణలుప్తం, శ్రద్ధావిరహితం అయిన యజ్ఞం తామసికతం.

తపస్సులో ఉండే భేదాలు వివరిస్తాను. విను. దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనము, శౌచము, ఆర్జవము, బ్రహ్మచర్యము, అహింస అనేవి శారీరక తపస్సుగా పేర్కొన తగినవి.

అనుద్వేగకరము, సత్యము, ప్రియము, హితకరము అయిన వాక్కు; స్వశాఖా వేదాధ్యయనము, శాస్త్రాభ్యాసము వాఙ్మయ తపస్సుగా పరిగణించాలి.

మనఃప్రసాదం, సౌమ్యం, మౌనం, మనోనిగ్రహం, భావసంశుద్ధి అనేవి మానసిక తపస్సుగా చెప్తారు.

ఫలాకాంక్షారహితంగా, ఏకాగ్రచిత్తులైనవారు పరమశ్రద్ధతో మనోవాక్కాయ సంబంధమైన తపస్సు ఆచరిస్తే అది సాత్త్విక తపస్సు అనిపించుకొంటుంది.

ఇతరులచేత సత్కరింపబడాలనో, గౌరవింపబడాలనో, పూజింపబడాలనో, ధనాధిక మార్జించాలనో ఆకాంక్షతో, దంభంతో అనుష్ఠింపబడే రాజసిక తపస్సు అంటారు. ఇది అనిత్యం, క్షణికం.

మూఢమైన ఆగ్రహంతో, దురాకాంక్షతో, దేహేంద్రియాల్ని బాధపెడుతూ ఇతరుల వినాశానికి కావించే తపస్సు తామసికం.

ఈవిధంగానే దానభేదాలు కూడా వివరిస్తాను. విను. తీర్థాది యోగ్యస్థానాల్లో, ఆయా పుణ్యకాలాల్లో, విద్యా తపస్సంపన్నులైన బ్రాహ్మణోత్తములకు దానం చేయటం కర్తవ్యమనే భావంతో, ప్రత్యుపకార మాశించకుండా ఏ దానం చేయ బడుతుందో, ఆ దానం, సాత్త్వికంగా పేర్కొనతగింది.

అట్లా కాకుండా, ప్రత్యుపకారార్థమో లేక ఆముష్మిక ఫలాకాంక్షతోనో, అనిచ్ఛ తోనో చేసే దానం రాజసిక మనిపించుకొంటుంది.

అపవిత్ర స్థలాల్లో, అశౌచాది స్థితుల్లో, అయోగ్యులైన విటనటాదులకు, పాద ప్రక్షాళన, ప్రియవచనాది సత్కారశూన్యంగా, తిరస్కారభావంతో చేసే దానం తామసికం.

అర్జునా! సామాన్యంగా క్రియాకలాప మంతా రజస్తమోమయం. దీన్ని సాత్త్వికం చేయాలంటే 'ఓం తత్ సత్' అనే నిర్దేశం పాటించాలి. ఇవి బ్రహ్మకు మూడు నామాలు. వీని వల్ల బ్రాహ్మణులు, వేదాలు, యజ్ఞాలు ప్రాచీనకాలంలో నిర్మింప బడ్డాయి. కాబట్టి ఈ నిర్దేశం చాలా ప్రశస్తం.

ముందుగా ఓంకార మాహాత్మ్యం తెలుపుతాను, విను. 'ఓం' అనటం చేత ఉచ్చరించి, బ్రహ్మవాదుల శాస్త్రవిహిత యజ్ఞ దాన తపఃక్రియలు అనుష్ఠింప బడుతున్నాయి.

'తత్' అనే బ్రహ్మవాచక ముచ్చరించి ఫలమాశించకుండా ముముక్షువులు నిష్కాములై యజ్ఞ దాన తపః క్రియలు నిర్వహిస్తారు. చిత్తశుద్ధి ముముక్షుత్వం ప్రసాదించేది కాబట్టి తత్ శబ్ద నిర్దేశం ప్రశస్తి వహించింది.

పార్థా! సత్త అనే అర్థమే కాక, సాధువు అనే అర్థం కూడా కల 'సత్' శబ్దం, సర్వ శుభకర్మల్లో ప్రయోగింపబడుతుంది.

యజ్ఞము, తపము, దానము అనే మూడింటికి సంబంధించిన నిష్ఠ కూడా సత్ శబ్దంతోనే నిర్దేశం. ఈశ్వర ప్రీత్యర్థం కావింపబడే కర్మలు సర్వం 'సత్' గానే పేర్కొనబడుతున్నాయి. కాబట్టి ఇటువంటి మహిమోపేత శబ్దత్రయంతో ప్రకాశించే 'ఓం తత్సత్' అనే వాక్య మహిమ వర్ణనాతీతం.

పార్థా! అశ్రద్ధతో అనుష్ఠింపబడ్డ యజ్ఞం, ఇయ్యబడిన దానం, చేయబడ్డ తపస్సు, ఇంకా ఏ క్రియాకలాపమైనా అదంతా 'అసత్తు'గా పేర్కొనక తప్పదు. ఇది ఇహపర లోకాల్లో నిష్ఫలం. ఇప్పుడు నీవీ యుద్ధం 'ఓం తత్ సత్' అని శ్రద్ధగా ఉచ్చరిస్తూ చేస్తే 'సత్'గా ప్రకాశిస్తుంది. అశ్రద్ధగా చేస్తే నిష్ఫలమౌతుంది. అందుకే ఇంతగా వివరించి చెప్తున్నాను.

**అర్జునుడు :**

రజస్తమోమయ శ్రద్ధలు త్యజించి, సాత్త్విక శ్రద్ధాశ్రితుడైన నరుడు తత్త్వజ్ఞానాధి కారి అవుతాడని ఎంతో శ్రద్ధతో నా కుపదేశించిన గురుదేవా! నీకు నా ప్రణామాలు.

* * *

ఈ మహోదాత్త సంవాద మెవడు వినిన
శ్రద్ధ చదివిన ఆత్మవిజ్ఞాని యగును;
ఆ పరాత్పరుని యనుగ్రహమ్ము పొందు
కాంతిపథమున పయనింపగలడు నరుడు!

**ఓం తత్ సత్**



శ్రీకృష్ణార్జున సంవాద మనే

వచన భగవద్గీతలో

# 18. మోక్ష సన్న్యాస యోగం

**అర్జునుడు :**

భగవాన్! మీ ప్రబోధం నెమరువేసుకొంటె, ఏదో పరస్పర విరోధ మున్నట్లు నా అల్పబుద్ధికి గోచరిస్తుంది.

ఒక పర్యాయం మీరు 'జితేంద్రియుడైన వ్యక్తి కర్మలన్నీ వివేకబుద్ధితో త్యజించి, సుఖంగా ఉంటా' డన్నారు. ఇంకో సందర్భంలో 'సన్న్యాసయోగయుక్తుడవై విముక్తి నంది నన్ను పొంద'మన్నారు. ఈవిధంగా కర్మసన్న్యాస ముపదేశించారు. బాగుంది. కానీ 'కర్మఫలత్యాగి కర్మప్రవృత్తుడైనా ఏమీ చేయనివాడే అవుతాడ'ని; 'ఇంద్రియ నిగ్రహంతో సర్వకర్మఫలత్యాగం కావించమ'ని; ఫలత్యాగపూర్వకంగా కర్మానుష్ఠాన ముపదేశించారు. పరస్పర విరుద్ధోపదేశాలు సర్వజ్ఞుడైన భగవంతు డుపదేశింపడు గదా! కాబట్టి మహాబాహో! హృషీకేశా! కేశినిషూదనా! కర్మసన్న్యాస, కర్మఫలత్యాగాల యాథార్థ్యం వేరువేరుగా విదితం చేయవలసిందిగా వేడుకొంటున్నాను.

**శ్రీకృష్ణభగవానుడు :**

అర్జునా! స్వర్గాదిఫలా లాశించి చేసే కామ్యకర్మల పరిత్యాగమే పండితులు 'సన్న్యాస'మంటారు. అనుష్ఠేయాలైన నిత్యనైమిత్తిక సమస్త కర్మల ఫల సన్న్యాసాన్ని జ్ఞానులు 'త్యాగ'మంటారు. నిత్యనైమిత్తిక కర్మలకు ఫలం లేదనుకోటం భావ్యం కాదు.

**అర్జునుడు :**

ఫలత్యాగం చేస్తే కర్మలు నిష్ఫలమౌతాయి కదా! అటువంటి పరిస్థితిలో ఎవడు కర్మ లాచరించటాని కుద్యుక్తుడౌతాడు?

**శ్రీకృష్ణభగవానుడు :**

ఈ నిత్యనైమిత్తక కర్మలు చిత్తశుద్ధి కోసం, తత్త్వజ్ఞానేచ్ఛ కోసం చేయాలి. తత్త్వజ్ఞానం లభిస్తే కర్మలు వానంతటవే నివృత్తమౌతాయి. వర్షాంతమేఘాలు లాగా లయమౌతాయి. కర్మలకు మూలమైన సంకల్ప మెప్పుడైతే తొలగిపోతుందో, అప్పుడు కర్మలే నిన్ను త్యజిస్తాయి. ఇంకా చెప్పాలంటే వైరాగ్యం కల్గనంతవరకే, భగవత్కథాశ్రవణ ప్రవణత్వం లభించనంత వరకే కర్మాచరణం. జ్ఞాననిష్ఠులు, విరక్తులు, అనపేక్షులు, భక్తులు, సంసారం త్యజించి, విధి కతీతంగా కూడా మసలగలరు. వారు విధిపరతంత్రులు కారు. కాబట్టి పార్థా! అజ్ఞానికే ఫలత్యాగ రూపమైన కర్మోపదేశం. ఇదే త్యాగం. కర్మత్యాగం త్యాగం కాదు. ఇంకా విను.

సాంఖ్యవాదులు కర్మే బంధకారణం కాబట్టి కర్మలు పరిత్యజించాలంటారు. కాని మీమాంసకులు యజ్ఞ దాన తపోరూప కర్మ త్యజించకూడ దంటారు.

అయితే ఓ భరతసత్తమా! ఆ త్యాగ విషయంలో నా సిద్ధాంత మాలకించు. పురుషవ్యాఘ్రా! త్యాగం, సత్త్వాది గుణభేదం చేత త్రివిధంగా పేర్కొన్నాను గదా! ఇప్పుడే చెప్పినట్లు యజ్ఞ దాన తపోరూపమైన సాత్త్విక కర్మ త్యజించకూడదు. ఎందుకంటే పార్థా! ఫలాకాంక్ష లేక బుద్ధిమంతు లీ కర్మలు చిత్తశుద్ధికోసం ఆచరించాలి.

తిరిగి చెప్తున్నాను - విను. కర్తృత్వాభిమానం, ఫలాభిసంధి విడిచిపెట్టి ఈ యజ్ఞ దాన తపః కర్మలు, ఈశ్వరారాధన బుద్ధితో ఆచరించి తీరాలనే నా సిద్ధాంతం. ఇదే ఉత్తమాభిప్రాయం కూడా.

అంతేకాదు. నిత్యకర్మల సన్న్యాసం యుక్తియుక్తం కాదు. అవివేకం వల్ల వీటిని త్యజిస్తే అది తామసపరిత్యాగ మౌతుంది.

ఎవడైనా కాయక్లేశ భయం వల్ల నిత్యకర్మలు దుఃఖప్రదమని తలపోసి త్యజిస్తే ఆ త్యాగం రాజస మనిపించుకొంటుంది. ఇటువంటి రాజసిక త్యాగి, త్యాగ ఫలమైన జ్ఞాననిష్ఠ పొందలేడు.

అర్జునా! ఆసక్తి, ఫలకాంక్ష విడనాడి కర్తవ్యబుద్ధితో ఏ నియతకర్మ అనుష్ఠింప బడుతుందో అది సాత్త్వికత్యాగ మనిపించుకొంటుంది.

సత్త్వగుణ సమావిష్టుడు, ఛిన్న సంశయుడు, ఆత్మజ్ఞాని, ఆసక్తిఫలత్యాగి అయిన సాత్త్వికత్యాగి అశుభకామ్యకర్మను ద్వేషించడు. శుభము, కుశలము

అయిన నిత్య కర్మానుష్ఠానానికి ఆసక్తుడు కాడు. నైష్కర్మ్యలక్షణమైన జ్ఞాననిష్ఠలో ఉంటాడు. ఇతఃపూర్వం నేను చెప్పిన కర్మయోగ ఫల మిదే!

సర్వకర్మ పరిత్యాగమే శ్రేష్ఠమయితే దాన్నే స్వీకరిస్తానంటావు కదూ! పనికిరాదది నీవంటి దేహాభిమానికి. దేహాభిమాన మేమాత్రమున్నా వారికి సంపూర్ణ కర్మత్యాగం శక్యం కాదు. కాబట్టి సాత్త్విక కర్మఫలత్యాగే 'త్యాగి' అనిపించుకొంటాడు.

ఇక ఈ కర్మఫలత్యాగ విశేషం గమనించు. సకాములయిన అజ్ఞులకు, మరణానంతరం వారివారి ధర్మాధర్మ కర్మలకు ఫలంగా స్వర్గ నరక మనుష్యలోకాలు సంప్రాప్తిస్తాయి. కాని కర్మఫలత్యాగులకు లేక జ్ఞాననిష్ఠులయిన సన్న్యాసులకు ఇవేవీ ఎన్నడూ కల్గవు. సన్న్యాసులకు, త్యాగులకు కర్మఫలత్యాగమనే సామ్యముంది. వీరు సాత్త్వికులు కాబట్టి పాపం చెయ్యరు. పుణ్యం ఈశ్వరార్పణం కావిస్తారు. అందుచేత ఇష్టానిష్ట మిశ్రఫల ప్రసక్తి లేదు. సర్వాత్మదృష్టి గల సన్న్యాసులకు కర్మప్రసక్తే లేదు. ఇక ఫలం మాటే లేదు. త్యాగులు చిత్తశుద్ధి వల్ల సన్న్యాసనిష్ఠ పొందుతారు. కనక, వారికీ ఈ ప్రాప్తి లేదు. అందుచేత ఈ లోకాలు అజ్ఞులకే అని గ్రహించు.

**అర్జునుడు :**

భగవాన్! కర్మల సిద్ధికి కారణా లేమిటి? కర్మ చేస్తుంటే కర్మఫలం లభించకుండా ఎట్లా ఉంటుంది?

**శ్రీకృష్ణభగవానుడు :**

అర్జునా! కర్మకాండాంతమైన వేదాంతంలో కర్మసిద్ధికి ఐదు కారణాలు చెప్పబడ్డాయి. అవి ఏమంటే-

1. శరీరం 2. అహంకారం 3. మనోబుద్ధులతో కూడిన దశేంద్రియాలు 4. ప్రాణాదుల వివిధ కార్యాలు 5. చక్షురాది ఇంద్రియాల కధిష్ఠాతలైన ఆదిత్యాది దేవతలు.

మనుష్యుడు త్రికరణాలతో ఆరంభించే ధర్మాధర్మ కార్యాలకన్నింటికి ఈ ఐదు హేతువులు.

ఈవిధంగా కర్మలీ ఐదింటిచేత సాధింపబడుతుంటే అకర్త అయిన ఆత్మనే కర్తగా తలపోసే దుర్మతి సమ్యగ్దర్శి కాడు. అంటే అతని బుద్ధి, శాస్త్రాచార్యాదుల వల్ల సరిగా సంస్కరింపబడలేదని భావించాలి.

ఎవడికి నేను కర్తననే అహంభావం, కర్తృత్వాభినివేశం లేదో; ఎవని బుద్ధి కర్మ ఫలలిప్తం కాదో; అతడు లోకదృష్టికి ఎటువంటి ప్రాణిని హతమార్చినా, వధించని వాడే. అతడు హత్యాఫలమైన అధర్మానికి బద్ధుడు కాడు.

కర్మప్రవృత్తికి హేతువులు మూడు :

1. జ్ఞానం : ఇష్టసాధన విషయమైన జ్ఞానం.
2. జ్ఞేయం : ఇష్టసాధనకు సంబంధించిన కర్మ.
3. పరిజ్ఞాత : తెలిసికొనేవాడు, అవిద్యాపరికల్పిత భోక్త.

కర్మాచరణానికి మూలాలు :

1. కరణం : ఇంద్రియాలు
2. కర్మ : క్రియ
3. కర్త : చేసేవాడు

ఆత్మకు వీటితో ఏమాత్రం సంబంధం లేదు. ఆత్మ నిష్క్రియం.

సాంఖ్యదర్శనం ప్రకారం జ్ఞానం, క్రియ, ఫలాలు కూడా సత్త్వరజస్తమోగుణ భేదాలుగా నిర్వచింపబడ్డాయి. వాని స్వరూపం తెలుసుకోటం అవసరమే.

ఏ జ్ఞానం వల్ల సమస్త ప్రాణుల్లోను అవిభక్తంగా, ఏకము, అవ్యయము అయిన ఆత్మ నెవడు దర్శింపగలడో ఆతని అద్వైతాత్మరూపమైన జ్ఞానం సాత్త్వికంగా తెలుసుకో.

కాని ఏ జ్ఞానం సర్వభూతాల్లో వేరువేరుగా ఉండే ఆత్మల్ని అనేకాలుగా గ్రహిస్తుందో, అది రాజసికంగా గ్రహించు.

ఇంకా ఏ జ్ఞానం వల్ల ఒకానొక శరీరంలోనో, లేక ప్రతిమలోనో ఉండేదే సంపూర్ణాత్మ లేక ఈశ్వరుని ఉనికి అనే అభినివేశం కలిగిస్తుందో అది తామసికం. ఇది యుక్తిసహం కాదు. నీచం కూడా. రాజసిక తామసిక జ్ఞానాలు సంసార విచ్ఛేదన కారణాలు కావు. కాబట్టి మానవుడు రాజసిక తామసిక జ్ఞానాలు త్యజించి, సాత్త్విక జ్ఞానాన్ని గ్రహించాలి.

అర్జునా! ఇదేరీతిగా త్రివిధకర్మభేదాలు కూడా తెలుసుకోవాలి. ఫలాకాంక్షా విరహితంగా, మిత్రుల పట్ల ప్రీతి, శత్రువుల పట్ల ద్వేషం త్యజించి, ఆసక్తి రహితంగా వ్యక్తి అనుష్ఠించే నిత్య కర్మాచరణం సాత్త్వికకర్మ మనబడుతుంది.

ఇంక, ఫలాకాంక్షతోనో, అహంకారంతోనో అనుష్ఠింపబడే బహు కష్టసాధ్యమైన యాగాది కర్మలు రాజసికంగా భావించవచ్చు.

పర్యవసానాలైన శుభాశుభాల్ని, శక్తిక్షయాన్ని, హింసను, స్వసామర్థ్యాన్ని విచారించకుండా అవివేకంతో అనుష్ఠింపబడే కర్మలు - తామసికం.

ఈవిధంగానే త్రివిధకర్తల్ని గూర్చి వివరిస్తాను. ముక్తసంగుడు, నిరహంకారి, ధృత్యుత్సాహ సమన్వితుడు సిద్ధ్యసిద్ధుల పట్ల నిర్వికారుడు అయిన కర్త సాత్త్వికుడు.

వాసనాకులచిత్తుడు, కర్మఫలాకాంక్షి, పరద్రవ్యాసక్తుడు, స్వధనదానాసక్తుడు, హింసాత్మకుడు, అశుచి, హర్షశోకాన్వితుడు అయిన కర్త రాజసికుడు.

ఏకాగ్రతా విరహితుడు, ప్రాకృతుడు, స్తబ్ధుడు, శఠుడు, స్వార్థపరుడు, పర వ్యాపార నాశకుడు, అలసుడు, విషాది, దీర్ఘసూత్రు డయిన కర్త తామసికుడు.

ధనంజయా! ఇదేరీతిగా బుద్ధిలోను, ధృతిలోను కూడా గుణాల ననుసరించి త్రివిధ భేదా లున్నాయి. వీటిని గురించి కూడా పూర్తిగా చెప్తాను, విను.

పార్థా! ప్రవృత్తిమార్గం, నివృత్తిమార్గం, కర్తవ్యాకర్తవ్యాలు, విహిత నిషిద్ధాలు, భయాభయాలు, బంధమోక్షాలు ఏ బుద్ధి గ్రహించగలదో, ఆ బుద్ధి సాత్త్వికి.

శాస్త్రవిహితాలు, శాస్త్రనిషేధాలు అయిన కర్మలు, కర్తవ్యాకర్తవ్యాలు నిర్ణయించేవి కాక సందిగ్ధంగా, తద్వ్యతిరేకంగా తెలుసుకొంటుందో ఆ బుద్ధి రాజసి.

అర్జునా! ఏ బుద్ధి, అధర్మం, ధర్మంగా మన్నిస్తూ సర్వార్థాలు విపరీతంగా గ్రహిస్తుందో, అది తమసావృతమైన బుద్ధి.

ఇంక ధృతిలో గల త్రివిధ భేదాలు తెలియజేస్తాను. ఏకాగ్రచిత్తంతో విషయాంతర వ్యావృత్తి లేని యేధృతి వల్ల, మనఃప్రాణేంద్రియ క్రియలు శాస్త్రమార్గా న్ననుసరించి నియమింపబడుతున్నాయో ఆ ధృతి సాత్త్వికి.

కాని పార్థా! ఏ ధృతి వల్ల మోక్షాన్ని గ్రహించకుండా, ధర్మార్థకామాలే నిత్య కర్తవ్యాలుగా పరిగణిస్తుందో, ఇంకా కర్తృత్వాదుల్లో అభినివేశంతో ఫలాపేక్ష ప్రముఖంగా భావిస్తుందో, ఆ ధృతి రాజసి.

పార్థా! దుర్మేధోపేతుడైన వ్యక్తి ఏ ధృతి వల్ల నిద్ర, భయం, శోకం, విషాదం, మదం పరిత్యజింపడో ఆ ధృతి తామసి.

భరతర్షభ! ఇక త్రివిధసుఖా లెట్టివో విను. దీర్ఘాభ్యాసం వల్ల వ్యక్తి ఏ సుఖంలో ప్రీతిని, దుఃఖనాశాన్ని పొందగలడో; ఏ సుఖం ప్రారంభంలో విషం లాగాను, పరిణామంలో అమృతతుల్యంగాను ఉంటుందో; ఏ సుఖం ఆత్మనిష్ఠమైన బుద్ధి నిర్మలత నుండి ఉత్పన్నమౌతుందో, ఆ సుఖం - సాత్త్వికం.

శబ్దాది విషయాలు, శ్రోత్రాదులైన ఇంద్రియాలతో కూడటం వల్ల కల్గే సుఖం, అనుభవించేటప్పుడు మొదట్లో అమృతోపమంగాను; భోగాంతంలో విషతుల్యం గాను ఉంటుందో ఆ సుఖం - రాజసికం. బలవీర్యరూప ప్రజ్ఞా మేధోత్సాహాలు పాడుచేస్తుంది కాబట్టి అది విషతుల్యంగా భావితం.

ఏ సుఖం మొదట్లోను, చివరను, ఆత్మకు మోహం కల్గిస్తుందో, ఏ సుఖం నిద్రాలస్య ప్రమాద సముద్భవమో ఆ సుఖం తామసికం. సాత్త్విక సుఖం - ఆత్మబుద్ధి ప్రసాదం నుండి; రాజసిక సుఖం - విషయేంద్రియ సంయోగం నుండి; తామసిక సుఖం - నిద్రాలస్య ప్రమాదాల నుండి కల్గుతుందని గమనించు.

భూలోకంలోగానీ, స్వర్గంలోగానీ, లేక దేవతల్లోగానీ, ఏ ప్రాణి అయినా సరే, ప్రకృతి సంజాతమైన త్రిగుణాల నుండి విముక్తి పొంద లేదు. అంటే ప్రకృతి, సత్త్వరజస్తమోగుణాల సామ్యావస్థే. ఈ గుణత్రయం, వైషమ్యావస్థ పొందినప్పుడు ప్రకృతిజాతా లనబడతాయి.

**అర్జునుడు :**

అయితే భగవాన్! జీవునకు మోక్ష మెట్లా లభిస్తుంది?

**శ్రీకృష్ణభగవానుడు :**

ఏముంది? స్వాధికార విహిత కర్మలతో పరమేశ్వరుణ్ని ఆరాధిస్తే తత్ప్రసాద లబ్ధమైన జ్ఞానంవల్ల మోక్షం లభిస్తుంది. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రుల కర్మ సముదాయం కూడా ప్రకృతి జాత గుణాల ననుసరించే ప్రవిభక్తమైనాయి. ప్రకృతి జాత మంటే ఈశ్వరుని ప్రకృతి అయిన త్రిగుణాత్మకమాయ. వర్తమాన జన్మలో కార్యాభిముఖమయ్యే పూర్వజన్మ సంస్కారం. స్వభావజాతాలైన గుణత్రయం వల్లనే బ్రాహ్మణాదుల కర్తవ్యాలు విభజింపబడుతున్నాయి. ఆ వివరాలు విను.

శమం, దమం, తపస్సు, శౌచం, క్షమం, ఆర్జవం, విజ్ఞానం, ఆస్తిక్యబుద్ధి, బ్రాహ్మణ స్వభావ జాతాలు.

శౌర్యం, తేజస్సు, ధృతి, కార్యదక్షత, యుద్ధంలో పారిపోకుండటం, దానం, ఔదార్యం, శాసింపగల శక్తి - ఇవి క్షత్రియుని స్వాభావిక లక్షణాలు.

కృషి, గోరక్ష, వాణిజ్యం, వైశ్యస్వభావోచిత కర్మలు, సేవారూపక కర్మ శూద్ర స్వభావోచితం.

తమ తమ వర్ణమునకు, ఆశ్రమానికి చెందిన కర్మల్లో అభిరతుడైన నరుడు జ్ఞానయోగ్యుడు. స్వకర్మనిరతు డెట్లా జ్ఞానయోగ్యుడో చెప్తాను, విను.

ఏ సర్వాంతర్యామి యైన పరమేశ్వరుని నుండి ప్రాణుల ఉత్పత్తి, కర్మ ప్రయత్నం సంభవిస్తున్నదో ఏవ డీ విశ్వమంతటా వ్యాప్తుడో, ఆతణ్ని మానవుడు స్వీయ వర్ణాశ్రమ కర్మానుసారం అర్చించి సిద్ధి పొందగలడు.

**అర్జునుడు :**

భగవాన్! కేవలం వర్ణాశ్రమ కర్మాచరణం వల్లనేనా సిద్ధి? వర్ణాశ్రమ విహీనులకు సిద్ధి లేనే లేదా?

**శ్రీకృష్ణభగవానుడు :**

ఇప్పుడు కర్మప్రశంస చేస్తున్నాం కాబట్టి వర్ణాశ్రమాలు స్తుతింపబడ్డాయి. ఆర్యులు, అనార్యులు, స్త్రీలు, పురుషులు అనే భేదం లేకుండా అందరికీ ఆత్మ జ్ఞానాని కధికార ముంది. జన్మాంతర సంచిత సంస్కారం వల్ల కూడా సిద్ధి లభిస్తుంది. కానీ వర్ణాశ్రమ ధర్మానుష్ఠానం రాజమార్గం. నిష్కంటకం.

అంతేకాదు. ధృతి, క్షమ, దయ, అస్తేయం, శౌచం, ఇంద్రియ సంయమం, బుద్ధి, ప్రతిపక్ష సంశయాదుల నిరాకరణశక్తి, ఆత్మజ్ఞానం, సత్యం, అక్రోధం అనే ఈ దశ లక్షణాలు అందరికీ ఆదరణీయాలు. వీటి ఆచరణ మందరికీ శ్రేయోదాయకం.

అయితే బాగా అనుష్ఠింపబడ్డ అన్యధర్మం కన్న అసంపూర్ణంగానైనా, అంగహీనంగానైనా అనుష్ఠింపబడ్డ ఆత్మధర్మం మిన్న. శ్రేయస్కరం. స్వభావ నియత కర్మానుష్ఠానం వల్ల పాపం సంప్రాప్తించదు సుమా! కనుక బంధువధ దోషమే అయినా యుద్ధం నీ స్వధర్మం. కాబట్టి ఆ దోషం నిన్నంటుకోదు. పరధర్మమైన భిక్షాటనం కంటే స్వధర్మమైన యుద్ధమే నీ కెంతో శ్రేయోదాయకం.

కౌంతేయా! మళ్లీ నొక్కి వక్కాణిస్తున్నాను - బాగా విను. దోషయుక్తమే అయినా స్వధర్మ నిర్దిష్ట కర్మ త్యజించకూడదు. ఎందుకంటే అగ్ని పొగచేత కప్పబడినట్లుగా, ప్రతి కర్మా ఏదో ఒక దోషంతో కప్పబడే ఉంటుంది. పొగను ఊది, అగ్నిని రగిల్చి నట్లుగా, దోషం త్రోసిపుచ్చి, స్వధర్మంలోని గుణాంశాన్ని ఆదరించాలి. అందువల్ల నీ ధర్మానికి నీవు న్యాయం చేసినవాడి వౌతావు. చిత్తశుద్ధి లభిస్తుంది.

ఏవం విధంగా స్వధర్మాచరణం వల్ల లభించిన చిత్తశుద్ధి మూలంగా సర్వ విషయాల్లో ఆసక్తి పోయి, అనాసక్తి అభివృద్ధిచెందుతుంది. సంయతచిత్తుడవు కాగల్గుతావు. భోగాకాంక్ష నశిస్తుంది. సమ్యగ్దర్శన మేర్పడుతుంది. సాత్త్విక త్యాగం చేత సర్వకర్మ నివృత్తి బలపడి బ్రహ్మజ్ఞానం పొందుతావు.

కౌంతేయా! ఈవిధంగా సిద్ధిని పొందిన వ్యక్తి, అతడు బ్రాహ్మణుడు కానీ, క్షత్రియుడు కానీ, వైశ్యుడు కానీ, శూద్రుడైనా సరే; ఏ జ్ఞాన నిష్ఠ ననుసరించి పరమాత్మను పొందుతున్నాడో, ఏది జ్ఞానపరిసమాప్తో, ఆ జ్ఞాననిష్ఠాప్రాప్తిక్రమం సంక్షిప్తంగా తెలుసుకో.

ఆత్మే బ్రహ్మమనే నిశ్చయాత్మక విశుద్ధబుద్ధితో; ధైర్యంతో శరీరేంద్రియ సంఘాతం సంయమించి శరీరావసరానికి గాక తక్కిన శబ్దాది విషయాలు త్యజించి అనవసరమైన రాగద్వేషాలు కూడా విడనాడి; నిర్జన స్థానవాసి, మితభోజీ ఐ, త్రికరణాలు నియమించి, ఇతర కర్తవ్యాలేమీ లేకుండా, నిత్యము ధ్యానయోగ పరాయణుడై, వైరాగ్య మవలంబించి, దేహేంద్రియాల మీద ఆత్మబుద్ధిని, అహంకారాన్ని, యోగబలగర్వాన్ని, కామాన్ని, క్రోధాన్ని స్వీకరించకుండా విడిచిపెట్టి అపరిగ్రహుడై, శరీరం పట్ల, జీవితం పట్ల మమతాగంధవివర్జితుడై, శాంత చిత్తుడైన వ్యక్తి ఇహజీవనంలోనే బ్రహ్మజ్ఞానోపలబ్ధికి సమర్థుడు.

అటువంటి సమర్థుడు, ప్రసన్నాత్ముడు. అతడు శోకింపడు. కాంక్షింపడు. సర్వ జీవ సుఖదుఃఖాలు తన సుఖదుఃఖాలుగానే భావిస్తాడు. అతనికి నాయందు పరాభక్తి ప్రాప్తిస్తుంది.

ఈ పరాభక్తుడు నా సవిశేష, నిర్విశేష తత్త్వం గ్రహించి, అద్వైత చిన్మాత్రుణ్నైన నన్ను ఆత్మరూపంలో సాక్షాత్కరింపచేసుకొంటాడు. ఈ సాక్షాత్కారం వల్ల నా యథార్థస్వరూపం గ్రహించి, వెనువెంటనే నాలోకి ప్రవేశిస్తాడు. జీవత్కాలంలోనే మత్స్వరూపు డౌతాడు. అంటే పరమానందస్వరూపు డవుతాడు. సగుణబ్రహ్మ యొక్క నిర్గుణభావం పొందుతాడనీ చెప్పవచ్చు.

ఎల్లప్పుడు నిత్యనైమిత్తిక కర్మలన్నింటినీ స్వర్గాది ఫలాపేక్షతో కాక, నన్నే ఆశ్రయం చేసుకొని అనుష్ఠించే వ్యక్తి, నా అనుగ్రహం వల్ల, సనాతనము, అక్షయమునైన స్థానం అందుకొంటాడు.

కాబట్టి వివేకబుద్ధితో ఐహికాముష్మిక కర్మలన్నీ నాకు సమర్పించు. మత్పరుడవు కా. నన్నే పరమపురుషార్థంగా సంభావించు. బుద్ధియోగ మవలంబించు. నిరంతరం మద్గతచిత్తుడవు కా.

మద్గతచిత్తుడవైతే, నా అనుగ్రహం వల్ల దుస్తర సంసారహేతువు లన్నింటిని అతిక్రమించగలవు. ఇట్లా చేయకుండా, దురహంకారంతో సంచరిస్తే, పరుషార్థ భ్రష్టుడ వవుతావు.

వినష్టుణ్ని అయినా సరే కానీ బంధుగులతో యుద్ధం చేయనని శరుడవై అహంకరిస్తే అది భ్రమమూలకం. నీ ప్రయత్నం వ్యర్థం. క్షత్రియోచిత స్వభావం నిన్ను యుద్ధంలో నియోగిస్తుంది తెలుసా.

కౌంతేయా! మోహవశుడవై, ఏ పని చేయకూడదని నీవు నిశ్చయించు కొంటావేమో, స్వభావజాతమైన నీ క్షత్రియోచితబుద్ధి నిన్ను నిబద్ధుణ్ని కావించి, నీ యిష్టానికి వ్యతిరేకంగానే నీచేతనే సముచితకర్మ సమకూరుస్తుంది.

అర్జునా! అంతర్యామి యైన నారాయణుడు సర్వజీవుల హృదయాల్లో అధిష్ఠించి యంత్రంలోని బొమ్మల లాగా తన మాయచేత జీవకోటిని త్రిప్పుతూ నియమిస్తాడు. ఈవిధంగా జీవులందరు పరమేశ్వరునికి పరతంత్రులు. తెలుసుకో. నీ వనుకొన్నట్లు నీవు చేయలేవు. కాబట్టి 'నేను యుద్ధం చేయను' అని అహంక రించకు.

భారతా! సర్వతోభావంతో ఆ ఈశ్వరుణ్నే శరణుపొందు. ఆయన కృప వల్ల నీకు పరమశాంతి లభిస్తుంది.

రహస్య మంత్రతంత్రాదుల కన్న కూడా అత్యంత రహస్యమైన జ్ఞానం నీకు బోధించాను. దీన్ని సంపూర్ణంగా విమర్శించుకొని, ఏది నీకు హితవని భావిస్తావో దాన్ని ఆచరించు.

ఇంకా సర్వగుహ్యతమ పరమ వాక్కు తిరిగి వినిపిస్తాను - విను. నీవు నా కత్యంత ప్రీతిపాత్రుడవు. ఆ కారణంగా నీ కేది హితవో నేనే చెప్తాను,

"మద్గత చిత్తుడవు కా.
మద్భక్తుడవు కా.
నన్ను పూజించు.
నాకు నమస్కరించు.
నన్నే పొందుతావు.
ఇది సత్యం.
ఇది ప్రతిజ్ఞాపూర్వక వాక్కు.
నీవంటే నాకెంతో ఇష్టం"

"సమస్త వర్ణాశ్రమ ధర్మాలు పరిత్యజించు. నన్నొకణ్నే శరణువేడుకో. నేను నిన్ను సకల పుణ్యపాపబంధాల నుండి విముక్తుణ్ని గావిస్తాను. శోకించవాకు"

నేను నీకు బోధించిన ఈ గీతాశాస్త్రం తపోవిరహితునకు, అభక్తునకు, శ్రవణాసక్తి లేనివానికి, నన్ను మానవమాత్రుడుగా భావించి, ద్వేషించేవాడికి నీవు చెప్పగూడదు సుమా!

ఎవ డీ యతిరహస్య గీతాశాస్త్రం నా భక్తులకు వివరించి చెప్తాడో అతడు నామీద పరమభక్తి నెఱపినవాడు. అతడు నిస్సందేహంగా నన్నే పొందుతాడు.

గీతోపదేశికుని కంటే ప్రియకృత్తము డీ జగత్తులో నా కింకోడు లేడు. వాని కన్న అన్యులు నాకు ప్రియతము లుండబోరు కూడా.

ఎవడు మన ఇరువురి సంవాదం అధ్యయనం చేస్తాడో వాడు జ్ఞానయజ్ఞంలో నన్ను పూజించినవాడౌతాడు. ఇది నా నిశ్చితాభిప్రాయం.

శ్రద్ధాళువు, అసూయారహితుడు అయిన ఏ నరుడు ఈ గీతను శ్రవణం చేస్తాడో, అతడు కూడా పుణ్యకర్మలొనర్చినవాడు పొందే పుణ్యలోకాలు పొందుతాడు.

పార్థా! ఏకాగ్రచిత్తంతో దీన్ని నీవు బాగా శ్రవణం చేసావు గదా! నీ అజ్ఞాన సమ్మోహం నశించినట్లేనా?

**అర్జునుడు :**

అచ్యుతా! నశించింది నా వ్యామోహం, నీ కృప వల్ల.

లభించింది ఆత్మతత్త్వాత్మిక స్మృతి.

గతించింది నా సందేహం.

పాలిస్తాను నీ ఉపదేశం.

చేస్తాను స్వామీ! యుద్ధం.

భగవద్భక్తియుక్తునకు ఈశ్వరప్రసాదం చేత ఆత్మజ్ఞానం లభిస్తుందని, మోక్షం సహజంగానే సంప్రాప్తిస్తుందని సంగ్రహంగా ప్రబోధించిన భగవంతునికి భక్తిపూర్వక నమస్సహస్రం.

**సంజయుడు :**

ధృతరాష్ట్ర మహారాజా! ఈవిధంగా మహాత్ముడు వాసుదేవుడికి, పార్థుడికి మధ్య రోమాంచకరము, విస్మయదాయకము అయిన సంవాదం ఆలకించాను.

వ్యాసమహర్షి అనుగ్రహం చేత దివ్యచక్షుశ్శ్రోత్రాదులు పొంది యోగతత్త్వము అయిన గీతాశాస్త్రం సాక్షాత్తుగా యోగేశ్వరుడైన శ్రీకృష్ణభగవానుడు వచిస్తుంటే విన్నాను.

మహారాజా! కేశవార్జునుల ఈ అద్భుత పుణ్యసంవాదం సంస్మరించి, సంస్మరించి అనుక్షణం మాటిమాటికి, మాటమాటకు ఆనందతరంగిత హృదయుణ్ణౌతున్నాను.

మహాప్రభో! శ్రీకృష్ణపరమాత్మ అద్భుతోపేత విశ్వరూపసందర్శనం సంస్మరించి సంస్మరించి మహావిస్మయానికి లోనౌతున్నాను. పునఃపునః మహానందం ఆవేశిస్తున్నది.

ఏపక్షంలో యోగేశ్వరుడు శ్రీకృష్ణ భగవంతుడును, ధనుర్ధారుడు పార్థుడును ఉంటారో ఆ పాండవపక్షంలో రాజ్యలక్ష్మి విజయము, అభ్యుదయము సుస్థిరనీతి విరాజిల్లుతాయని నా అభిప్రాయం.

**ధృతరాష్ట్రుడు :**

సంజయా! నీవు గొప్ప సంస్కారవంతుడివి. వ్యాసదేవుని కరుణ కర్హుడవి ఇంత విపులమైన బోధ నాకు కావించావు. పుత్రవ్యామోహుణ్ని. నా కెట్లా ఇదంత అర్థమౌతుంది? దీని సారం సంక్షిప్తంగా తెలియపరచు.

**సంజయుడు :**

మహారాజ! శ్రీకృష్ణభగవానుడే తన ప్రబోధసారం వినిపించాడు. దానినే మీక నేను తెలియజేస్తాను. ఆలకించండి. ఇదే ఈ సంవాదానికి భరతవాక్యం.

**"ఎల్ల ధర్మాలు పరమాత్మకే త్యజించి**
**వాని నొక్కనె శరణన్నవాడు వడయు**
**పుణ్యపాప బంధాల విముక్తి రాజ!**
**అఖిల గీతోపదేశ రహస్య మిదియె!!"**

* * *

ఈ మహోదాత్త సంవాద మెవడు వినిన
శ్రద్ధ చదివిన ఆత్మవిజ్ఞాని యగును;
ఆ పరాత్పరుని యనుగ్రహమ్ము పొందు
కాంతిపథమున పయనింపగలడు నరుడు!

**ఓం తత్ సత్**



# శ్రీమద్భగవద్గీతాదేశాలు కొన్ని

1. పారద్రోలు హృదయ దౌర్బల్యం, కావించు కర్తవ్య కర్మ.
2. అల్ప ధర్మాచరణం, అనల్ప భయాపహరణం.
3. కర్మాచరణకే అధికారివి, కర్మఫలానికి కాదు.
4. యోగివై కర్మ లాచరించు.
5. శ్రద్ధాళువుకే జ్ఞానలబ్ధి.
6. కామ క్రోధ భయ రహితుడవు కా. అదే ముక్తి.
7. సముద్ధరించుకోవాలి, నిన్ను నీవే.
8. అభ్యాసవైరాగ్యాలతో మనోనిగ్రహం సాధించు.
9. అనన్యచిత్తంతో భగవద్ధ్యానమగ్నుడవు కా.
   భక్తుని యోగక్షేమాలు భగవంతుడే వహిస్తాడు.
10. సకల కర్మలు భగవదర్పితం కావించు.
11. సర్వభూత హితరతుడవు కా.
12. స్వధర్మ నిర్వహణం శ్రేయస్కరం. పరధర్మం భయావహం.
13. జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖానుగత దోషాలు సందర్శించి సంస్కరించుకో.
14. త్యాగంవల్లనే శాంతి.
15. భగవ దభీష్టం నెరవేర్చే ఉపకరణంగా ఉజ్జీవించు.
16. సంశయాలతో కొట్టుమిట్టాడకు. భగవదాశ్రయమే సర్వోపశమనం.
17. నిత్య సంతృప్తితో, భగవదర్పిత మనోబుద్ధులతో భక్తుడుగా జీవించు, భగవత్ప్రీతిపాత్రుడ వవుతావు.
18. భగవంతుణ్నే సదా సంపూర్ణంగా శరణు పొందు.

ఓం తత్ సత్